# कार्ल मार्क्स
व
# फ़्रेडरिक एंगेल्स

## उपनिवेशवाद
के बारे में

చింగీజ్ ఐత్‌మాతొవ్

# తల్లి భూదేవి

నవలిక



''రాదుగ'' ప్రచురణాలయం

మాస్కో

నాన్నా, తొరెకూల్ ఐత్‌మాతొవ్
నిన్నెక్కడ భూస్థాపితం చేశారో నాకు తెలియదు,
దీనిని నీకు అంకితం చేస్తున్నాను.
అమ్మా, నగిమా ఐత్‌మాతొవా,
నువ్వు మమ్మల్ని నలుగురినీ పెంచి పెద్దవాళ్లను చేశావు.
దీనిని నీకు అంకితం చేస్తున్నాను.

# 1

సరికొత్తగా చలువచేసి ఇస్త్రీచేసిన తెల్లని ఫ్రాక్ వేసుకుని, నల్లని బొంతకోటు తొడుక్కుని, తలకు తెల్లని రుమాలు చుట్టుకుని దుబ్బుల మధ్య వున్న బాట వెంట మెల్లగా నడుస్తుంది ఆమె. ఎక్కడా మనిషి అలికిడిలేదు. వేసవి అయిపోయింది. పొలంలో ఏ గొంతూ వినబడ్డం లేదు, మట్టిరోడ్లమీద లారీలొచ్చి ధూళి రేపడం లేదు. ఏ పంటకోత యంత్రమూ దిగ్మండలంలో కానరావడం లేదు, దుబ్బుల్లో మేయడానికని ఇంకా ఏ మందలనూ తోలలేదు.

బూడిదెవర్ణపు హైరోడ్డుకు ఆవల శరత్కాలపు స్తెప్‌మైదానం దూరాన కనుమరుగవుతోంది. బారులుతీర్చిన పొగమబ్బులు స్తెప్‌మైదానం పైన నిశ్శబ్దంగా కదలాడుతున్నాయి. చేనుమీద గాలి మందంగా వీస్తూ, హంస యీకలను పోలిన గడ్డిమొక్కలనూ ఎండిపోయిన కలుపు మొక్కలనూ పిల్ల అలల చందాన వూపుతూ, నదివైపు నిశ్శబ్దంగా జారుకుంటూంది. ప్రాతఃకాలపు హిమతుషారంలో తడసిన గడ్డి సువాసనలని వెదజల్లుతూంది. పంటను ప్రసాదించిన భూమి విశ్రాంతి తీసుకుంటూంది. వాతావరణం ఇక త్వరలోనే చెడిపోతుంది, వానలు మొదలవుతాయి, తొలి మంచు కురిసి నేలను కప్పివేస్తుంది, మంచుతుఫానులు చెల

రేగుతాయి. కాని ఇప్పుడు మాత్రం అంతా నిశ్చలంగా నెమ్మదిగా వుంది.

**ఆమె** ప్రశాంతతకు మనం అడ్డు రాకూడదు. ఆమె అక్కడ ఆగి, ముసలితనపు మసక చూపుంతో పరిసరాలను దీక్షగా పరికించింది.

''ఏం, చేనూ!'' అని ముద్దుగా పిలిచింది.

''ఏం, తొల్గొనాయ్! వచ్చావూ? మరీ ముసల్దానవైపోయావు. తల పండిపోయింది. చేతికి కర్ర కూడా వచ్చిందే.''

''అవును, పెద్దదాన్నయిపోతున్నాను. మరొక యేడాది గడచిపోయింది, మరి — చేనూ, నువ్వొ మరొక పంటను కానుకగా ఇచ్చావు! ఈవేళ స్మృతి దినం మరి.''

''నాకు తెలుసుగా తొల్గొనాయ్! నీకోసమే చూస్తున్నాను. కాని, మళ్ళీ నువ్వు ఒకర్తెవే వచ్చావేమి?''

''అవును, నువ్వు అన్నట్టుగానే, ఒక్కర్తెనే వచ్చాను మళ్ళీనీ.''

''ఐతే, తొల్గొనాయ్! మరి అబ్బాయితో ఇంకా చెప్పలేదా నువ్వు?''

''లేదు, చెప్పడానికి నాకు ధైర్యం చాలకుండా వుంది.''

''నువ్వు చెప్పకపోతే, మరెవరేనా అబ్బాయితో చెప్పరనా? ఎవరైనా నోరు జారి చెప్పవచ్చుగా?''

''అవున్లే, ఆ మాట నాకూ తెలుసు. రేపో మాపో వాడే కనుక్కుంటాడు. ఇక పెద్దవాడయాడు, పరాయివాళ్లనెవరినైనా వాడు అడిగి తెలుసుకోవచ్చు. కాని నా కంటికి వాడింకా చిన్నపిల్లడే. ఇంతకీ, నాకు భయం వేస్తూంది, వాడితో ఏ మాట చెప్పడానికీ భయంవేస్తూంది.''

''మనిషికి నిజం తెలియాలి, తొల్గొనాయ్!''

''ఆ సంగతి నాకు తెలియదనా? నాకూ తెల్సు. అయితే నేనెలా చెప్పేది? నీకు తెలిసినదీ, నాకు తెలిసినదీ, ఓ తల్లీ, చేనూ! అందరికి తెలిసినదీ, వాడికొక్కడికే తెలియదు. మరి, వాడా సంగతి తెలుసుకున్నప్పుడు, ఇక ఏమనుకుంటాడో, జరిగినదాన్ని గురించి వాడి ఆలోచనలు ఎలా వుంటాయో? వాడి మనసూ వాడి హృదయమూ వాడిని

నిజంవైపు తీసికెళ్తాయా? వాడింకా కుర్రాడే. అందుచేతే వాడి విషయమై నేను ఏం చేయాలో ఏం చెందాలో, జీవితంనుండి వాడు పెడముఖం పట్టకుండా వుండేందుకు నేనేమిటి చేయాలో నాకేమీ పాలుపోకుండా వుంది. వాడు జీవితాన్ని ముఖాముఖీ ధైర్యంగా ఎల్లప్పుడూ చూడాలనే నా కోర్కె. జరిగిన సంగతి గురించి, ఏ వన్నెలూ చిన్నెలూ పెట్టకుండా, వున్నది వున్నట్టూ నాల్గు మాటల్లో, అద్భుతకథ చెబుతూన్నట్టుగా వాడితో చెప్పగల్గితే ఎంత బాగుండునో కదా అనిపిస్తూంటుంది. ఈ మధ్యల్లా నాకిదే మనసులో పీకుతూంది, మరొక ఆలోచనే తోచడం లెదు, ఏమంటే నేనేక్షణంలో గుటుక్కుమంటానో, ఏ నిమిషంలో హఠాత్తుగా హరీమంటానో. కిందటి చలికాలంలో నాకు జబ్బు చేసి మంచం పట్టానా మరి, అలా ఆ మంచాన పడినప్పుడు, ఇంకేముంది ఆఖరి గడియలు దగ్గర పడ్డాయనే అనుకున్నాను. చావు అంటే నేనేమీ జడుసుకోలేదు సుమా — ఆ చావు ఏదో వచ్చి వుంటే, రారామ్మనేదాన్నే — నా జడుపంతా, అయ్యో వాడి కన్ను తెరిపించడానికి నాకు వ్యవధి లేకపోయిందే అని. వాడి సత్యాన్ని నాతో కూడా మృత్యులోకంలోకి తీసుకుపోతాను కాబోలు అని మహా భయపడ్డాను. నా ఆందోళన వాడికేమీ అర్థమైంది కాదు. నా గురించి అదే గాభరా పడిపోయాడు, బడికి వెళ్లడం మానేసి, నా మంచం దగ్గరే కూచునేవాడు, ముమ్మూర్తులా మళ్ళీ అచ్చంగా తల్లి పోలికే. 'నాయనమ్మా, నాయనమ్మా! మందు ఇచ్చేదా? పోనీ, మంచినీళ్లు తాగుతావా? మరో బూర్నీసు తెద్దునా?' ఎంత ప్రయత్నించినా, మరి ధైర్యం చాలిందికాదు, ఏం చెప్పడానికీ మనసొప్పింది కాదు. నేనంటే వాడికి ప్రాణమే. వుత్త అమాయకుడు, ఓ చెంప నీళ్లూ ఓ చెంప పాలూ. కాలం గడిచిపోతుంది, నాకేమో ఏం చెప్పడానికీ నోరాడకుండా వుంది — ప్రస్తావన ఎలా తీసుకురావడమో తెలిసింది కాదు. పరిపరి విధాల ఆలోచించాను, ఏది ఆలోచించినా చివరకి ఒకటే పర్యవసానానికి వచ్చేదాన్ని. జరిగినదంతా వాడు సరిగా అర్థంచేసుకుని పూర్వాపరాలు సరిగా గ్రహించు

కోవాలంటే, జీవితాన్ని సరిగా తెలుసుకోవాలంటే, నేను వాడితో చెప్పాల్సింది ఒక్క తన గురించే కాదు, తన జీవితం గురించే కాదు, ఇంకా ఇతరులనేకులను గురించి, వాళ్ల జీవితాలను గురించి, నా గురించి, నేను బతికిన రోజుల్ని గురించి, ఓ చేనా! నీ గురించి కూడానూ, మనిద్దరి జీవితం గురించీనీ, ఏ పాపమూ ఎరగకుండా వాడు బడికి రోజూ ఎక్కి వెళ్తున్న సైకిలు గురించీ — అన్నిటి గురించీ చెప్పాలి వాడితో. అదే సరైన మార్గమేమో మరి. ఏమంటే, దేనిని వదలిపెట్టేసేందుకూ వీల్లేదాయె, దేన్నీ అదనంగా చేర్చేందుకూ వీల్లేదాయె: జీవితం మననందరినీ కలిపి ఒక చోవికింద తయారుచేసింది, మననందరినీ కలిపి ఒక ముప్పేట ముడి వేసేసింది. మరేమో, కథ ఎలా తిరిగిందంటే, నాలుగు కాలాలు బతికిన వాడికేనా దారీ తెన్నూ సరిగా కనబడకుండా వుందాయె. హృదయమూ అంతఃకరణా దాన్ని గ్రహించాలంటే, దాన్ని అనుభవించి తీరాలి.... మరి నేనేమో, ఇలాగే అనుకుంటాను.... ఇది నా విధి, దీనిని నేను చేయక తప్పదు, దీనిని నేను చేస్తినా, ఇక చావు అంటే నాకు భయంలేదు.''

''ఇల్లా కూచో, తొల్గొనాయ్. నిలబడకు, కాళ్ళు పీకుతాయి. అదిగో, ఆ రాతిమీద కూచో, మనమిద్దరం కలిసి ఆలోచిద్దాం. తొల్గొనాయ్, నీకు జ్ఞాపకం వుందా, తొలిసారి నువ్వు ఇక్కడకు రావడం?''

''జ్ఞాపకం తెచ్చుకోవడం కష్టమే సుమా, అప్పటికీ ఇప్పటికీ ఎంత జరిగిందో మరి!''

''అవున్లే, ఐనా జ్ఞాపకం తెచ్చుకుందుకు ప్రయత్నించు, ఓం ప్రథమంనుంచీ కూడా జ్ఞాపకం తెచ్చుకుందుకు ప్రయత్నించు.''

## 2

నాకేమిటో లీలగా జ్ఞాపకం వుంది, నేనింకా బాగా చిన్నపిల్లనే, వన్నిక్కడికి, ఈ చేను దగ్గరకి, పంటకోత రోజుల్లో చేయిపట్టుకుని

నడిపించి తీసుకొచ్చి గడ్డిమేటు నీడను కూచోబెట్టేవారు. నేను ఏడవకుండా బుద్ధిగా వుండేందుకని ఓ రొట్టె ముక్క నా చేతిలో పెట్టి కోతలకు వెళ్ళిపోయేవారు. కాస్త పెద్దదాన్నయాక, పరుగెత్తుకుని ఇక్కడికొచ్చి, పంటకి కాపు వుండేదాన్ని. వసంతకాలంలో కొండల్లోకి మందలు తోలుకుంటూ ఈ దారంటే వచ్చేవాళ్ళు. ఆ రోజుల్లో నేను జుట్టు విరబోసుకుని, రైంయ్‌మని దూసుకుపోయే బాణంలా పరుగెత్తేదాన్ని. నిజంగా, రోజులంటే చిన్నతనపు రోజులే రోజులు — అద్భుతంగా, చీకూ చింతా లేకండా వుంటాయికదా! పసిమిలోయలోనుంచి గుర్రపుమందలవాళ్ళు రావడం నాకు జ్ఞాపకం వుంది. మంద తర్వాత మంద అలా వచ్చి, కొత్త పచ్చిక బీళ్ళకోసమని చల్లని కొండల్లోకి వెళ్ళేవి. గుర్తుకు తెచ్చుకుంటే ఇప్పుడనిపిస్తుంది, ఎంత మతిమాలినదానవో నేనప్పుడని. మందలు బ్రహ్మాండమైన హిమరాశి దొర్లినట్టు భూమిని దద్దరిల్లజేస్తూ స్తెప్‌మైదానంమీద నుండి కదలిపోయేవి, వాటి దారిలో గనుక నిలబడితే, వాటి కాళ్ళకింద పడి పచ్చడైపోవలసిందే — ఒక్క క్షణంలో, అంతే మరి. ధూళి స్తంభాలు ఒక మైలు ఎత్తున లేచి ఆకాశాన్ని అందుకునేవి, మరి నేనేమో గోధుమ చేనులో దాంకుని, చెంగున ఒక్క దాటువేసి, అడవి జంతువులా తటాలున వాటి దారికడ్డంగా నిలబడి వాటిని బెదరగొట్టేదాన్ని. గుర్రాలు హడలిపోయి పక్కకి తప్పుకునేవి, మందలవాళ్ళ నామీద విసుక్కుంటూ నన్ను వెంబడించి తరిమేసేవారు.

''ఏయ్, చింపిరి జుట్టు పిల్లా! వుండుండు, నిన్ను పట్టుకుని యేం జేస్తామో!'' అని కేకలేసేవారు.

నేను మాత్రం వాళ్ళకి దొరక్కుండా తప్పించుకుంటూ పంట కాల్వలగట్లు దిగిపోయి పారిపోయేదాన్ని.

పింగళవర్ణపు గొర్రెమందలు, కొవ్వుబారిన తోకలు, ధూళితో నిండిన గాలిలో ఆడుతూవుంటే, వడగళ్ళు పడినట్టు డెక్కలతో టపటపమని చప్పుడు చేసుకుంటూ, ప్రతీ రోజూ ఇలా వెళ్ళేవి. చామనచాయ ముఖాలూ,

బొంగురు గొంతుకలూ వాళ్లూ, ఆ గొర్రెలకాపరులు మందలను అలా ముందుకు తోలుకుపోయేవారు. వీళ్లు వెళ్లిపోయిన తర్వాత ద్రాక్షసారాయి నిలవచేసే తోలుసంచులనిండా పులియబెట్టిన గుర్రపు పాలు నింపుకుని, ఆ సంచులను జీనులకు కట్టి, మోతుబరి గ్రామాల సంచార శిబిరాలు ఒంటె బిడారాలతో వచ్చేవి. యువతులూ కొత్త పెళ్లికూతుళ్లూ పట్టు దుస్తుల్లో సింగారించుకుని, పచ్చని పచ్చికబయళ్ల గురించీ వినిర్మల నదీ జలాల గురించీ పాటలు పాడుకుంటూ చెంగుచెంగున గంతులేస్తూన్న తమ దాట్ల గుర్రాలమీద ఊగుతూ తూగుతూ సాగిపోయేవారు. వాళ్లను చూసి నేను ఆశ్చర్యంతో నోరెళ్లబెట్టుకునేదాన్ని, ఇక లోకంలో వున్న అన్ని సంగతులనూ మరచిపోయి, వాళ్లవెంటే అలా ఎంతో దూరం పరుగెత్తివెళ్ళేదాన్ని. ''ఇలాంటి దుస్తులూ, ఇలాంటి కుచ్చుల శాలువలూ నాకు కూడా వుంటేనో!'' అని అనుకుని, కలలు కంటూ, వాళ్లు కనుచూపుమేర దాటిపోయే వరకూ వాళ్లకే కళ్లు అప్పగించి అలా చూస్తూండేదాన్ని. ఆ రోజుల్లో నా పరిస్థితేమిటి? నేనెవర్తను? కూలికి పనిచేస్తూన్న కిరాయి కమతగాడి కూతురిని. కాళ్లకు తొడుక్కొందుకు జోళ్లయినా లేవు నాకు, వుత్త కాళ్లతో నడచేదాన్ని. తను చేసిన రుణాలు తీర్చుకునేందుకని మా తాత తన యావజ్జీవమూ సైద్యగాడుగా చాకిరీ చేయాల్సివచ్చింది, ఆ రుణభారమూ ఆ చాకిరీయే మా తాతనుండి మా నాన్నకీ మా కుటుంబానికీ వారసత్వంగా సంక్రమించాయి. ఐనా, పట్టు దుస్తులకు నేను నోచుకోకపోయినా, చక్కని చుక్కగా, అందమైన బొట్టెగా పెరిగాను, అందరి కళ్లూ నా మీదే వుండేవి. నా నీడ చూసుకుని నేనే మురిసిపోయేదాన్ని, దానిని చూసుకుంటూనే, అద్దంలో నా బొమ్మను చూసుకుని ముచ్చట పడిపోయినట్టుగానే అచ్చంగా, అలా నడుచుకుంటూ వెళ్ళేదాన్ని.... అరె, దేముడా, ఆ రోజుల్లో నేను నిజంగా తమాషాగానే వుండేదాన్ని. పంటకోతల్లో సువన్‌కూల్ నాకు తారసపడినప్పుడు నాకు పదిహేడేళ్లు కాబోలు. పొలంలో కూలిపనికని ఆ సంవత్సరమే వచ్చాడతడు వేర్‌ప్నీ తలాస్‌నుంచి ఇక్కడికి. నేను కళ్లు

మూసుకుంటే, ఇప్పటిక్కూడా అతడు నా కళ్ల ఎదుట ప్రత్యక్షమౌతాడు — అచ్చంగా ఆనాడు ఎలా వుండేవాడో అలాగే. అప్పుడింకా అతడు బాగా కుర్రవాడే, పంధొమ్మిదేళ్ళో ఏమో. ఒంటిమీద చొక్కాకేనా నోచుకోలేదు, పాత బొంతకోటు ఒకటి వుత్త బుజాలమీదనే కప్పుకునేవాడు. ఎండకు మనిషి ఎంత నల్లబడిపోయాడంటే, పొగబారినట్టే కానవచ్చేవాడు; బుగ్గ ఎముకలు మెరుగుపెట్టిన రాగిలా ధగధగ మెరిసిపోతూండేవి, మనిషి బక్క పలచగానూ సన్నంగానే అవుపడినా, ఛాతి మంచి దృఢంగానూ చేతులు ఉక్కు కడ్డీలలాగానూ వుండేవి. అలాంటి పనివాడు మీకు సాధారణంగా కనపడడు. గోధుమ పంట కోశాడంటే, సునాయాసంగానూ నేల దగ్గ రసా కోసేవాడు, అందునా ఆ చేతిలో కొడవలి ఝూంకారమూ, కొడవలి కోతకు సరసరమంటూ తెగిపడుతూన్న కంకుల చప్పుడూ — ఇవే మన చెవిని పడేవి. ఇలాంటి మనుషులు ఉన్నారనుకోండి; వీళ్లు పనిచేస్తూండగా చూడడమంటే అదొక ఆనందమే. ఇటువంటి వాళ్లల్లో సువన్కూల్ ఒకడు. నేనూ జోరుగా కోసేవాళ్లలో జమే అని అందరు అనేవారనుకోండి, ఐనా అతనితో సరిసమానంగా పనిచేయలేకపోయేదాన్ని. నాతో సమానంగా ప్రారంభించేవాడు సువన్కూల్, కాని నాకంటె ఎంతో ముందుకు వెళ్లి పోయి, అప్పుడు వెనక్కి తిరిగి నావంక చూసి, నాకు సాయంచేయడానికని నాదగ్గరకు తిరిగివచ్చేవాడు. దాంతో నాకు గర్వభంగమై, మంటెత్తుకొచ్చి, అతణ్ణి అక్కడనుంచి తరిమేసేదాన్ని.

''నిన్నెవడయ్యా తిరిగి ఇక్కడికి రమ్మన్నది? నా ఖర్మాన్న నన్ను పనిచేసుకోనీయ్, నువ్వు లేకపోతే నాకేమీ జరగదనుకున్నావ్ కాబోలు!'' అని కసురుకునేదాన్ని.

అతడేమీ కోపం తెచ్చుకునేవాడు కాదు. మెల్లగా తనలో తాను నవ్వుకుని, నాకు సాయంచేసేవాడు. పిచ్చిపిల్లను కాకపోతే, నేనెందు కంత చికాకు పడేదాన్నో?

మేమే అందరికంటే ముందుగా పనిలోకి వెళ్ళేవాళ్లం. ఇంకా పొద్దు పొడిచేదో లేసేలేదో, అందరూ ఇంకా గాఢనిద్రలో మునిగి వుండగానే, మేమప్పుడే పొలం వెళ్లిపోయేవాళ్లం. మా గ్రామం పొలిమేర దగ్గర, దారిలో నాకోసం కాచుకునుండేవాడు సువన్‌కూల్.

"నువ్వు వచ్చావూ?" అనేవాడు నన్ను చూసి.

"నువ్వెప్పుడో వెళ్లిపోయుంటావనే అనుకున్నాను నేను" అనేదాన్ని నేను ఎప్పుడూనూ, నేను లేకుండా తను వెళ్లడని నాకు తెలిసినప్పటికీ కూడానూ.

ఇక అక్కడనుంచి ఇద్దరం కలిసి వెళ్ళేవాళ్లం.

మంచు కిరీటం పెట్టుకుని, అన్నిటికంటే ఎత్తైన పర్వతాలను ఈలోగా పసిడి బంగారంతో ప్రక్షాళనచేస్తూ వేకువ భళ్లున ప్రత్యక్షమయేది. అదే సమయం చూసుకుని స్టెప్‌మైదానం మీదనుండి గాలి వినీల స్రవంతిలా ప్రవహించుతూ పొద్దుతో జట్టుకూడేది. ఈ వేసవి వేకువజాములే మా ప్రేమానురాగపు వేకువజాము. మేమిద్దరం కలసి ఒక్కరమై నడుస్తూన్నప్పుడు, అద్భుతకథలోలాగు ప్రపంచం అంతా అదోలాగు మారిపోయినట్టు వుండేది. మరి ఆ చేనూ అంతే— అందరి కాళ్లకిందా పడి, నాగలితో దున్నేసిన బూడిదెవర్ణపు చేను ప్రపంచం అంతటిలోనూ అతి సుందరమై ముద్దులొలుకుతూన్న చేనుగా అక్కడుండేది. మాతోనే కలసి పొద్దుపొడుపు చూడ్డానికని వేకువనే లేచిన భరద్వాజపక్షి ఒకటి అక్కడ ప్రత్యక్షమయేది. అది ఎత్తున, ఇంకా ఎత్తున ఎగిరిపోయి, మానవ హృదయంలా కొట్టుకుంటూ గజగజ వణకేది. పట్టపగ్గాలులేని ఆనందంతో అది పాడే పాట ఖంగున ప్రతిధ్వనిస్తూ వుంటే, అది సన్నని చుక్కలా దోగాడేది....

"చూడు, చూడు, అది మన భరద్వాజమే పాడుతూంది!" అనేవాడు సువన్‌కూల్.

ఎంత అద్భుతం, మాకోసమని ప్రత్యేకంగా ఒక భరద్వాజం వుండడం!

మరి, ఆ వెన్నెల రాత్రో? అలాంటి వెన్నెల రాత్రి మరొకటి బహుశా

వుండనే వుండదేమో. ఆ రాత్రి సువన్‌కూలూ నేనూ వెన్నెల్లో కోతల పనిచేసుకుందామని వుండిపోయాం. బ్రహ్మాండంగానూ వినిర్మలంగానూ వున్న చంద్రుడు నల్లని కొండ అంచుపైన ఉదయించేసరికల్లా, ఆకాశంలో వున్న నక్షత్రాలన్నీ కళ్ళు తెరిచాయి. నన్నూ సువన్‌కూల్‌నీ అవి చూశా యనే నాకనిపించింది. చేను అంచున, సువన్‌కూల్ బొంతకోటు పరచుకుని, అందుమీద పడుకున్నాం ఇద్దరమూ. పంటకాల్వ గట్టే మాకు తలగడ. తలగడంటే తలగడ కాదు — హంసతూలికలకంటే మెత్తని తలగడ. మరి, అదీ మా తొలి రాత్రి. ఇక ఆ రోజునుండి ఎల్లప్పుడూ మేమిద్దరం కలిసే వుండేవాళ్లం.... అలసటపడిపోయి, పోత ఇనుములా భారంగా వున్న తన చేతితో నా ముఖమూ, నుదురూ, జుట్టూ మెల్లగా నిమురుతూంటే, ఆనందంతో నిండిన అతని హృదయ స్పందన అతని అరచేతిలోనుంచి నాకు వినబడేది.

"సువన్, మనం హాయిగా వుంటాం కదూ, ఏం అంతేనా?" అని నేను అతని చెవిలో చెప్పాను.

సువన్‌కూల్ జబాబు చెప్పాడు:

"భూమీ నీరూ మనుష్యులందరకీ ఎప్పుడైతే సమానంగా పంపిణీ అవుతాయో, మనకి కూడా మన సొంత చేను అంటూ వుండి, మనం సాగుచేసుకుని, విత్తులు చల్లి, మన గింజలు మనం ఎప్పుడైతే నూర్చుకుంటామో — అప్పుడే మనం హాయిగా వుంటాం. అంతకంటె హాయీ అంతకంటె అదృష్టమూ మరి మనిషికి అక్కర్లేదు, తొల్గోన్. విత్తులు చల్లి, పంట చేతికి రావడం — అదే రైతుకి పరమానందం."

మరెందుచేతనో గాని అతని మాటలు నాకెంతో నచ్చాయి, వాటిని అతని నోటంట వింటూంటే ఎంతో హాయి అనిపించింది నాకు. సువన్‌కూల్‌ను గట్టిగా కౌగలించేసుకున్నాను, ఎండకీ వానకీ రాటుదేరిన ఆ వెచ్చని ముఖాన్ని ఎంతో సేపు అలా ముద్దుపెట్టుకున్నాను. తర్వాత పంటకాల్వలో నీటిని ఎగరగొట్టుతూ తొణికించుతూ నవ్వుతూ స్నానం

చేశాం. నీళ్లు చక్కగా చల్లగా వున్నాయి, తళతళ మెరుస్తూ మరియ మారుతపు పరిమళాన్ని వెదజల్లుతున్నాయి. ఇక తర్వాత నేలమీద సాగిల బడి, చేతిలో చేయి వేసుకుని, నిశ్శబ్దంగా ఆకాశంకేసీ నక్షత్రాలకేసీ చూస్తూ వుండిపోయేవాళ్లం. ఆకాశంలో ఎన్ని ఎన్ని నక్షత్రాలున్నాయో ఆ రాత్రి.

ఆ రాత్రి వినీలకాంతిలో భూదేవి కూడా మా ఆనందంలో పాలు పంచుకుంది. ఆ చలువలోనూ నిశ్శబ్దంలోనూ భూదేవి కూడా సంతో షంతో ఉప్పొంగిపోయింది. స్టెప్‌మైదానం అంతటా రవంతైనా సద్దు లేదు. పంటకాల్వలో నీళ్లు జలజల పారుతున్నాయి. తీపి క్లోవరు మొక్కల సువాసనతో తల మత్తెక్కిపోతూంది. అవి మంచి పూతలో వున్నాయి. చేదు వాసనతో నిండిన వెచ్చని గాలి ఎక్కడనుండో అప్పుడప్పుడు వచ్చి రివ్వున వీచేది, ఆ గాలి విసురుకి చేను పొలిమేరనున్న ధాన్యపు కంకులు అల్లల్లాడి, మెల్లగా రెపరెపలాడేవి. బహుశా జన్మజన్మాలకూ అలాంటి రాత్రి అదొక్కటే అనుకుంటాను. రెండు జాముల రాత్రి అయాక, సరిగ్గా అర్ధరాత్రప్పుడు ఆకాశంకేసి చూశాను, చూసేసరికి గడ్డికోతగాని బాట — పాలపుంత, నక్షత్రాల మధ్యనుండి ఆకాశం ఈ కొసనుండి ఆ కొసకు పరచిన వెడల్పు వెండి మైజారు విస్తరించి వుంది. సువన్‌కూల్ మాటలు అప్పుడు నాకు జ్ఞాపకం వచ్చి, దయాళుడూ శక్తివంతుడూ అయిన సేద్య గాడొకడు నిజంగానే ఈ రాత్రే బ్రహ్మాండమైన గడ్డమోపు మోసుకుని ఆకాశాన వెళ్తూ, తన వెంట జాడలో పొల్లూ, గింజలూ రాల్చాడా ఏమిటి చెప్మా అనుకున్నాను. అలా అనుకుంటూండగా తటాలున ఒక ఆలోచన తట్టింది — ఆశలు గనుక ఎప్పుడైనా పండితే, నా సువన్‌కూల్ కూడా తొలి నూర్పు తర్వాత పెద్ద గడ్డిమోపు మోసుకుంటూ కళ్లంలోనుంచి వెళ్ల కూడదా ఏమిటి అనుకున్నాను. మా సొంత గోధుమ పంటనుంచి వచ్చిన తొలి గడ్డిమోపు అవుతుందది. నెత్తావి వెదజల్లుతూన్న ఆ గడ్డిని తన చేతుల్తో మోసుకుని వెళ్తూంటే, అతను కూడా తన జాడల్లో ఇలాగే,

గింజలూ రాల్చుతాడు కదా అనుకున్నాను. అలా అని కలగన్నాను, నక్షత్రాలూ తచ్చాడాయి నా కలలో. కంగంటూనే వున్నాను, తటాలున మెదడులో మెదలింది ఆశ, నా కల అంతా నిజమవుతే ఎంత బాగుండునో కదా అని. ఇక ఆ ఆశ ఎప్పుడైతే పుట్టిందో అప్పుడు తల్లి భూదేవి పంక తిరిగి, మనిషిభాషలో మాట్లాడాను ఆ తల్లితో. ''తల్లీ, భూదేవీ, మమ్మలనందరినీ పాలిచ్చి పెంచావు నువ్వు; మాకు సుఖసౌఖ్యాలను ప్రసాదించకపోతే, మరి నువ్వు భూదేవతవై వుండడమెందుకు, మేము నీ కడుపున పుట్టడమెందుకు? తల్లీ భూదేవీ, నీ పిల్లలం మేం. మాకు సౌఖ్యాన్ని ప్రసాదించు, మమ్మలను సుఖపెట్టు!'' అన్నాను. ఇవీ ఆ రాత్రి నేనన్న మాటలు.

మరునాడు పొద్దున్న నేను నిద్రలేచి చుసుకునే సరికి, సువన్‌కూల్ నా పక్క లేడు. మరి అతడు ఎప్పుడు లేచి ఎప్పుడు వెళ్లిపోయాడో నాకు తెలియనే తెలియదు. పొద్దు పొడవకుండానే వెళ్లిపోయుండాలి. చేనులో ఎక్కడ చూసినా దుబ్బుల మధ్య కొత్తగా కోసిన పసలు కుప్పలు పోసి వున్నాయి. నా మనసుకెంతో కష్టం తోచింది — ఆ వేకువ గడియల్లో అతని సరసనే వుండి అతనితో కలిసి పనిచేయడమంటే అంతకంటే నాకింకేం కావాలి అనిపించింది....

''సువన్‌కూల్! నన్నెందుకు లేపావుకావూ?'' అని కేకేశాను.

నా గొంతు వినబడగానే అతడు నావంక తిరిగి చూశాడు; ఆనాటి ఉదయం అతడు నా కంటికి ఎలా అవుపడ్డాడో నాకు బాగా జ్ఞాపకం వుంది: నడుము వరకూ నగ్నంగా వున్న శరీరం, చెమటతో మెరుస్తూ కండలు తిరిగిన నల్లని బుజాలు. నన్ను పోల్చుకోలేదా ఏమిటి చెప్మా అనిపించినట్టుగా, ఆనందమూ ఆశ్చర్యమూ కళ్లల్లో తొణికిసలాడుతూ అలా నిలబడి నాకేసి చూసి, మరి కాస్సేపటికి అరచేతితో ముఖం తుడుచుకుని, అప్పుడన్నాడు నవ్వుతూ:

''మరి కాస్సేపు నువ్వు నిద్రపోవడం మంచిదనుకున్నాను.''

''కాని మరి నువ్వో?''

''ఇద్దరి వంతూ నేను పనిచేస్తున్నాగా ఇప్పుడు'' అన్నాడు.

అతని మాటలు చెవిని పడేసరికి నాకు మరీ బాధనిపించి, వొళ్లు కోసినట్టయింది. కాని మనస్సుకి మాత్రం మహా హాయి అనిపించి, అమితానందం అనుభవించాను.

''మరి, నువ్వు నిన్న ఆడిన మాటలన్నీ ఏమయాయి?'' అని దెప్పి పొడిచాను. ''నువ్వూ, నేనూ ఒకే మనిషిలా మనమిద్దరమూ అన్ని విషయాల్లోనూ సమానంగా వుండాలంటివిగా!''

సువన్‌కూల్ తన చేతిలోవున్న కొడవలిని అక్కడ గిరవాటేసి, నా దగ్గరకు పరుగెత్తుకొని వచ్చి, నన్ను తన చేతుల్లో ఎత్తుకుని, ముద్దు పెట్టుకుని అన్నాడు:

''ఈ క్షణంనుంచి మనమిద్దరం అన్నిటిలోనూ కలిసే వుంటాం —ఒక్క మనిషిలా. నా భరద్వాజానివి నువ్వు, నా ప్రాణానివి, నా ప్రేయసివి!...''

నన్ను తన చేతుల్లో ఎత్తుకుని, నడుస్తూ, నాతో ఏమిటేమిటో చెబుతూ, నన్ను భరద్వాజమనీ, ఇంకా మరోవేవో తమాషా తమాషా పేర్లు పెట్టీ పిలిచాడు, నేను అతని మెడకు పెనవేసుకుపోయి, కేరింతలు కొడుతూ, కాళ్లు ఎగరేస్తూ, తెగ నవ్వాను — ఏమంటే పసిపాపలను భరద్వాజాలని పిలుస్తారు, అందులో అందమూ చందమూనూ, అంతేగాని — అయినా ఆ మాటలు అతని నోటివెంట వింటూంటే ఎంతో హాయి అనిపించింది!

సూర్యుడు అప్పుడప్పుడే ఉదయిస్తున్నాడు, కొండ అంచు వెనుకనుండి తన కంటి కొలికిని అప్పుడప్పుడే తెరుస్తున్నాడు. సువన్‌కూల్ నన్ను కిందకి దింపి, నా బుజాలమీద చేయివేసి, తటాలున సూర్యుడివంక తిరిగి కేకేశాడు:

''ఏయ్, సూర్యుడూ! ఇటు చూడవయ్యా, ఇదిగో నా భార్య! ఎటువంటి అమ్మాయిని సంపాదించానో చూశావా మరి! చూసినందుకు నీ కిరణాలతోనూ నీ వెల్తురుతోనూ ముడుపు చెల్లించుకో!''

ఈ మాటలను అతడు హాస్యానికే అన్నాడో, మరి మనసారా అన్నాడో

నాకు తెలీదు కాని, నాకు మాత్రం కళ్లవెంట నీళ్లు తిరిగి, భోళ్లున ఏడ్చే శాను. మనసులోంచి పొంగి పొరలుతూ వస్తూన్న ఆనందాన్ని ఇక ఆపుకో లేకపోయాను.

ఇప్పుడు కూడా ఆ సంగతి జ్ఞాపకం వచ్చి, మరెందుకనో ఏడు పొస్తూంది, పిచ్చిదాన్ని కాకుంటే మరేమిటి! ఐతే, ఆ కన్నీళ్లు వేరు, అలాంటి కన్నీళ్లు మనిషికి జీవితంలో ఒక్కసారే వస్తాయి. మరి, మేం కలలుగ న్నట్టే మా జీవితం గడచిందా? అవును, అలాగే గడచింది. సువన్‌కూలూ నేనూ మా జీవితాన్ని మా చేతులతోనే మలచుకున్నాం, వేసవికాలమయేది చలికాలమయేది వొళ్లు దాచుకోకుండా కష్టపడి పనిచేశాం. చెమటోడ్చి పనిచేశాం. అంతులేకుండా శ్రమపడ్డాం. సరి, ఇక కొత్త రోజులు వచ్చాయి — ఇల్లు కట్టుకున్నాం, గొడ్డూ గోదా సంపాదించుకున్నాం. ఒక్కమాటలో చెప్పాలంటే — మనుషుల్లా బతికాం. ఇక అన్నిటికీ మించిన ఆనందం — నా కడుపున ముగ్గురు కొడుకులు పుట్టారు, వరుసగా ఒకరి తర్వాత ఒకరు, పనసపండులాంటి పిల్లలు. ఇప్పుడు ఒక్కొక్కసారి ఎంతో చికాకు నన్ను పట్టుకుని వేధించుతూంటుంది, ఏవేవో వెర్రిమొర్రి ఆలోచనలు నా బుర్రలోకి జొరబడి నన్ను పీడించుకు తింటూంటాయి: ఆడగొర్రె యీనినట్టు, ఏడాదికీ, ఏణ్ణర్ధానికీ ఏమిటీ కాన్పు నాకు? అందరిలాగా నాకూ ఏ మూడేళ్లకో నాల్గేళ్లకో కాన్పు రాకూడదూ? అలా అయివుంటే, ఇదంతా జరగకపోయేదేమో? ఏమో, అసలు వీళ్లు పుట్టకుండా వుంటేనే బాగుండి పోనేమో? నా కడుపున పుట్టిన పిల్లలూ! నా దుఃఖంకొద్దీ బాధకొద్దీ నేనిలా అంటున్నాను. నేను బిడ్డల్ని కన్న ఆడుదాన్ని, తల్లిని....

నాకు జ్ఞాపకం వుంది, ఈ చేనుకి మొదటి సారిగా వాళ్లందరూ రావడం. మొట్టమొదటి ట్రాక్టరును సువన్‌కూల్ నడిపించింది ఆ రోజునే. ట్రాక్టరు నడిపించడం నేర్చుకుందుకని ఆ శరత్తూ ఆ చలి కాలం అంతానూ, ఏటికి అవతల వొడ్డున వున్న జరేచ్‌యె వెళ్లేవాడు సువన్‌కూల్. ఆ రోజుల్లో ట్రాక్టరంటే ఏమిటో మాకెవ్వరకీ అసలేమీ

తెలియనే తెలియదు. మరి, సువన్‌కూల్ ఆ రోజుల్లో రాత్రి పడినాక గాని ఇంటికి వచ్చేవాడు కాదేమో — అక్కడ్నుంచి ఇంటికి రావాలంటే ఎంతో దూరం నడిచి రావాలి — పాపం అతణ్ణి చూసి నాకెంతో జాలీ వేసేది, బాధగానూ వుండేది.

''ఎవరికోసమని ఈ పసంతా నెత్తిని వేసుకున్నావు నువ్వు? మేస్త్రీగా వున్నన్నాళ్ళూ నువ్వు హాయిగా వుండేవాడవే'' అని నేను చీవాట్లు పెట్టేదాన్ని.

అతడు మాత్రం ఎప్పట్లాగే మెల్లగా నవ్వుతూ అన్నాడు:

''అదిగో, గడబడ చెయ్యకు మరి, తొల్గాన్! వసంతకాలం రానే వస్తూంది కదా, అంతవరకూ ఉండు, అప్పుడు నువ్వే ఒప్పుకుంటావు. మరొక్క నాలుగు రోజులు ఓపికపట్టు....''

ఏ దుర్బుద్ధితోనూ నేనలా అనలేదు — ఒక్కర్తైనే ఇంట్లో వుండి పిల్లల్ని చూసుకోవడమూ, సంసారం చక్కబెట్టుకోవడమూ, అటు సమష్టి క్షేత్రంలో పనిచేయడమూ అంటే మహా యాతన అనిపించేది. కాని నా కోపం అంతా ఇట్టే చల్లారిపోయేది: అంత దూరంనుంచి చలితో గడ్డ కట్టుకుపోయి అతడు నడిచి ఇంటికి రావడమేమిటి, ఆవురావురుమని ఆకలితో దహించుకు పోతూండడమేమిటి, నేనేమో తనమీద నేరం మోపడమేమిటి, అని వెంటనే తెలుసుకునేదాన్ని, తెలుసుకుని మరీ తికమకపడి పోయేదాన్ని.

''సరే, అలాగేలే, ఇలా వచ్చి పొయ్యి దగ్గర కూచో, ఎప్పుడనగా వండిన వంటో, ఈపాటికి చల్లారిపోయే వుంటుంది'' అని నేను సణిగేదాన్ని, అక్కడికి అతనే ఏదో తప్పుచేసినట్టూ, నేనే అతణ్ణి క్షమిస్తూన్నట్టూనూ.

నా మనస్సు లోలోపల అట్టడుగున నాకూ తెలుసును — సువన్‌కూల్ అక్కడేమీ ఆటలాడుకోవడంలేదని. మా పల్లెటూరిలో ఆనాడు ఓనమాలు వచ్చినవాడు ఒక్కడు లేడు ఆ పాఠాలు నేర్చుకుందుకు. అందుచేత తనే వెళ్లి నేర్చుకుంటానని సువన్‌కూల్ తయారయాడు. ''నే వెళ్తాను

అక్కడికి'' అన్నాడు, ''నే వెళ్లి, ఆ రాతా కోతా ఏదో నేను నేర్చుకుంటాను లెండి, నా మేస్త్రీ పనిని మరెవరికేనా ఒప్పజెప్పండి.''

సరే, తనంతటతానే తయారై వెడితే వెళ్ళాడుగాని, చికాకులు తప్పు తాయా మరి? ఎన్నో చికాకులు దిగమింగాల్సి వచ్చింది. నాకిప్పుడు జ్ఞాపకం వస్తూంది—అవి నిజంగా తమషా అయిన రోజులే, పిల్లలే పెద్దవాళ్లకి గురువులు ఆ రోజుల్లో. కాసీమ్, మసెల్‌బెక్‌లు ఇద్దరూ అప్పటికప్పుడే బడిలో చదువుకుంటున్నారు. వీళ్లే చదువుచెప్పేవారు. సాయంకాలం అయే సరికి ఇల్లు అచ్చంగా ఒక బడిలా తయారయేది. ఆ రోజుల్లో బెంచీలూ బల్లలూ లేవు. సువన్‌కూల్ నేలమీద బోర్లా పడుకుని అక్షరాలను నోటుబుక్కులో రాసుకుని వాటిని కష్టపడి దిద్దేవాడు. పిల్లలు ముగ్గురూ మూడు వేపులనుండీ తండ్రి చుట్టూ చేరి, ముగ్గురూ తండ్రికి పాఠం చెప్పేవారు. ''ఇదిగో, నాన్నా, పెన్సులుని నిటారుగా ఇల్లా పట్టుకోవాలి'' అని ఒకడూ, ''అబ్బే, గీత వంకరగా వుంది, నీ చెయ్యి వణకుతూంది'' అని ఒకడూ, ''చూడు, ఇల్లా రాయాలి, నోటుబుక్కు ఇల్లా పట్టు కోవాలి'' అని ఒకడూ ఆదేశాలిచ్చేవారు. లేదంటే వాళ్లళ్ళోవాళ్ళే వాగ్యు ద్ధానికి దిగి, నీకంటె నాకే బాగా తెలుసునని ఒకడూ మీ ఇద్దరికంటె నాకే ఇంకా బాగా తెలుసునని ఒకడూ రుజువుచేసుకుందుకు పోట్లాడు కునేవారు. మరేదేనా విషయం గురించే అయివుంటే తండ్రి వాళ్లకి తగి నట్టు బుద్ధిచెప్పి వుండేవాడే, కాని ఈ విషయంలో మాత్రం వాళ్ళు తన గురువులని నిజంగానే భావించి వాళ్లపట్ల గౌరవంతో వాళ్ళు చెప్పిన దంతా వినేవాడు. ఒక పూట తను రాసేసరికల్లా, అక్షరాలు రాయడం బదులు నూర్పుయంత్రం డ్రమ్ముకి గింజలు ఎత్తినట్టు, ముఖం అంతా ముచ్చెమటలు పోసేసి అలసిపోయేవాడు. అతని నోటుబుక్కు పుచ్చుకునో, అతని బాలశిక్ష పుచ్చుకునో వీళ్లు ముగ్గురూ కలిసి మంత్రోచ్చాటన చేస్తూ న్నట్టు చదివేవారు—వాళ్లని చూస్తే నాకు ఫక్కున నవ్వే వచ్చేది.

''ఒరే అబ్బాయిలూ, మీ నాన్నని అల్లరిపెట్టకండి! మీరు ముగ్గురూ

కలిసి అతన్ని ఎలాగేనా ఒక ముల్లా కింద చేసేస్తారా ఏమిటి? మరి, సువన్‌కూల్, నువ్వు మాత్రం, ముల్లావే అవుతావో, ట్రాక్టరుడ్రైవరే అవుతావో, రెండింటిలోనూ ఏదో ఒకటి నిశ్చయించుకో.''

దీనితో సువన్‌కూల్‌కి కోపంవచ్చింది. దించిన ముఖం ఎత్తకుండానే, తల పంకించుతూ, భారంగా నిట్టూర్చి, అన్నాడు:

''ఇదిగో, ఇదుండే, ఇది తమాషా అయింది కాదు, నీకేమో వేళాకోళంగా వుందిగాని.''

ఒక్క మాటలో చెప్పాలంటే—యిది తమాషాగానూ వుంది, విచారంగానూ వుంది. ఎలాగైతేనేమి చిట్టచివరకు సువన్‌కూల్ తను పట్టిన పట్టు సాధించాడు.

వసంతకాలం తొలిరోజుల్లో, మంచు అప్పుడే కరిగి వెచ్చని వాతావరణం మొదలైన తర్వాత ఒకనాడు, గ్రామం బయట దడదడమంటూ హాంక్ హాంక్ మంటూ ఘోరంగా చప్పుడైంది. బెదిరిపోయిన గుర్రాలమంద ఒకటి వెర్రెత్తినట్టు వీధిలోనుంచి రివ్వున పరుగెత్తుతూంది. వీధిగుమ్మంలోకి పరుగెత్తాను నేను. పెరటితోటల వీధివెంట నడుస్తూంది ట్రాక్టరు. నల్లగా వుంది, అంతా ఇనుమే, పొగలు కక్కుతూంది. మరో నిముషానికల్లా నడివీధిలోకి రానే వచ్చేసింది. ఇక దానిచుట్టూ చేరింది గ్రామం అంతానూ. కొందరు గుర్రాలమీద వచ్చారు, కొందరు నడిచి వచ్చారు, సంతలో పోగైనట్టుగా ఒకరినొకరు కుమ్ముకుంటున్నారు, తోసుకుంటున్నారు, రణగొణధ్వని చేస్తున్నారు. పొరుగింటివాళ్లతో కలిసి నేనూ పరుగెత్తానక్కడికి. మొట్టమొదట నా కళ్లబడింది—మా అబ్బాయిలు. ముగ్గురూ ట్రాక్టరు మీదకి ఎక్కిపోయి, ఒకరినొకరు గట్టిగా పట్టుకుని వాళ్ల నాన్నపక్కనే నిలబడ్డారు. పక్కనున్న కుర్రాళ్లు వాళ్లని చూసి ఈలవేస్తున్నారు, టోపీలు ఎగరేస్తున్నారు. మా అబ్బాయిలు వీరాధివీరులైనట్టుగా మురిసిపోతున్నారు, ముఖాలు వెలిగిపోతున్నాయి. వాళ్లు ఎంత గడుగ్గాయలు కాకపోతే ట్రాక్టరుని తీసుకొస్తూన్న తండ్రిని కలుసుకుందుకని చీకటితోనే

లేచిపోయి యేటొడ్డుకి పరుగెత్తి పారిపోలారు! నాతో ఆ వూసే చెప్ప కుండానూ. చెబితే నేనెక్కడ వెళ్లనివ్వనో అని! అసలు నిజానికి వాళ్లని చూసి నేను హడలిపోయాను ఏమో తటాలున ఏం ప్రమాదమే జరుగుతుందో అని. హడలిపోయి కెవ్వున కేకేశాను:

''కాసీమ్, మసెల్‌బెక్, జైనాక్, రాండి ఇలాగ! వుండండి చెప్తాను, మిమ్మల్ని పట్టుకుని ఏం జేస్తానో! అందుమీదనుంచి దిగి రాండి రా, వెంటనే!'' నేను కేకలు వేశానే గాని, ఈ మోటారు రణగొణధ్వనిలో నా గొంతుక నాకే వినబడలేదాయె.

సువన్‌కూల్ మాత్రం నన్ను చూసి అర్థంచేసుకున్నాడు, చిరునవ్వు నవ్వి, ''ఏం భయపడకు, మరే ప్రమాదమూ జరగదులే'' అన్నట్టుగా తల పంకించాడు. స్టీరింగ్ ముందు ఎంతో సగర్వంగా సుఖం అనుభవించుతూ కూచున్న ఆ మనిషిని చూస్తే, ఇంకా బాగా కుర్రకారులాగానే అవు పడ్డాడు. ఆ మాటకొస్తే, ఆ రోజుల్లో, కారునలుపు మీసకట్టూ అతడూ నిండు యౌవనంలో వున్న 'జిగిత్'* అన్నమాట. సరిగ్గా అప్పుడు, మొట్ట మొదటి సారిగా అప్పుడు, అనిపించింది నాకు — అచ్చంగా తండ్రి పోలికే కొడుకులదని. నలుగురూ కలిసి వుండగా ఎవరేనా చూస్తే, వీళ్లు నలు గురూ అన్నదమ్ములు కాబోలు అనుకుంటారు. అందులోనూ, మరీ ముఖ్యంగా పెద్ద వాళ్లిద్దరూ, కాసీమ్, మసెల్‌బెక్‌లు, పుట్టుమచ్చలలో సహా అచ్చుగుద్దినట్టు సువన్‌కూల్ పోలికే, అచ్చంగా అతనిలాగే బక్కపలచ గానూ, మెరుగుపెట్టిన రాగిలా ధగధగ మెరుస్తూ దృఢంగా వున్న జేగురురంగు బుగ్గ ఎముకలూనూ. కడసారపువాడు, జైనాక్, నా లాగే కాస్త తెలుపు, నల్లని సాత్వికమైన కళ్లు వాడివి.

ట్రాక్టరు ఎక్కడా ఆగకుండా చిట్టచివరి ఇళ్లు దాటి వెళ్లిపోయింది. మేం అందరం గుంపుగుంపంతా దాని వెంటే వెళ్ళాం. ట్రాక్టరు ఎలా దున్నుతుందో చూడాలని మాకందరికీ మహా వుంది. నాగరి ఎరుగని ఆ

* నేర్పరి అయిన రౌతు. — అనువాదకుడు.

భూమి లోపలికి మూడు నాగటిక్రరులా సులువుగా పోయి, బరువైన, మగుస్రపు మేను లాంటి మట్టి పెచ్చులను తిరగబోస్తూండడం చూసే సరికి — అక్కడ పోగడిన జనం అంతా ఒక్కపెట్టున చప్పట్లు కొట్టుతూ పెద్దగా గొడవ చేస్తూ, ఒకరికంటే ఒకరు ముందు వెళ్దామని తోసు కుంటూ, బుసలు కొడుతూ చెంగుచెంగున దుముకుతూన్న తమ గుర్రాలను కొరడాలతో చరస్తూ ఆ గుంపుగుంపంతా నాగటి చాలువెంట పడ్డారు. మరి నేనొక్కర్తెనే మాత్రం అక్కడి వాళ్లందరితోనూ కలిసి వెళ్ల కుండా ఒక పక్కగా వుండిపోయి, జనం అందరినుండీ ఎందుకని విడి పోయానో నాకే అర్థం కాదు, నేను ఒక్కత్తినీ అక్కడ నిలబడి వున్నానని తటాలున తెలుసుకున్నానే గాని, అక్కడనుంచి కదిలేందుకు నాకు శక్తి లేకపోయింది. ట్రాక్టరు ముందుకు, ఇంకా ముందుకు అలా దూరంగా వెళ్లిపోతూనే వుంది, నేను మాత్రం నిశ్చేష్టనై, అదంతా చూస్తూ అక్కడే స్తంభించిపోయి నిలబడిపోయాను. కాని ఆనాడు నా అంత అదృష్ట వంతురాలు మరీ ప్రపంచంలో లేదనే నేననుకున్నాను! ఆ గ్రామంలోకి తొలిసారిగా ట్రాక్టరును తీసుకొచ్చి నడిపించిన నాడు సువన్‌కూల్ అనో, లేక మా ముగ్గురు అబ్బాయిలూ పెరిగి పెద్దవాళ్లయి, తండ్రి పోలికే వాళ్లకు వచ్చిందనో, దేన్ని గురించి నేను హెచ్చు సంబరపడాలో నాకు తెలిసింది కాదు. వాళ్లకేసే నా కళ్లు అప్పగించి చూస్తూ, ఇక ఏడుపొచ్చేసి, నాలో నేను మెల్లగా అనుకున్నాను: ''నా కడుపున పుట్టిన కొడుకుల్లారా, ఈవేళ మీరు వున్నట్టే, ఎప్పుడూ కూడా మీరు మీ తండ్రి పక్కనే నిల బడి వుండాలి! మీరు పెద్దవాళ్లయి, అతనిలాగానే మీరూ వుంటే, అంత కంటె నాకు మరేమీ అక్కర్లేదు!...''

నా మాతృత్వ జీవితంలోకల్లా అతి అదృష్టవంతమైన రోజులు అవే. ఎంత పనైనా సరే నేను సునాయాసంగా చేసేదాన్ని, పని అంటే నాకు ఎప్పుడూ సరదాయే. మనిషి ఆరోగ్యంగా వుండి, కాళ్ళూ చేతులూ దృఢంగా వుంటే —పనికంటె హాయి అయింది ఇంకేమిటుంటుంది గనుక?

నేను గమనించకుండానే రోజులు గడచిపోయాయి. అప్పుడే కుర్రాళ్లు లేత బూరుగు చెట్లలా ముచ్చటగా ఎదిగిపోయారు. జీవితంలో ఎవడి దారి వాడు ఎంచుకున్నాడు. తండ్రి మార్గాన్నే నడిచాడు కాసీమ్: మొదట ట్రాక్టరు డ్రైవరుగా పనిచేశాడు, తర్వాత కంబైన్ ఆపరేటరు పని నేర్చుకున్నాడు. ఒక వేసవిలో, ఏటి అవతలి వొడ్డున కొండలకు దగ్గరగా వున్న ''కయిండీ'' సమిష్టిక్షేత్రంలో డ్రైవరుగా పనిచేశాడు. మరుచటేడు కంబైన్ ఆపరేటరుగా స్వగ్రామం వచ్చేశాడు.

తల్లికి తన పిల్లలందరిమీదా ఒక్కలాగే వుంటుంది. వాళ్లందరినీ తన హృదయంలో దాచుకుంటుంది, ఐనా మసెల్‌బెక్ అంటే నాకు మరీ ప్రాణం, వాణ్ణి చూసి మరీ గర్వపడేదాన్ని. వాణ్ణి వదలిపెట్టి వుండాల్సి వచ్చింది, బహుశ అదే కారణమై వుంటుందేమో ఇందుకు. తోడి పక్షి పిల్లల కంటే ముందుగా ఎగరడం నేర్చుకున్న పక్షిపిల్లలా, తల్లి గూటినుంచి వాడు చిన్నతనంలోనే ఎగిరివెళ్లిపోయాడు. వాడు మొదటినుండీ కూడా బడిలో బాగా చదివేవాడు, పుస్తకాలన్నీ వాడికి కంఠతా వచ్చేసేవి. వాడికి తిండీ తిప్పలూ అక్కర్లేదు, పుస్తకాలుంటే చాలు. స్కూలు చదువు పూర్తి చేసుకుని, పైచదువుకి పట్నం వెళ్లిపోయాడు. పెద్ద చదువు చదివి బడిపంతులు అవుదామని నిశ్చయించుకున్నాడు.

కడసారపువాడు జైనాక్‌కి ఏళ్లు వచ్చినకొద్దీ మంచి అందం వచ్చింది, దానికితోడు మంచి దృఢమైన వొళ్లు కూడానూ. ఐతే వాడితో వచ్చిన గట్టి చిక్కు అంతా ఏమిటంటే, వాడు ఇంటిపట్టున వుండేవాడు కాదు. వాడు వెయ్యికాళ్ల జెర్రి, సమిష్టిక్షేత్రపు కొమ్‌సొమోల్ ఆర్గనైజేషనుకి వాడిని కార్యదర్శిగా ఎన్నుకున్నారు, ఇక వాడికి తెల్లవారి లేస్తే సమావేశాలూ, స్కూలు గ్రూపూ, గోడ వార్తాపత్రికలూ, ఇంకా ఏమిటేమిటో గొడవ తప్ప ఇంకో లోకంలేదు వాడికి. పగలనక రాత్రనక వాడు కాలునిలవకుండా తిరగడం చూస్తూంటే — నాకు కోపమే వచ్చేసేది.

''ఒరేయ్, నాగమ్మా! నా మాట విని నీ ఎకార్డియానూ బిచాణా

పట్టుకుని సమష్టిక్షేత్రం ఆఫీసుకు వెళ్లిపోయి అక్కడే తిష్ఠవేసి, అక్కడే వుండిపో. నీకెక్కడ వున్నా ఒకటేగా. అమ్మా, నాన్నా, ఇల్లూ వాకిలీ ఏదీ అక్కర్లేదు నీకు'' అన్నాను నేను, వాడితో ఒకసారి.

కాని సువన్‌కూల్ మాత్రం కొడుకును వెనకేసుకొచ్చేవాడు. నేను పెట్టే చీవాట్లన్నీ పెట్టనిచ్చి, అప్పుడు మెల్లగా తన మాట చొరనిచ్చేవాడు:

''ఓయ్, నువ్వేమీ చికాకుపడకు. నలుగురితోనూ కలిసి వుండడం నేర్చుకోనీయ్ వాణ్ణి. వాడు వూరికేనే తిరుగుళ్లు తిరుగుతూంటే, నేనే వాడి చెమ్డాలెక్కగొడ్తాను.''

అప్పటికి సువన్‌కూల్ మేస్త్రీగా తన పాత పనిలోకి మళ్ళీ వచ్చేశాడు. అప్పటికప్పుడే కుర్రకారులు తర్ఫీదుపొంది, ట్రాక్టర్లు నడిపేవారు.

ఆ రోజుల్లో జరిగిన అన్ని సంగతుల్లోనూ ముఖ్యమైన సంగతి—మరి కొద్ది రోజుల్లోనే కాసీమ్ పెళ్లిచేసుకుని, తొలి కోడల్ని ఇంటికి తీసుకురావడం. ఇదంతా ఎలా జరిగిందేమిటని వాళ్లను అడగలేదు నేను, వాడు కిందటి వేసవిలో కయిండీలో డ్రైవరుగా వున్నప్పుడు ఈ అమ్మాయితో పరిచయమై వుంటుంది. ఒకరిమీద ఒకరికి మనసు కలిగివుంటుంది కదా అనుకున్నాను. ఆ అమ్మాయి కన్నవారిది కయిండీయే, అమ్మాయిని కయిండీనుంచే తీసుకొచ్చాడు కాసీమ్. అలిమన్ చామనచాయిగా, అచ్చంగా కొండల్లో పుట్టి పెరిగిన పిల్ల. కోడలు అందంగా, చురుకైన పిల్ల అని నాకు తొలుతే మహా సరదా వేసింది. మరి కొద్దిరోజులకల్లా, నా మనసుకు నచ్చిన అమ్మాయే నాకు కోడలుగా దొరికిందని ఆ అమ్మాయిమీద నాకు అమిత అపేక్ష కుదిరిపోయింది. నా కడుపున కూతురు కూడా వుడితే బాగుణ్ణు అని మనసులో రహస్యంగా ఒక కోర్కె వుండడమూ, ఆ కోర్కె నెరవేరకపోవడమూ అందుకు ఒక కారణం అయివుండొచ్చేమో. ఐనా అదొక్కటే కారణం కాదు — తెలివితేటలున్న పిల్ల, పనిమంతురాలైన పిల్ల, స్ఫటికంలా స్వచ్ఛమైన పిల్ల — ఇదీ అసలు కారణం. ఆ అమ్మాయిమీద

నాకు ఎంతగా ప్రేమ కుదిరిపోయిందంటే, ఆ పిల్ల నా కన్నకూతురే అను కునేదాన్ని. ఒక దొడ్లో గొడ్లు పాడుచుకోవా అంటారుగాని, ఏమో మరి నాది మాత్రం అదృష్టమే; ఇటువంటి కోడలుపిల్ల ఇంట్లో మెట్టుతూండ డమంటే అదృష్టమన్న అదృష్టమా! నా మనసులో వున్నది మాటల్లో చెప్పాలంటే అదృష్టం అనేది నిజమైన అదృష్టమనేది ఏదో అనుకో కుండా జరిగినదికాదు, వేసవికాలపు జల్లులాగా ఎక్కడనుంచో ఆకాశం నుండి దిగివచ్చి నెత్తిమీద పడదు. జీవితంపట్లా, తన చుట్టూ వున్న తోడి మనుషులపట్లా తను అనుసరించే వైఖరిని బట్టి అది చినుకు తర్వాత చినుకులా క్రమేణా మనిషికి కల్గుతుంది. ఒక్కొక్క రేణువే పెరిగి పెద్దదై ఒకదానితో ఒకటి కలిసి మనిషిలో పోగుపడితే, అప్పుడు మనం అంటాం దానిని — అదృష్టమని.

అలిమన్ మా ఇంటికి వచ్చిన యేడాది వేసవి నిజంగా జన్మజన్మాలా మరపురాని వేసవి. గోధుమ వెన్నువేసి త్వరగా ముదిరింది. ఏటిలో వరదలు కూడా ముందుగానే ఆరంభమయాయి. కోతలకు కొన్ని రోజులు ముందే కొండల్లో పెద్ద జల్లులు పడ్డాయి, కొండ ఎగువను పేరుకున్న మంచు రాసులు పంచదార చక్కీల్లా కరిగిపోతూండడం ఎంతో దూరంనుంచే కనబడింది. ఉరుములు ఉరుముతూ కొండలోయలంట ప్రవహించుతూన్న నీటి వెల్లువలు సబ్బు పెచ్చుల్లా కానవచ్చే పసిమి నురగలు కక్కుతూ, పర్వతాల్లో పెరిగిన బ్రహ్మాండమైన దేవదార్లను పెళ్లగించి మోసుకొచ్చి, వాటిని సెలయేళ్లదగ్గర పెచ్చులూ పేళ్లకింద ధ్వంసంచేసి పారేశాయి. అందునా తొలి రాత్రి మరీ భయానకంగా వుండింది. కొండవాగు దిగువ ఏరు తెల్లవార్లూ ఒక్కపెట్టున అలా మూలుగుతూ నిట్టూర్చు తూనే వుంది. తెల్లవారాక చూసేసరికి — పాత లంకలన్నీ ఇక లేనేలేవు, రాత్రికి రాత్రి ఐపూ జాడా లేకుండా అన్నీ సాంతమూ కొట్టుకుపోయాయి.

కాని వేసవి తీవ్రంగానే వుంది. చేలలో గోధుమపైరు వేళ్లదగ్గర ఆకుపచ్చగానూ రెల్లు కొసలంట పసుపుపచ్చగానూ, సరిసమానంగా ముదురు

తూంది. వేసవిలో కోతకు వస్తూన్న చేలు కనుచూపు మేరవరకూ ఆద్యంతాలు లేకుండా అలా అవుపడుతూనే వున్నాయి, స్టెప్ మైదానం ఆకాశంలో కలిసిపోయేంత వరకూ గోధుమపైరు గాలికి ఊగుతూ తూగుతూ జోగాడుతూంది. కోతలు ఇంకా మొదలుపెట్టలేదు, కాని కంబైన్ యంత్రం తర్వాత పనిచేసేందుకు వీలుగా వుండడానికని, చేల అంచులంట ఎదిగిన గోధుమను మాత్రం మేం కొడవలితో కోయనారంభించాం. అలిమనూ నేనూ ఒకరి సరసను ఒకరం పనిచేస్తున్నాం. ఇది చూసి కొందరు స్త్రీలు నన్ను హాస్యమాడారు:

"ఏమోవిడ! కోడలితో పోటీ ఏమొచ్చె నీకు, హాయిగా ఇంట్లో కూచోక? నీకైనా అభిమానం వుండాలిగా!"

నాకు మాత్రం అలా అనిపించలేదు. అభిమానం వుంటే – ఇంట్లో కూచోవాలా?... నేనై ఇంట్లో కూచోలేను, పంటకోత అంటే అసలు నాకు ప్రాణం.

అందుకని, అలిమనూ నేనూ కలిసే పనిచేసేవాళ్లం. అప్పుడు నేనొక సంగతి కనిపెట్టాను, దానిని నేనిక ఎన్నడూ మరిచిపోలేను. చేలు అంచులంట వున్న దుబ్బుల మధ్య, అడవిపూబెండ పూతలో వుంది. గోధుమ కంకులతో సహా ఆ పెద్ద గులాబి తెలుపు పువ్వులు కూడా కొడవలి కోతకు తెగి పడేవి. ఆ పూలను అలిమన్ గుత్తిగా పోగుచేసి పదిలంగా పట్టుకుని ఎక్కడికో వెళ్తూండడం నా కంటబడింది. ఎక్కడికి వెళ్తూందో, వాటిని ఏమి చేస్తుందో అని నేను అనుకుని అలా చూస్తూ నిలబడ్డాను. అమ్మాయి కంబైన్ దగ్గరకు పరుగున వెళ్లి, దాని మెట్టుపైన పువ్వులు వుంచేసి, మళ్ళీ పరుగెత్తి వచ్చేసింది. ఏ రోజైనా కోతలు ఆరంభం కావచ్చుని, కంబైన్ రోడ్డు పక్కనే సిద్ధంగా వుంది. కాసీమ్ ఎక్కడికో వెళ్లినట్టుంది, అక్కడ ఎవ్వరూ లేరు.

నన్ను చూసి కోడలుపిల్ల తత్తరపడుతుందని నేనేమీ చూడనట్టు నటించాను – అమ్మాయికి ఇంకా బిడియం పోలేదు. నేను మాత్రం

మనసులో మహా ఆనందపడ్డాను: ఆ అమ్మాయి వాడిని ఎంతో ప్రేమించు తూందన్న మాటే కదా మరి. ఈ సంగతి చూసి నేనెంతో పొంగిపోయాను. కోడలా, ధన్యవాదాలు! ఎన్నో వందనాలు చెప్పుకున్నాను అలిమన్‌కి నా మనసులో. ఆ నిమిషంలో ఆ అమ్మాయి సరిగ్గా ఎలా వుందో ఈ నాటికి కూడా నా కళ్లకు కట్టినట్టుంది: తలకు ఎరుపు రుమాలు, తెల్లని దుస్తులు, చేత పెద్ద అడవిపూబెండ పూలగుత్తి, జేవురించిన ముఖం, ఆనందంతోనూ చురుకుతనంతోనూ వెలిగిపోతూన్న కళ్లు. యౌవనం అంటే ఇదే కదా! ఓ అలిమన్, ఓ నా చిన్నికోడలా, ఎప్పటికైనా నిన్ను మరచిపోగలనా! అచ్చంగా చిన్న పిల్లల్లా, దానికి పువ్వులంటే ప్రాణమే. వసంతకాలంలో, మంచు ఇంకా దిబ్బకట్టి వుండగానే, స్తెప్‌మైదానంలోకి వెళ్లి తొలి స్నోడ్రాప్ పువ్వులు ఏరుకొచ్చేది.... ఓ అలిమన్!

ఆ మర్నాడు కోతలు ఆరంభమయాయి. కోతల తొలిరోజు ఎప్పుడూ పండగే, ఆనాడు ముఖం ముడుచుకున్న మనిషిని ఒక్కడినైనా నేనెన్నడూ చూడలేదు. ఆనాడు పండగ అని ఎవ్వరూ ఎక్కడా చాటింపు వేయలేదు. ఐతేనేం — మనుషుల లోలోపలనుండే, వారి నడక తీరు, వారి గొంతు, వారి కళ్లలోనుండే పుట్టుకొస్తూంది ఆ పండగ.... కడుపునిండుగా దాణా తిన్న గుర్రాలు గలగల ఆడించుతూన్న జీను చప్పుడులోనుండే, వాటి చకచక పరుగులోనుండే పుట్టుకొస్తూంది ఆ పండగ. నిజం చెప్పాలంటే, కోతల తొలినాడు రోజంతా పూర్తిగా ఎవ్వరూ పనిచెయ్యరు. పని మధ్య నవ్వులూ హాస్యాలూ ఆటలూ జోరుగా సాగుతూంటాయి. మామూలుగా ప్రతీ సారిలాగానే ఆనాడు పొద్దున్న కూడా కోలాహలమూ జనమూనూ, చేను ఈ కొసనుంచి ఆ కొసకు కేరింతలు కొడుతూ పొలికేకలు. మేం వున్నచోట రణగొణధ్వని మరీ పెచ్చరిల్లింది, ఎందుచేతంటే చేతికొడవళ్లతో కోతలకని ఆడాళ్ళూ, అమ్మాయిలూ ఒక గుంపు గుంపూ అక్కడ పోగయారు. వీళ్లందరూ పెంకె ఘటాలే మరి. తనకు సమిష్టిక్షేత్రం బహుమతి చేసిన సైకిలుమీద కాసీమ్ సరిగ్గా ఆ వేళకి ఆ పక్కనుండే వెళ్లడం తట

స్తించింది. ఈ పెంకె ఘటాలందరూ దారికడ్డుగా నిలబడి, వాణ్ణి వెళ్లనివ్వలేరు.

''ఏయ్, డ్రైవరూ! సైకిల్‌మీదనుంచి దిగవయ్యా. కొడవలికోతల వాళ్లం మమ్మల్ని పలకరించాలని తెలీదేం? అంత గోటేమయ్యా నీకు? ఇదిగో, మాకూ నీ పెళ్ళానికీ వంగివంగి దణ్ణాలు పెట్టు!''

వాళ్లందరూ వాడి చుట్టూ మూగిపోయి, వాడు అలిమన్ పాదాలకు వంగి నమస్కారంచేసి, క్షమించమని ఆమెను వేడుకుంటేనేగాని ససేమిరా వాణ్ణి వదలిపెట్టారుకాదు. వాడెలాగైతేనేమి చివరకి అన్నాడు:

''క్షమించండి, కొడవలికోతలవాళ్లల్లారా! క్షమించండి. మీరు చాలా మంచివాళ్లు. నేను తప్పు చేశాను. ఈ రోజు మొదలు ఒక మైలు దూరం నుండే మీకు దండాలు పెట్టుకుంటూ వస్తాను.''

కాని అంతటితో కాసీమ్‌ను వాళ్ళు వదలిపెట్టలేదు.

''ఇప్పుడు, పట్నవాసపు ఆడపిల్లల్లాగానే మమ్మల్ని సైకిలుమీద ఎక్కించుకుని, మా చెవులు గింగిరాలెత్తేటట్టు రైంయ్‌మని సైకిలుతొక్కాలి!'' అన్నారు.

అలా అని, పొట్ట చెక్కలయేటట్టు నవ్వుతూ ఒకరినొకరు తోసుకుంటూ వచ్చి ఒకరి ఆసరాతో ఒకరు సైకిలుమీద ఎక్కి కూచున్నారు కొందరు, సైకిలువెంట పరుగెత్తారు కొందరు. పోనీ, సైకిలుమీద కూచుంటే కూచున్నారు గాని.... తిన్నగా వుంటారా? అబ్బే, అదే విరగబడి నవ్వులూ, అదే కేరింతలూనూ.

నవ్వినవ్వి కాసీమ్ కాళ్ళు వణకిపోయాయి.

''నన్ను వదలిపెట్టండి, ఇక చాలు, వెళ్లనీయండి నన్ను, దయ్యాల్లా వున్నారు మీరెక్కడోగాని!'' అని ప్రాధేయపడ్డాడు కాసీమ్.

అబ్బే, వాళ్లు వదల్లేదు. సైకిలుమీదనుండి ఒకతె దిగేసరికల్లా మరొకతె ఎక్కి కూచునేది.

ఈ హాస్యం పరాచకంకింద దిగడం చూసి, ఇక కాసీమ్‌కి కోపం వచ్చేసి:

''మీకేం మతులు పోయాయా ఏమిటి! పొద్దున్న పడిన మంచు ఎండిపోయింది. కంబైన్ని స్టార్టుచెయ్యాలి నేను, మీ వాలకమేమో ఇలా వుంది!... పనిచెయ్యడానికొచ్చారా, వేళాకోళాలాడ్డానికొచ్చారా మీరు? వెళ్ల నీయండి నన్ను!'' అన్నాడు గట్టిగా.

అబ్బ, ఆ రోజు నవ్వులు మరిక చెప్పలేం. ఆ రోజు ఆకాశమూ అలాగే వుంది — నీలంలోనూ అతినీలం, ఎండ కూడా బాగా కాస్తూంది!

ఎలాగైతేనేమి పనిలోకి దిగాం, కొడవళ్ళు ముందుకీ వెనక్కీ కదుల్తూ తళ్ళుకులు ప్రకాశించాయి, ఎండ ఇంకా తీక్ష్ణమైంది, స్తెప్మైదానమంతా కీచురాళ్ల హోరుతో నిండిపోయింది. పని వూపులో పడేవరకూ అలవాటులేని పని ఎప్పుడూ కష్టంగానే వుంటుంది, కాని ఆనాటి పొద్దున్నపూట హుషారూ సరదా ఆ రోజంతా నన్ను వదలిపెట్టలేదు. మనస్సు ఆనం దంతో పొంగి ఉబ్బిపోయి ఆకాశాన్ని అందుకుంది, వెల్తురుతో నిండి వెలిగి పోయింది. నేను చూసినది ప్రతీదీ, విన్నది ప్రతీదీ, నేను అనుభవించినది ప్రతీదీ — సర్వమూ నాకోసమనే, నాకు ఆనందం కల్గించేందుకనే సృష్టించ బడినట్టు, సర్వమూ ఎప్పుడూలేని పరిపూర్ణ సౌందర్యంతోనూ పరమానం దంతోనూ నిండిపోయినట్టూ అనిపించింది. ఎవరో రౌతు ఒకడు గుర్రంపై స్వారిచేస్తూ అలా ఎక్కడకో వెళ్లివెళ్లి, గోధుమపైరు అలల్లో లీనమై పోవడం చూసి చూసి ఎంతో ఆనందపడ్డాను. బహుశా ఆ రౌతు సువన్కూల్ ఏమో? సరసర కొడవళ్ల విసురూ, నేలకొరుగుతూన్న గోధుమ పనల కరకరా మనుషుల నవ్వులూ కేరింతలూ విని ఎంతో ఆనందపడ్డాను. కాసీమ్ నడుపుతూన్న కంబైన్ ఆ పక్కనుంచే చప్పుడుచేసుకుంటూ వెళ్తూ, కడమ అన్ని ధ్వనులనూ తన ధ్వనిలో విలీనం చేసుకుంటూండడం విని ఎంతో ఆనందపడ్డాను. స్టీరింగ్ పక్క కాసీమ్ నిలబడి, తొట్టెలో ప్రవాహంగా పడుతూన్న నూర్చిన గింజలను వుండి వుండి తన పిడికిట్లో నింపు కుని, ప్రతి పిడికిటినీ వాసనచూసి సంతోషంతో పొంగిపోతున్నాడు. ఆ ముదిరిన గింజల్లోనుంచి వస్తూన్న వెచ్చని పాలవాసన నేనూ ఆఘ్రా

ణించినట్టూ, ఆ సువాసనకు నా తల తిరిగిపోయినట్టూ అనిపించింది నాకు. మేము వున్న చోటకి కాస్త ఎదురుగా ఆ కంబైన్ ఆగే సరికి, తను ఏ కొండమీద నిలబడి కేకేస్తూన్నట్టో కేకేశాడు కాసీమ్:

''ఏయ్, డ్రైవరూ, పోనీయ్, ఏమిటా ఆలస్యం! నిలబెట్టకు నన్ను!''

అలిమన్ ఒక కూజా అయిరాన్* పట్టుకుని:

''పరుగెత్తి వెళ్లి, అతనికి దాహం ఇచ్చి వస్తా!'' అంది.

తలకు ఎరుపు రుమాలూ, తెలుపు దుస్తులో నిండు యౌవ్వనంతో అప్పుడే కంబైన్ కోసిన దుబ్బులమీదనుండి, కంబైన్ దగ్గరకు ఆమె ఒక్క పరుగున వెళ్తూంటే, ఆమె తన చేతులతో తీసుకువెళ్తూన్నది కూజా కాదు, ప్రియురాలి ప్రేమగీతికే కాబోలు అనిపించింది. ఆమె చుట్టూ వున్నది ప్రతీదీ ప్రేమగీతాన్నే ఆలపించింది. అనుకోకుండా తటాలున ఒక ఆలోచన నాలో మెదలింది: ''సువన్‌కూల్‌కి కూడా అయిరాన్ ఇస్తే బాగుండునే!'' అని. ఇటూ అటూ చూశాను, కాని అతడు ఎక్కడా అవుపించలేదు! ఒక్కసారిగా కోతలు మొదలయాయంటే మాత్రం, ఇక మేస్త్రీని పట్టుకోవడం వుత్తదే, రోజుల తరబడి గుర్రంమీదనుండి మరి దిగడమంటూ వుండదు, పీకలమొయ్యా పనితో చేను ఈ కొసనుండి ఆ కొసవరకూ రోజంతా అలా ఆ గుర్రంమీద దౌడుతీస్తూండడమే.

కొత్త పంట గోధుమలనుండి అప్పుడే తాజాగా కాల్చిన రొట్టెను మొట్టమొదటి సారిగా ఆనాడు సాయంకాలం పొలంలో మేం వేసుకున్న మకాంలో తిన్నాం. మేం కొడవళ్లతో గతవారం చేను అంచులంట కోసిన కంకులలోని గింజలను ముందుగానే విసరి సిద్ధంచేసిన పిండి అది. నా జీవితంలో ఎన్నోసార్లు కొత్త పంట గింజలనుండి తయారుచేసిన రొట్టె తిన్నాను, తొలి రొట్టెముక్క నోట్లో వేసుకున్నప్పుడు ప్రతీ సారీ కూడా అదేదో నోము నోచుకుని ప్రసాదం తింటూన్నట్టే అనిపించేది. ఆ రొట్టె

*అనగా కిర్గీజ్ భాషలో ఒక విధమైన శీతల పానీయం. — సం.

నల్లగానూ, పలచగా పిసికిన పిండినుండి కాల్చినట్టు పంటికి అంటుకుంటూ వున్నప్పటికీ, ఆ కమ్మదనంతోనూ ఆ ఘుమఘుమ వాసనతోనూ మరేదీ పాటి రాదు: సూర్యరశ్మి, లేత గడ్డి, పొగ — వీటి తావి దానిది.

ఆకలితో ఆవురావురుమంటూన్న కోతలవాళ్లు పొలంలో మకాం చేరుకుని, పంటకాల్వ పక్క వున్న పచ్చికబయలుమీద చతికిలబడేసరికి అప్పటికప్పుడే పొద్దు దిగిపోతూంది. సూర్యాస్తమయ సమయంలో చేను అవతలి అంచు మండి పోతూన్నట్టే వెలిగిపోతూంది. సందెవేళ వెలుగు చాలాసేపే వుండేటట్టు కనబడింది. అందరమూ డేరా దగ్గర పచ్చికబయలుపైన పోగయాం. నిజమే, సువన్‌కూల్ అక్కడకింకా రాలేదు, కాని వచ్చే వేళ అయింది, గనుక ఏ క్షణమేనా రావచ్చు. వాడి మామూలు ప్రకారం జైనాక్ ఎక్కడకో మాయమైపోయాడు. ఏదో నోటీసు అంటించడానికని అన్నగారి సైకిలు ఎక్కి క్లబ్బుకి వెళ్లి వుంటాడు.

అలిమన్ పచ్చికపైన గుడ్డ పరచి, దానిమీద ఒక పోగు అప్పుడే కోసిన ఆపిల్ పళ్లు వుంచి, వేడివేడి గోధుమ రొట్టెలు తీసుకొచ్చి, కప్పులనిండా క్వాస్* పోసింది. కాసీమ్ చేతులు కాల్వలో కడుక్కుని వచ్చి, గుడ్డదగ్గర కూచుని, రొట్టెల్ని ముక్కలకింద చిదిపాడు.

''ఇంకా వేడిగా వుంది. అమ్మా! కొత్త రొట్టె తొలి ముక్క నువ్వే రుచిచూడు'' అన్నాడు కాసీమ్.

రొట్టెను నేను ఆశీర్వదించి, తొలి ముక్క నోట్లో వేసుకునేసరికి, అదేమిటో ఒక కొత్త రుచి, ఒక కొత్త సువాసన అనుభవించినట్టు తోచింది నాకు. ఆ వాసన — కంబైను ఆపరేటరు చేతుల వాసన, కొత్త పంట గింజలూ, కాలిన ఇనుమూ, కిరసనూనే వాసన. తర్వాత నోట్లో వేసుకున్న రొట్టెముక్కలు కూడా అన్నీ కొద్దిగా కిరసనూనె వాసనే వేశాయి,

*రైరొట్టెనుంచి కాని లేక రైపిండి, బార్లీలతో కాని తయారు చేసిన పుల్లని పానీయం. — అను.

ఐతేనేంగాక — ఇంత కమ్మని రొట్టె నేనిదివరకెన్నడూ రుచిచూసి ఎర గను, ఎందుకంటే — ఈ రొట్టె నా కొడుకుది, అతను తన చేతులతో పట్టుకున్న రొట్టె. ఇది ప్రజల రొట్టె. ఆ సాయంకాలం పొలంలో నా కన్న కొడుకుతో కూడా మకాంచేసిన వాళ్ల రొట్టె ఇది. ఇది పవిత్ర మైన రొట్టె! మా అబ్బాయిని చూసుకుని పట్టరాని గర్వంతో నా మనస్సు పొంగిపోయింది, కాని నా మనస్సులో వున్నది పైవాళ్లెవ్వరూ పోల్చుకో లేకపోయారు. అప్పుడనిపించింది నాకు తల్లి సౌఖ్యం ప్రజల సౌఖ్యంలో నుండే పుట్టుకొస్తుంది అని, చెట్టు వేరులోనుండే కాడ పుట్టుకొచ్చి నట్టు. తన తోడిప్రజల బతుకు వినా తల్లికి వేరే బతుకు లేదు. ఈ విశ్వా సాన్ని నేనెన్నటికీ వదలుకోను, ఇన్ని తిప్పలు భరించీ కూడా, ఈ బతుకు నన్ను ఎన్ని కఠినమైన కష్టాలు పెట్టాలో అన్ని కష్టాలూ అనుభవించీ కూడా, ఈనాటికీ వదలుకోను. నా తోడిప్రజలు బతుకుతున్నారు, అంచేతే నేనూ బతుకుతున్నాను....

ఆ సాయంకాలం బాగా పొద్దుపోయాక కూడా ఇంకా సువన్‌కూల్ రాలేదు, ఎక్కడికెళ్ళాడో మరి. చీకటి పడిపోయింది. ఏటి అవతలున్న కొండమీద భోగిమంట వెలిగించి, కుర్రకారులు పాటలు పాడుతున్నారు. ఆ గొంతుకల్లో జైనాక్ గొంతుక కూడా వున్నట్టు పోల్చుకున్నాను.... వాడే ఎకార్డియాన్ వాయిస్తూ, మామూలు చొప్పునే వాళ్లందరికీ హుషా రెక్కిస్తున్నాడు. నేను బాగా ఎరిగి వున్న గొంతు నా చెవిని-పడగానే నేన నుకున్నాను: ''పాడుకో, నాయనా, పాడుకో, ఏం పాడుకున్నా కుర్ర తనంలోనే. పాట మనిషిని శుద్ధిచేస్తుంది, జనాన్ని కూడగట్టుతుంది. మరి తర్వాత ఈ పాట ఎప్పుడన్నా నీ చెవిని పడిందంటే, అప్పుడు నీకు జ్ఞాపకం వస్తుంది — ఈ వేసవి సందెవేళ ఎవరితో కలిసి నువ్వీ పాట పాడినదీనీ.'' మళ్లీ మరొకసారి తల్చుకున్నాను మా పిల్లలందరినీ — తల్లి స్వభావం అంటే నిజంగా మరి అదే. ''భగవంతుడు దయతలచి, కాసిమ్ అప్పుడే ఒక ఇంటివాడయాడు, వాడి బతుకు వాడు స్వతంత్రంగా బతుకుతున్నాడు.

వసంతకాదు వచ్చేసరికి వాడూ అలిమనూ వేరే కాపురం పెడతారు, ఇల్లు కట్టడం అప్పుడే మొదలెట్టారు కదా, వాళ్ల సామాన్లు వాళ్ళు కొనుక్కుని జాగ్రత్త పెట్టుకుంటున్నారు. ఇంకేముంది, నాల్గురోజులు తిరిగేసరికల్లా — నాకు మనుమలూ మనవరాళ్ళూనూ'' అనుకున్నాను. కాసీమ్ గురించి నాకేమీ బెంగలేదు, వాళ్ల తండ్రిలాగానే వాడూ వొళ్లు వంచి పనిచేసే మనిషి, వొళ్లు దాచుకోవడమంటే ఏమిటో వాడెరగడు. చీకటడి పోయి ఏ జామో అయిందా, ఆ కంబైనుమీదే వున్నాడు వాడింకానూ, ఓ చిన్న మడిచెక్క ఇంకా వుండిపోయిందని. ట్రాక్టరు హెడ్‌లైట్లూ, కంబైన్ హెడ్‌లైట్లూ వెలుగుతూనే వున్నాయి. అలిమన్ వాడితోనే వుంది. కోతల కాలంలో ఒక నిముషమైనా కలిసుంటే అదే ఎంతో ఆనందం.

మసెల్‌బెక్ జ్ఞాపకం వచ్చి గుండె ఝల్లుమంది. వాడిదగ్గరనుంచి కిందటి వారం వుత్తరం వచ్చింది. ఈ వేసవి సెలవలకి తను ఇంటికి రావడంలేదని రాశాడు. పని నేర్చుకోడానికని తనను, చిన్నపిల్లలతో కలిసి ఎక్కడో వున్న పయొనీర్ శిబిరానికి* పంపిస్తున్నారట. అది ఇస్సీక్-కుల్ సరస్సు దగ్గరట. మరైతే సరే, మనం చేసేది ఏమీ లేదుకదా. తను ఇష్టపడే అలాంటి పని నేర్చుకుంటున్నాడు. పోనీ, వాడికదే నచ్చితే, మంచి మాటే. వాడు ఎక్కడుంటే ఏమిటి? ఆరోగ్యంగా వున్నాడు, అదే ముఖ్యం కదా! అనుకుని, మనసులో కిందా మీదా పడ్డాను.

సువన్‌కూల్ బాగా ఆలస్యంగా వచ్చాడు. వచ్చి, అదరా బాదరా భోజనం చేశాడు, ఇకప్పుడు ఇంటికెళ్లిపోయాం. ఇహ ఆ పూటకి ఇంకేమిటి ఇల్లు చక్కబెడుతాననుకుని, పనులన్నీ పొద్దున్నకి వుంచేశాను. పశువుల్ని సాయంకాలం పూట కాస్త చూసిపెట్టవమ్మా అని మా పొరుగింటి అయ్‌షాని బతిమాలాను పొలం వెళ్ళేముందు. పాపం, ఆ మనిషి తరుచూ మంచంపట్టేది. సమష్టిక్షేత్రంలో ఒక రోజు పనిచేస్తే రెండు రోజులు

* వేసవిలో పిల్లలు సెలవలు గడిపే విడిది కేంద్రాలు. — సం.

జబ్బున పడేది. ఆడవాళ్ల జబ్బు, సడుం సలిపేసేది. అందుచేత ఆమెకి ఒకడే కొడుకు — బెక్‌తాష్.

మేం స్వారిచేస్తూ ఇల్లు చేరుకునే సరికి ఝాముర్రాతి దాటిపోయుంటుంది. సన్నని పిల్లగాలి వీస్తూంది, గోధుమ కంకులమీద వుయ్యాల వూగుతూంది వెన్నెల. చక్కగా విడిన తిసిల్ పూగుత్తుల జూలు కొనలకు పూ రికాబులు తగిలి రేగిన వెచ్చని ఒగరు పుప్పొడి గాలిలోకి లేస్తూంది, గాలిలో జోగాడుతూన్న నెత్తావులను బట్టే తీపి క్లోవరు మంచి జోరుగా వుందని నాకు తెలిసిపోయింది. అదేమిటో గాని, ఆ రాత్రి సుపరిచితమైన రాత్రిలా అనిపించింది. ఏదో గుండెల్లో అడ్డుకున్నట్టయింది. సువన్‌కూల్ స్వారిచేస్తూన్న జీను వెనకాతల దిండుమీద కూచున్నాను నేను. నన్ను ముందు కూచోమని అంటూండేవాడు సువన్‌కూల్ ఎప్పుడూనూ, కాని అతని వెనుక అతని పటకా పట్టుకుని కూచోడమే నాకిష్టం. ఆ రోజు అతడు చిత్తుగా అలసిపోయాడేమో — మరే మాటా మంతీ లేకుండా అలా స్వారిచేస్తూనే కునుకుపాట్లు పడుతూ, ముందుకు తల వొరిగేసరికల్లా తటాల్న ఉలికిపడి, మడమలతో గుర్రాన్ని డొక్కలో ఒక్క పోటు పొడిచేవాడు — ఇదంతా నాకెంతో హాయి అనిపించింది. అతని గుండ్రని బుజాలకేసి చూసి, నా తల అతనిమీద ఆనించి, మనసులో కోర్కెలు ముసురుకుంటూ వుంటే అనుకున్నాను: ''మనం పెద్దవాళ్లమైపోతున్నాం, సువన్. అవును మరి, కాలం గడచిపోతూంది. ఐనా మన బతుకు వృథా కాదనే అనిపిస్తూంది. అన్నిటికంటే ముఖ్యమైనది ఇదే కదా. నీకూ నాకూ స్నేహంకావడం నిన్న మొన్నే కదా అనిపిస్తూంటుంది. కాలం రెక్కలు కట్టుకుని ఎగిరిపోతూంది! ఐనా జీవితం ముందు ఇంకా ఎంతో సరదాగా వుండబోతూంది కూడా. అబ్బే, ఇంత వేగమే మనం లొంగిపోయేది లేదు కాలానికి. చెయ్యాల్సిన పని అంతా ముందే వుంది కూడానూ. ఇంకా ఎంతో కాలం నీతో కలిసి బతకాలనుంది నాకు....''

తలెత్తి ఆకాశంవంక చూసి, సరాసరి నిటారుగా కూచున్నాను — గుండెల్లో రాయిపడినట్టయింది: ఆకాశంలో ఎంతో ఎత్తున తళతళ మెరుస్తూన్న నక్షత్రాల మధ్య, ఆకాశం ఈ చివరనుండి ఆ చివరకు నడిమధ్యగా, వెడల్పాటి వెండి చాలు, గడ్డికోతగాని బాట ఎప్పటిలాగానే వేసి వుంది. మళ్ళీ మరొక సారి దాన్ని చూసి విస్తుపోయాను, నిజంగానే ఎవరో ఆ బాటవెంట కొత్తగా కోసిన బ్రహ్మాండమైన గడ్డిమోపు మోసుకెళ్ళా, దారిలో పరకలు రాల్చేదు కాబోలు అనే అనుకున్నాను నిజంగానూ. అదిగో, ఎగువను ఆకాశాన, పసిడి గడ్డి తునకలూ, తోకలూ, పొల్లూ గాలి రేపినట్టు అల్లల్లాడిపోతున్నాయి. అంతేకాదు, పొల్లుతోపాటు రాలిన గట్టి గింజలను కూడా స్పష్టంగా పోల్చుకోగలమే. "అరె భగవంతుడా!" అని అబ్బురపడ్డాను. వెనుకటిదంతా మెరపులా ఒక్కసారి జ్ఞాపకం వచ్చింది. ఎన్నాళ్లకిందటో! మా వలపు జీవితం, ఆ తొలి రాత్రి, మా యౌవనం, మహాశక్తివంతుడు ఆ హాలికుని గురించి నేనప్పుడు కన్న కల! మరిగంటే, ఆనాడు మేం దేన్ని గురించైతే పగటికలలు కన్నామో, అదంతా సర్వమూ నిజమయింది! అవును, భూమీ, నీరూ మా సొంతమే అయి, మా చేతిలోకి వచ్చేశాయి, భూమి దున్నాం, విత్తులు చల్లాం మా గింజలు మేమే నూర్చుకున్నాం. మరిగంటే, ఆనాడు, తొలి రాత్రి మేం కన్న కలలన్నీ ఈనాడు నెరవేరాయి. అవును మరి, మాకెలా తెలిసి వుండేది గనక — రోజులు మారుతాయనీ, కొత్త కాలం వస్తుందనీ, కొత్త జీవితం ఆరంభమౌతుందనీ, ఐతే, ఇహం గురించి సామాన్య మనిషి కన్న కలలూ, ఆ కాలం ఆశించిన ఆశలూ — మంచికోసమూ న్యాయంకోసమూ ఆశించిన ఆశలు — ఒకదానితో ఒకటి సరిగ్గా సరిపోయాయి. నేను ఈ ఆలోచనలో మునిగిపోయి, నోరు మూతపడిపోయి కదలకుండా మెదలకుండా అలా కూచున్నాను. సువన్‌కూల్ నా వేపు తిరిగి:

"కునుకు తీస్తున్నావా ఏమిటి, తొల్గొనాయ్? అలసిపోయావు కదూ!... పోన్లే, మరో నిముషానికల్లా ఇల్లు చేరుకుంటాం. నాకూ అలాగే వుంది,

నిలబడితే పడిపోతానన్నమాట'' అన్నాడు. అలా అని, ఓ క్షణం వూరుకుని, తర్వాత: ''కొత్త వీధివెంట వెళ్దామా?'' అని అడిగాడు.

''వెళ్దాం'' అన్నా నేనున్నూ.

గ్రామం పొలిమేరలోనే అంచుకు అంటి వున్న ఖాళీ జాగాలో కొత్త వీధి కడుతున్నారు. వీధి అంటూ ఇంకా ఏర్పడే లేదు. కొత్త కాపురాలవాళ్ల కోసమని మొన్నటి వసంతంలోనే ఇళ్ల స్థలాలు కొల్తలువేసి కేటాయించారు. అక్కడా అక్కడా గోడలు లేచాయి. కాసీమ్, అలిమన్లకి కూడా ఇక్కడే ఒక స్థలం ఇచ్చారు. ఎలాగా వెళ్తున్నాం కదా, ఈ దారంటే వెళ్తే ఇళ్ల పనులు ఎలా సాగుతున్నాయో చూడొచ్చు అనుకున్నాం. కోతల కాలంలో సొంత పనులు చూసుకుందుకు, ఎప్పుడు పడితే అప్పుడు పగటిపూట పొలం నుండి గైరుహాజరయేందుకు ఎలాగా వీలుండదు. ఇంటికోసమని కాసీమ్, అలిమన్, జైనాక్‌లు ముగ్గురూ కలిసి వసంతకారులోనే ఇటికలు చేసి వుంచారు, ఇప్పుడేమో వాటిని వామి కట్టారు, అవి ఎండుతున్నాయి. పునాదులు తీసి, కిందటి వారమే ఏటి ఒడ్డునుండి రాయి తోలుకొచ్చారు. వాళ్ల అదృష్టం బాగుంది, ఏటికి వరదలొచ్చే ముందే ఈ పని పూర్తి చేసుకున్నారు. కొట్టిన రాయి తలవాకిటి నడిమధ్య పెద్ద కుప్పపోసి వుంది. కుర్రకారు చేసిన పని చూసి, సువన్‌కూల్ తృప్తిపడ్డాడు.

''సరి, శ్రీకారం చుట్టారు కదా. ఈ రాయి చాలు, ఎక్కి తొక్కినీ'' అన్నాడు సువన్‌కూల్. ''కోతలూ నూర్పులూ అయాక, గోడలు లేపేసి, దూలాలు ఎత్తి, చూరు దింపేద్దాం. ఇహ తర్వాత వచ్చే వసంతకారులో చిల్లర పనులన్నీ పూర్తి చేసుకోవచ్చు. ఎన్ని తంటాలు పడినా, చలికాలం వచ్చేలోపున ఎలాగూ చేసుకోలేం, ఏం, తొల్గొనాయ్, నేనన్నది సరిగానే వుందంటావా?''

''సరిగానే వుంది. గోడలు లేపడమూ పైకప్పు వేయడమూ అన్నిటి కంటే ముఖ్యం, కడమ పనేముంది? అదే అవుతుంది'' అన్నాను. అప్పుడు నాకు జైనాక్ మాట చటుక్కున జ్ఞాపకమొచ్చి చిరునవ్వు నవ్వుకున్నాను.

''ఇదిగో మన జైనాక్ వున్నాడే, వాడికి వుండబట్టదు, వాడు వెళ్లి ఏం చేశాడనుకున్నావ్? వాళ్ల సమావేశంచేత, కొత్త వీధికి కొమ్‌సొమోల్ వీధి అని పేరుపెడుతూ తీర్మానం చేయించాడు. వాణ్ణి అలిమన్ హాస్యం చేసింది: 'ఓయ్, జైనాక్! నువ్వు సరిగ్గా న్స్రెద్దీన్* లాంటివాడివి, అలూ లేదు చూలూ లేదు కొడుకు పేరు సోమలింగం అంటున్నావు. అవును గాని, మొదట నువ్వే పెళ్లిచేసుకుని, ఇల్లు కట్టి, వీధి వేయించి, అప్పుడు వీధికి ఏ పేరుపెట్టడమో నిశ్చయిస్తే బాగుంటుంది.' జైనాక్ వూరుకోకుండా, 'నువ్వేమీ అర్థం చేసుకోవు' అనేశాడు.''

సువన్‌కూల్ విని, తల వూపి, చిరునవ్వు నవ్వాడు.

''అవును, నువ్వన్నది నిజమే, తొల్గొనాయ్. వాడిలాంటి ఓపికలేనివాడు ఇంతవరకూ పుట్టలేదు, ఇహ పుట్టబోడు కూడానూ. కాని వీధికి పేరు పెట్టడంలో వాడు సరిగ్గా ఆలోచించే పేరు పెట్టాడుసుమా. ఈ వీధిలో వున్న ఇళ్లన్నీ కొత్త సంసారాలు పెట్టుకున్నవాళ్లవే. మనం వృద్ధి అవుతున్నాం, ఏటేటా జనాభా అధికమౌతూంది. ఇప్పటికే గ్రామంలో ఇరకాటంగా వుంది, కొత్త వీధులు వెయ్యకపోతే వీల్లేదాయె. ఇది మంచిదే. వీధి తయారుకాగానే నువ్వే అంటావప్పుడు, మనవాడు పెట్టిన పేరు సరిగ్గా వుందని....''

అక్కడ నిల్చుని అలా మాట్లాడుకుంటూన్నప్పుడు, ఆ రాత్రికంటె ఇక పాపిష్ఠి రాత్రి వుండబోదని మాకు పిసరంతైనా అనుమానం తోచలేదు.

''ముఖం వాల్చేయకు అలాగు, తొల్గొనాయ్! నువ్వు నిభాయించుకోవాలి మరి.''

*మధ్య ఆసియా దేశాల్లోని ముస్లిం జానపద కథల్లో పాత్ర. యుక్తిపరుడూ, విదూషకుడూ, తన యెత్తులతోటి రాజులనీ, ధనికులనీ పట్టికొట్టించేవాడు. — సం.

''అవును, నిజమే. ఇహ నాకు చేసేదేముంది గనుక? ప్రయత్నమేమో చేస్తున్నాను. తల్లీ, భూదేవీ, ఆ రోజు నీకు జ్ఞాపకం వుందా?''

''అయ్యో, జ్ఞాపకంలేకేమి!... తొల్గొనాయ్! నేను దేనినీ మరచిపోన నుకో, ఈ భూప్రపంచం సృష్టి అయిన నాటినుండి నేటివరకూ శతాబ్దాల జాడలన్నీ అలా భరించుతూనే వున్నాను, తొల్గొనాయ్! చరిత్ర యావత్తూ పుస్తకాల్లో రాసి వుండదు, యావత్తు చరిత్ర మనుషుల స్మృతిపథంలో నిల్చివుండదు — అదంతా యావత్తూ నాలోనే వుంది. నీ జీవితం కూడా నాలో వుంది, నా హృదయంలోనే వుంది, తొల్గొనాయ్! నువ్వు చెబుతూన్నది నేను వింటున్నాను, తొల్గొనాయ్! ఈ రోజు నీ రోజు.''

## 4

మరుచటి రోజు పొద్దు పొడవకముందే పనిలోకి వెళ్ళాం. ఏటి వొడ్డునే సరాసరి నిట్రంగా వున్న కొండవాలు ఈరికలో పైరుకోత మేమే మొదలెట్టాం. ఆ ఈరిక ఎలా వుందంటే, కంబైన్ దానిలో మలుపు తిరగడానికే వీల్లేకుండా వుంది — కంకులు ఏమో అప్పుడే ఎండిపోతు న్నాయి, చేనులో మొక్కకంటె చేను అంచు మొక్కే ముందర ముదురు తుందెప్పుడూనూ. మేము బారుతీర్చి, ఒకరి పక్కను ఒకరం నిలబడి, కోత మొదలెట్టి ఒక్కొక్కరం రెండేసి పనలు కోశామో లేనేలేదో, ఏటి అవతలి గట్టుపైన గభాల్న ఒక గుర్రపు రౌతు కనబడ్డాడు. గుర్రం నాల్గు కాళ్ళూ ఎగరేసుకుని దౌడు తీస్తూంది. నది అవతలి వూరు చిట్టచివరి ఇళ్లవెనుకనుండి ఝూమని దూసుకొస్తున్నాడు ఆ రౌతు. అతడివెంట తోకలా లేస్తూంది ధూళి, పొదల్లోనుంచీ రెల్లు దుబ్బుల్లోనుంచీ ముక్కుసూటిగా దౌడుతీస్తున్నాడు, తననెవరో వెంటబడి వేటాడుతూన్నట్టు. సరిగ్గా ఏటి దరంట గులకరాళ్లదగ్గరకి వచ్చేసింది గుర్రం. కాని ఆ రౌతు ఇటు మళ్లించ

లేదు, అటు మళ్ళించలేదు, గుర్రాన్ని ఒక్క క్షణమైనా ఆగనివ్వకుండా, అంచునున్న రాళ్లలోనుంచే సరాసరి ఏట్లోకే దౌడుతీయించాడు. మేం నిర్భాంతపడిపోయి, నిటారుగా నిలబడి అలా చూస్తున్నాం: ఏం కొంప మునిగిపోయిందని ఇలా వస్తున్నాడీ మనిషి? ఏటికి దిగువగా కోసెడు దూరాన్నే వున్న వంతెనకేసి ఎందుకు మళ్లడంలేదు? అని అనుకుంటూనూ. ఆ రౌతు రష్యన్ కుర్రాడని పోల్చుకున్నాం. ఆ ఎరుపువన్నె గుర్రాన్ని నీళ్ల ల్లోకి దిగమని రౌతుకుర్రవాడు సతాయించుతూండడం చూసి ఇదేమిటి, ప్రాణాలమీద ఆశలేదా ఏమిటి ఈ కుర్రాడికి? అని మేం హడలిపోయి కొయ్యబారిపోయాం. అయ్ బాబోయ్! ఈ కాలంలో ఏటితో చెలగాటమా? ఈ వరదలు గుర్రాన్ని కాదుకదా, ఒంటెనే ఎత్తుకుపోయి, పులుసులోకి ఎముక మిగలకుండా మాయంచేసేస్తాయే!

''ఏయ్! ఎక్కడికెళ్తున్నావ్? ఆగు, ఆగు!''. అని మేం గట్టిగా బొబ్బ రించాం.

అతడూ మమ్మల్ని చూసి బొబ్బరిస్తున్నాడు, చేతులు ఎగరేస్తున్నాడు, కాని ఏటి హోరులో ఏమీ తెలియలేదు.

''...ఓ...ఓ...ఓ...ఓయ్'' అని సాగదీసిన శబ్దం ఒక్కటే వినబడింది.

మాకేమీ అర్థంకాలేదు. ఆ రౌతు గుర్రంమీద కూచునే, గుర్రాన్ని కళ్లెంతో ఒక్క గుంజుగుంజి, కొరడాతో ఒక్క చరుపు చరిచి, దాన్ని వరదలోకి దింపాడు. గుర్రంమీద కూచుని, రౌతు ఏట్లోకి దిగాడేమో, దిగీదిగడంలోనే వెంటనే ఏరు రౌతుని లాగేసింది. ఆ సుడిగుండంలో పడే సరికి, చెవులు రెండూ వెనక్కి పెట్టేసున్న ఆ గుర్రం తలకాయ, పళ్ళు ఇగిలించుతూన్న దాని మూతి — ఇవి మాత్రమే వుండి వుండి మెరపులా అవుపిస్తూండేవి మాకు. దాని జూలు పట్టుకుని వేలాడుతున్నాడు ఆ రౌతు కుర్రాడు. తలకి పెట్టుకున్న యూనిఫారపు టోపీ వరద ఉరవడికి ఊడా చ్చేసి, కెరటాల సుడిలో పడి గిరగిర తిరుగుతూంది. గట్టుమీద మేం ఇటూ అటూ పరుగెత్తుతున్నాం. రౌతుని నీటి వడి గబగబా లాక్కు

పోతూంది, కాని కుర్రవాడు వడి వూపును తెలుసుకున్నాడేమో, వరదకి ఐమూలగా ఈదుకుంటూ గట్టు చేరుకుంటున్నాడు. వరద లాగేస్తూండడం వల్ల, దూరాన ఏటి దిగువనున్న మిల్లుదగ్గర గట్టు అందుకున్నాడు. అప్పుడు అందరికీ గుండె కుదుటబడి, ''హమ్మయ్యా!'' అని నిట్టూర్చాం. కొందరేమో అతడి సాహసానికి పరవశులైపోయి ''భలే, భలే'' అంటూ అతణ్ణి తెగ మెచ్చుకున్నారు. ఇతడేదో కారణంలేకుండా వూరకే రావడంలేదు, ఆ కారణం ఏమిటో మనం తెలుసుకోవాలి అని కొందరన్నారు, మరి కొందరు చీదరించుకుంటూ ఒక మాటపడేశారు:

''పోన్లెద్దురూ, ఎవడో తాగుముచ్చు మూర్ఖుడు డాబులు తీస్తూంటే మీరు వెళ్ళి వాడివెంట పడదామంటున్నారు, బాగు బాగు!''

దాంతో అంతా గుప్‌చుప్ అయిపోయింది. చేతినిండా బోలెడు పని వుందాయె మరి. ''అవును, వీళ్లన్నది నిజమే, వొంటిమీద తెలివున్న మనిషెవ్వడూ ఇలా పనికట్టుకుని ప్రమాదంలోకి దిగడు'' అనుకున్నాను నేను.

కాసీమ్ నడుపుతూన్న కంబైన్ — ఆ రోజున వాడు మిల్లుదగ్గరున్న పొలంలో పైరు కోస్తున్నాడు — తటాలున ఆగిపోయి, ఇక పని చేయడం మానేసింది. కాని నేనేమీ పట్టించుకోలేదు, డ్రైవింగ్ బెల్టే వూడొచ్చేసిందో, గొలుసు ఏదో తెగిపోయిందో, లేకుంటే ఇలాటిదే చిన్న మరమ్మతేదో వచ్చి వుంటుందిలే అనుకున్నాను. నా పక్కనే కాస్త దూరంగా, పైరు కోస్తూంది అలిమన్. తటాల్న అది చెవులు చిల్లులడేటట్టు ఖైంయ్‌మని ఘోరంగా కేకపెట్టింది:

''అత్తయ్యా!''

ఉలికిపడ్డాను నేను. దాని ముఖాన గంటుపెట్టినా రక్తంలేదు, చేతిలో వున్న కొడవలి నేల జారింది.

''ఏమికైంది? పాము కరచిందా ఏమిటి?'' అంటూ దాని దగ్గరకు పరుగెత్తాను.

దాని నోట మాటలేదు. మిడిగుడ్లు పైకొచ్చేస్తాయా అన్నట్టు

కళ్లు పెద్దవి చేసుకుని అది హడలిపోయి చూస్తూన్నకేసే నేనూ చూసి — కొయ్య బారిపోయాను. కంబైను దగ్గర జనం పోగై కేకలుపెడుతున్నారు, గోధుమపైరు మట్టేస్తూ, దూరంనుండి పరుగులు తీసి సరాసరి కంబైను దగ్గరకే వస్తున్నారు కొందరు, గుర్రాలు స్వారిచేస్తూ వస్తున్నారు కొందరు, నిటారుగా బళ్లల్లో నిలబడి గుర్రాలను కొరడాలతో బాదుతూ బళ్లమీద వస్తున్నారు కొందరు.

''ఏమిటో జరిగింది, అత్తయ్యా!'' అని అలిమన్ కేకపెట్టి, తనూ పరుగెత్తింది.

ఎవరో అంటూన్న మాటలు శూలాల్లా నా చెవిలోకి దూసుకు పోయాయి.

''కోతయంత్రం కత్తులకింద ఎవరో పడిపోయుంటారు! లేకుంటే తొట్టెలో పడిపోయుండాలి! రాండి, పరుగెత్తి వెళ్దాం!''

దాంతో ఆడాళ్లందరూ అలిమన్ వెంట పరుగెత్తారు.

''భగవంతుడా, రక్షించు! భగవంతుడా, రక్షించు!'' అని నేను మనసులో వేయి మొక్కులు మొక్కుతూ, చేతులెత్తి దండాలు పెడుతూ పరుగెత్తాను, పరుగెత్తి కాల్వ దాటుతూ బోర్లపడ్డాను, లేచి మళ్ళీ పరుగెత్తాను. అబ్బ, పైరు చేలోనుండి ఎలా పరుగెత్తానోకదా! నా కోసం ఆగండర్రా అని వాళ్లతో కేకెయ్యాలనుకున్నాను, కాని మాట రాలేదు, గొంతుక పోయింది.

ఎలాగైతేనేమి, చిట్టచివరకి నేను కంబైను దగ్గరకి చేరుకునేసరికి, కంబైను చుట్టూ ఒక మూక పోగడి నానా గోలగానూ వుంది. నాకేమీ వినబడలేదు, ఏమీ అర్థంకాలేదు. ''ఆగండి, నాకు దారివ్వండి!'' అంటూ నేను మూకలోకి దూరాను. జనం విడిపోయి, నన్ను లోనికి పోనిచ్చారు, కాసీమ్‌నీ ఆలిమన్‌నీ పక్కపక్కన కంబైన్ దగ్గర నుంచుండగా చూసి గజగజ వణకిపోతూ గుడ్డిదానిలా చేతులు చాచి కొడుకు దగ్గరకెళ్ళాను. కాసీమ్ చప్పున నాదగ్గరికి వచ్చి, నన్ను పట్టుకున్నాడు.

''యుద్ధమండోయ్, అమ్మా'' అన్నాడు. వాడి గొంతు ఎక్కడనుంచో దూరంనుంచి వచ్చినట్టు అనిపించింది నాకు.

వాడి మాటలు నాకేమీ అర్థంకాక, ఏమిటీ మాటలంటూ వాడికేసి చూశాను.

''యుద్ధమా? యుద్ధం అంటున్నావా?'' అని నేను మళ్ళీ మళ్ళీ అడిగాను.

''అవునమ్మా, యుద్ధం మొదలైంది'' అన్నాడు.

ఐనా ఆ మాటల్లో ఏమిటి దాగివుందో అదంతా నాకింకా ఏమీ స్పష్టంగా బోధపడలేదు.

''యుద్ధమేమిట్రా యుద్ధం? ఎందుకురా యుద్ధం? యుద్ధం అంటు న్నావట్రా నువ్వు?'' అన్నాను, ఆ వింత మాట, ఆ ఘోరమైన మాట పదేపదే పలుకుతూనూ, కాని తటాల్న ఎక్కడలేని హడలూ పుట్టు కొచ్చింది. ఆ పడిన హడలువల్లా, అనుకోకుండా వినిన ఆ కబురువల్లా మెల్లగా ఏడ్చేశాను.

కంటివెంట ధారగా కారాయి కన్నీళ్లు, నేను ఏడవడం చూసి కడమ ఆడాళ్లు కూడా ఒక్కపెట్టున బావురంటూ రాగాలు పెట్టారు.

''సద్దు, సద్దు! గోల చేయకండి!'' అంటూ ఎవరిదో మగవాడి గొంతు వినబడింది.

సద్దు మణగింది. ''ఇదేదో గాలికబురు, ఇదేమిటి ఇది నిజమైన కబురు కానేకాదు'' అని ఈ మనిషి నోటంట నికరమైన మాట విన వచ్చుకదా అని, చడీ చప్పుడూ లేకుండా నిలబడ్డారందరూ. కాని ఈ మనిషి ఏమీ అనలేదు. పల్లెత్తు మాటైనా అతని నోటంట రాలేదు. స్టెప్ మైదానం అంతా ఎంత నిశ్శబ్దమైపోయిందంటే ఏటిలో నీళ్ల రొద స్పష్టంగా వినబడుతూంది. ఎవరో అలికిడి చేస్తూ బిగ్గరగా నిట్టూర్చారు. మళ్ళీ అందరూ బిగుసుక్కూచున్నారు, కాని ఎవరి నోటంటా ఒక పలుకైనా రాల్లేదు. మళ్ళీ స్టెప్‌మైదానం అంతా ఎంత నిశ్శబ్దమైపోయిందంటే,

గాలిలో లేస్తూన్న తాపం, చెవిదగ్గర దోమ గింగురుమని చప్పుడు చేస్తూన్నట్టుగానే వినబడింది. కాసీమ్ తనలో తానే మాట్లాడుకుంటూన్నట్టుగా మెల్లగా గొణుక్కున్నాడు.

''గింజ మంచుకింద నానకుండా వుండాలంటే, మనం ఇహ తొందర పడాల్సిందే.'' ఒక్క క్షణం వూరుకుని, కాసీమ్ మళ్ళీ వెంటనే తలెత్తి డ్రైవరు కేసి చూసి, డ్రైవరుపైన కస్సుమంటూ కసరుకున్నాడు: ''ఏమిటలా నిలబడ్డావ్? మోటార్ స్టార్ట్‌చేయ్! దిక్కులు చూస్తూ నిలబడ్డారేమిట్రా మీరందరూనూ? ఇప్పుడు చేతికి పంట తెచ్చుకోకపోతే — ఆ తర్వాత బాధలు అనుభవించేది మీరే! దిగండి పనిలోకి!...''

అక్కడ పోగడిన మనుషులు ఎవరిమాన వాళ్ళు వెళ్ళిపోయారు. ఇకప్పుడు చూశాను — నది అవతలి ప్రాంతంనుంచి వచ్చిన రష్యన్ అబ్బాయిని. అబ్బాయి జుట్టూ, వొంటిమీద గుడ్డలూ తడిసి ముద్దయిపోయి నీళ్ళు కారుతున్నాయి, చెమ్మకి నల్లబడుతూన్న గుర్రాన్ని కళ్ళెం పట్టుకుని నిలబడ్డాడు. ఆ జనం తొడితొక్కిడికి కోలుకున్నప్పుడు కబురు తీసుకొచ్చిన అబ్బాయి వేలబడి వున్న తన ఎరుపువన్నె తల మెల్లగా పైకెత్తి, జీను పట్టీ బిగించడం మొదలెట్టాడు. నేను చూదును కదా, ఆ అబ్బి బాగా కుర్రాడే, మా జైనాక్ ఈడే, కాని ఈ అబ్బి పొడగరీ, వెడల్పాటి బుజాలూనూ. తడి జుట్టు పాయలు నుదుటికి అంటుకున్నాయి, పెదవులమీదా ముఖం మీదా కొత్తగా అప్పుడే పడిన రక్కులు. ఆ అబ్బాయి కళ్ళు ఇంకా పూర్తిగా కుర్రాడి కళ్ళే, ఆ చూపుల్లో అప్పుడు ఎంత గంభీరమైన బాధ అవుపడిందంటే, సరిగ్గా ఆ క్షణంలో ఆ కుర్రాడు తన యౌవనానికే వీడ్కోలు ఇచ్చేశాడనీ, ఈవేళే, ఈపొద్దే ఒక్క పాళంగా వయసొచ్చినవాడైపోయాడనీ ఇహ అప్పుడు నేను గ్రహించాను. ఆ అబ్బాయి భారంగా నిట్టూర్చి, జీను మీద ఎక్కి కూచుని, అక్కడున్న మా పల్లెటూరు కుర్రాళ్ళలో ఒక కుర్రాడితో అన్నాడు:

''ఇదిగో, నేస్తం, నువ్వు వెంటనే వెళ్ళి, సమష్టిక్షేత్రం అధ్యక్షుణ్ణే,

మేస్త్రీలనీ ఎక్కడున్నా సరే పట్టుకుని, వాళ్లతో చెప్పు, జిల్లా కమిటీ ఆఫీసుకి వాళ్లు తక్షణమే వెళ్ళాలని. మరి, నేనిహ వెళ్తొస్తా, ఇంకా మరి రెండు సమష్టిక్షేత్రాలకి వెళ్లి నేను కబురు చెప్పాలి.'' ఇలా అనేసి, పగ్గాలు పట్టుకుని చివుక్కున గుంజబోయాడు, జీనుమీద ఎగిరి కూచో డానికని.

కాని ఆ కబురు అందుకున్న కుర్రాడు మాత్రం ఆ రౌతుని వెళ్ల నివ్వకుండా ఆపి:

''ఆగు, ఆగు! నీ టోపీ పోయింది కదూ. ఇదిగో నా టోపీ తీసుకో. ఈవేళ ఎండ దంచేస్తూంది'' అంటూ తన టోపీ తీసి ఇచ్చేశాడు.

ఆ వెళ్లిపోతూన్న హర్కారా కుర్రాడికేసే చూస్తూ వుండిపోయాం. ఎండకు ఎండిపోయిన ఆ రోడ్డు, పక్షిలా దూసుకుపోతూన్న ఆ ఎరుపు గుర్రం డెక్కలకింద పడి హింసపడిపోయి ఎలా మూలుగుతూందో వింటూ అలా చాలాసేపు నిలబడిపోయాం మేం. మబ్బులా లేచిన ఆ దుమ్ములో ఆ రౌతు మాయమైపోయాడు. మేమింకా రోడ్డుపక్క అలా నిలబడే వుండిపోయాం, ఎవరి మనసులో రేగిన ఆలోచనలలో వారు మునిగిపోయి. కంబైను మోటారూ, ట్రాక్టరు మోటారూ, రెండూ కలిసి ఒక్కసారి గర్జించేసరికి, జనం ఉలికిపడి, ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

ఈ క్షణంనుండి ఇహ కొత్త జీవితం మొదలైంది — యుద్ధకాలపు జీవితం....

రణరంగపు కోలాహలం మాకు వినబడలేదు, కాని మా గుండె దడ, ప్రజల మొర మాత్రం మాకు వినబడింది. నిప్పులు చెరిగిన ఆ వేడి, నేలను మాడ్చేసిన ఆ ఎండ నా జన్మలో ఎరగను. బండరాతిమీద ఉమ్మితే, ఉమ్మి ఆవిరైపోయేది. గోధుమ పైరు చప్పున ముదిరి కూచుంది, మూడు నాలుగు రోజుల్లో. ఎక్కడ చూసినా చేను ఆరి, పసుపువన్నె వెన్నులతో, ఏకంగా ఆకాశం అంచుకే తెరకట్టినట్టు వెల్లివిరిసి, కోతకి కాసుక్కూ చుంచి. ఏమి ఆ పంటసిరి! ఆ తొందరలో బంగారంలాంటి గింజ ఎంత

నష్టపోయామో చూసి నా కడుపు తరుక్కుపోయింది. బోలెడు గింజ మట్టేశాం, బోలెడు గింజ రాల్చేశాం, ఆ హడావడిలో బోలెడు గింజ దారిలో పోగొట్టుకున్నాం. ఇహ ఎంత తొందరైపోయిందంటే, పనలని కట్టలకిందైనా కట్టలేకపోయాం, పంగటి కర్రతో ఎత్తి ఏకంగా బళ్లలో పడేసి, కళ్లంమీద వున్న నూర్పిడి యంత్రం దగ్గరకి గబాగబా తీసుకుపోయాం, ఇన్నీ అన్నీ కంకులు కావు! ఎన్ని కంకులు దోవలో రాలిపోయాయో! సరే పోనీ, పోయిందేదో పోయిందనుకుంటే, ఇంతకంటె మరీ ఘోరం, మనుషుల్ని చూస్తే ఇక మీది ప్రాణం మీదికే ఎగిరిపోయేది. ప్రతీ రోజూ మనుషులకి నోటీసులు వచ్చేవి, సైన్యంలోకి చేరేందుకు హాజరుకమ్మని, ఇహ మిగిలినవాళ్ళే పనిలోకి వెళ్ళేవారు. ఆ మిట్టమధ్యాహ్నపు ఎండలో, ఉక్కిరి బిక్కిరి చేసేస్తున్న ఆ ఉక్క రాత్రుళ్లలో కోతలు, నూర్పిళ్లు, బళ్ల వరుసలకి గింజ ఎత్తడం — అందరికీ అదే పని, ఎడతెరిపిలేకుండా అదే పని, నిద్ర లేదు, వంచిన వీపు ఎత్తలేదు. పనిచూస్తే ఏ రోజుకారోజు హెచ్చైపోతూంది, ఏమంటే మగాళ్ల సంఖ్య ఏ రోజుకా రోజు తగ్గిపోతూంది. కాసీమ్, పాపం మా అబ్బాయి కాసీమ్, తను ఒక్కడూ పది మంది పని చేయగలనని నిజంగా అనుకునేవాడో ఏమిటో? కోతలు అలా ఈడుస్తూ జరుగుతూండడం చూస్తూంటే ఎప్పటికేనా పూర్తి అవడం అంటూ వుంటుందా అనే ఆశ అంతర్ధానమైపోతూంది. వాడు మాత్రం, దేవుడో దయ్యమో ఏదో పూనిన మనిషిలా, వొళ్లు హూనమైపోతూన్నా సరే తన కంబైనుతో చేనులో అలా పనిచేస్తూనే వుండేవాడు. పగలనక రేతిరనక ఆ కంబైన్ దడదడమంటూ, ఒక పొలం తర్వాత యింకో పొలంలో గింజలు నూర్చుతూ, నిప్పుల్లా కాల్తూన్న దుమ్ముమబ్బుల్లోనుంచి ఒక మడిచెక్కనుండి ఇంకొక మడిచెక్కకి పందెంవేసుకున్నట్టు పరుగెత్తుతూ అలా పనిచేసుకుంటూ పోతూండేది. ఆ రోజుల్లో కాసీమ్ ఒక్కసారైనా కంబైన్నుండి కిందకి దిగలేదు, ఒక్కసారైనా స్టీరింగ్ వదలి ఎరగడు. పొద్దుగూకులూ ఆ వడగాలిలో కంబైన్ ప్లాట్‌ఫారంమీద అలా నిలబడి,

నల్లని పొగమబ్బు తెరకావల, దూరాన కోతకోసమని ఇంకా కాసుక్కూచున్న గోధుమ పొలాలకేసి దేగలా చూపులు సారించేవాడు. నల్లబడిపోయిన ముఖమూ, గుంటలు పడిపోయిన బుగ్గలూ, ఏనాడో మాసిన గడ్డమూ— వాణ్ణి చూస్తే నాకు భయమూ వేసేది, జాలీ పుట్టుకొచ్చేది. కడుపు తరుక్కుపోయేది. ''అయ్యో, ఇహ వీడు బతకడం వుత్తది, వడ దెబ్బకి పడిపోతాడు'' అని నేను మనసులో మహా ఏడ్చాను, కాని వాడితో ఆ మాట చెబుదామనుకుని, ఎంత అనుకున్నా చెప్పలేకపోయేదాన్ని. వాడి కళ్లనుంచి వస్తూన్న కొరకొర చూపులు చూస్తేనే—ఏమైనా సరే వీడు పని వదలి పెట్టడనీ, చివరి గడియవరకూ ఆ కోతయంత్రాన్ని అలా నడిపించు తూనే వుంటాడనీ నాకు తెలిసిపోయింది.

ఆ చివరి గడియ రానే వచ్చింది. ఒకనాడు అలిమన్ పరుగున వచ్చి, కంబైను దగ్గరకి వెళ్లింది. వెళ్లి అక్కడనుంచి ముఖం వేలేసుకుని వచ్చే సింది.

''నోటీసొచ్చింది తనకి'' అంది మెల్లగా.

''ఎప్పుడొచ్చింది?''

''ఇప్పుడే, గ్రామ సోవియట్‌నుంచి మనిషి పట్టుకొచ్చాడు.''

ఈవేళ కాకపోతే రేపు, రేపు కాకపోతే ఎల్లుండి, ఎప్పుడైనా కాసీమ్ వంతు వస్తుందనీ, అందరిలాగానే వాడూ సైన్యంలో చేరుతాడనీ నాకూ తెలుసు. ఐనా తెలిసి కూడా, ఆ కబురు చెవిని పడగానే, కాళ్ళు గజగజ వణకిపోయాయి. పనితో పులిసిపోతూన్న చేతులకి చురకలు పెట్టినట్టు ఎంత బాధపడిపోయానంటే, చేతిలో వున్న కొడవలిని కిందకి జార్చేసి, నేలమీద అక్కడికక్కడే ఏకంగా కుప్పకూలిపోయాను.

''వాడక్కడ ఏం చేస్తున్నాడు? వచ్చి మూటా ముల్లే సర్దుకుంటే నయం'' అని ఎంతో కష్టంమీద అనగల్గాను, గజగజ వణకిపోతూన్న పెదవులను ఆపుకుందుకు నాకు శక్యంకాక.

''పొద్దుగూకే సరికి ఇంటికొస్తానన్నాడు. నేనిహ వెళ్తా, అత్తయ్యా,

మీరే చెప్పండి మామగారితో. జైనాక్ నాకెక్కడా అవుపడ్డేదు ఈవేళ. ఎక్కడికెళ్లుంటాడో?...''

''నువ్వెళ్లమ్మా, అలిమన్, నువ్వెళ్లు. కాస్త పిండి పిసికి వుంచు. నేనూ తొందరగానే వచ్చేస్తా'' అన్నాను దానితో.

కాని చతికిలబడిపోయున్న దాన్ని అలా చతికింబడిపోయే వుండిపోయాను ఆ కోసిన దుబ్బుల్లోనే. ఎంతోసేపు అలా కూచుండిపోయాను. లేచేందుకు సత్తువ లేకపోయింది, లేచేందుకేమిటి — తలమీదనుంచి కింద పడిపోయిన రుమాలే అందుకోలేకపోయాను. అక్కడున్న చీమల బారుమీద పడ్డాయి నా కళ్లు. అవి కూడా పాటుపడుతున్నాయి, గడ్డి తునకల్నీ నేల రాలిన గింజల్నీ ఈడ్చుకుపోతున్నాయి, దుఃఖంలో మునిగిన మనిషి వాటి పక్కనే కూచునుందని గానీ, వాటిలాగే ఆ మనిషి కూడా కాయకష్టంమీద బతికే శ్రమజీవే అనిగానీ, ఏది ఏమైనా కష్టపడడంలో వాటికంటె ఏ మాత్రమూ తీసిపోని ఒక శ్రమజీవి ఆ శ్రమజీవులను, ఆ నలుసులను చూసి ఆ క్షణంలో అసూయపడుతూందని గానీ వాటికి ఏ మాత్రం అనుమానమూ తోచినట్టు లేదు. ఏ చీకూ చింతా లేకుండా వాటి పని అవి చేసుకుంటూ పోగల్గుతున్నాయి. యుద్ధం వచ్చింది కాని, లేకుంటే ఆ చీమల బతుకు చూసి నేను అసూయపడేదాన్నా? ఆ మాట తల్చుకుంటేనే నాకు సిగ్గేస్తూంది....

ఆ సమయానికి జైనాక్ తన బండి కట్టుకునొచ్చాడు. ఆ రోజుల్లో, గింజ తోలుకెళ్లి రైలుస్టేషనులో ఒప్పగించే కామ్‌సామోల్ దళంలో వాడు సభ్యుడు. సైన్యంలో చేరమని అన్నగారికి నోటీసు వచ్చిన సంగతి వాడప్పుడే విన్నట్టుంది, నన్ను ఇంటికి తీసికెళ్లడానికి వచ్చేడు. బండిలోనుంచి కిందకి గెంతేసి, కిందనున్న నా రుమాలు తీసి, నా తలమీద వుంచాడు.

''అమ్మా! ఇంటికెళ్దాం'' అన్నాడు. అని నన్ను రెక్కపట్టుకు లేవదీశాడు.

ఇంటికి వెళ్లే దారి పొడుగునా ఇద్దరమూ మాటాడలేదు. ఈ

నాల్గైదు రోజుల్లోనూ జైనాక్ పూర్తిగా మారిపోయాడు, మునపటి మనిషేకాదు, అదేమిటో గంభీరంగా అవుపడ్డాడు. వాణ్ణి చూస్తే ఆ హర్కారా కుర్రాడు రష్యన్ అబ్బాయే మరీమరీ జ్ఞాపకం వచ్చేవాడు. ఆ పరుసదనమే వచ్చేసింది వీడి కళ్లల్లో కూడా. ఆ నాల్గైదు రోజుల్లోనే వీడూ తన యౌవన దినాలకి స్వస్తిచెప్పేశాడు. ఆ రోజుల్లో చాలామంది కూడా ఇలానే.... జైనాక్ గురించి అలా ఆలోచిస్తూంటే అప్పుడు తట్టింది — చాలా రోజులై మసెల్‌బెక్‌నుంచి ఏ కబురూ లేదని. "ఏమైంది చెప్మా? వాణ్ణి కూడా సైన్యంలోకి రమ్మన్నారా ఏమిటి? ఉత్తరాలు రాయడమే మానేశాడేమి ఖర్మం? పోనీ, ఓ చీటీముక్క ఐనా రాసిపడేయకూడదా, కాకిచేతేనా కబురంపకూడదా! ఇంటిమాటంటే అంత పరగడుపా? నాన్నా అమ్మా వున్నారని అంత మరపైతే ఎలాగు? పట్నంలో పడిపోయి, రాతి గుండె అయిపోవడమే? చదువుకీ చట్టుకీ రోజులా ఇవి? ఇంటికొచ్చేసి ఇక్కడ పనిచేసుకుంటే నయం" అని బండిలో కూచుని దుఃఖపడుతూ పరిపరి విధాల అనుకున్నాను. తర్వాత జైనాక్‌ని అడిగాను:

"ఒరే జైనాక్! రైలుస్టేషనుకి వెళ్ళావు కదా నువ్వు, యుద్ధం త్వరలో పూర్తి అయిపోతుందనే అనుకుంటున్నార్రా జనం? ఆ సంగతి ఏమైనా విన్నావురా నువ్వు?"

"లేదమ్మా, ఇంత త్వరలో పూర్తి అవదమ్మా!" అన్నాడు జైనాక్. "ఇప్పట్లో మన పరిస్థితి చాలా గడ్డుగా వుంది. జర్మనీవాడు మనని మరీ మరీ వెనక్కి వెనక్కి నెట్టుకొచ్చేస్తున్నాడు. మనం ఎక్కడైనా నిల దొక్కుకుని కాస్త నిలబడగల్గామంటేనా, అప్పుడు వాడి డొక్క చీల్చేసి, ఇహ ముందుకు తోసుకెళ్లామన్నమాటే. ఇది రేపోమాపో జరుగుతుందను కుంటా" అన్నాడు. అని ఓ నిముషం వూరుకుని, తర్వాత నావైపు తిరిగి అన్నాడు: "అమ్మా, నువ్వు భయపడుతున్నావేమిటి? ఏమిటి, మరీ అంత భయపడుతున్నావా? దాని గురించి నువ్వేమీ ఆలోచించకమ్మా! వూరికేనే

మనసులో పెట్టుకుని గాభరాపడకు. అంతా సవ్యంగానే జరిగిపోతుందమ్మా, నువ్వే చూస్తావుగా!''

అయ్యో, నా వెర్రి తండ్రి, నా చిట్టి నాయన, నన్ను ఊరడించడానికని అలా అన్నాడు, పాపం! మనసులో పెట్టుకోకుండా వుండడం ఎవడి తరం? బెంగపడకుండా వుండడం ఎలాగు? కళ్ళు మూసుకున్నా, చెవుల్లో దూది కుక్కుకున్నా — మనసుని ఆపలేమే, అది అలా ఆలోచించాల్సిందే మరి.

ఇల్లు చేరుకుని చూసేసరికి, ఇంట్లో కూచుని అలిమన్ భోరున ఏడుస్తోంది. పిండి పిసకనే లేదు. నాకు చిర్రెత్తుకొచ్చి: ''ఇదేమిటి ఇది? నీ లాంటి వాళ్లెందరు లేరు? వాళ్లందరికంటె నువ్వు అధ్వాన్నమా? అందరు మగాళ్ళూ వెళ్తున్నారు యుద్ధంలోకి, నీ మొగుడొక్కడే కాదు. ముక్కువెంట ధారా, కంటివెంట ధారా, చేతులు వేలేసుకునీ, ఏమిటది? ఛీ, తప్పు. ఇలా అవుతే ఇహ మనకి రోజులు ఎలా గడుస్తాయి?'' అని దానికి సిగ్గొచ్చేటట్టు చివాట్లు వెయ్యాలనుకున్నాను. కాని మళ్లీ ఆలోచించుకుని, ఏమీ అనలేదు. దాని పడుచుతనం చూసి నాకెంతో జాలేసింది. ఏమో, నేను జాలిపడడం తప్పేమో, వెంటనే తొలి రోజే దాని గుండెని రాయిచేసేసి వుంటే, ఆతర్వాత దాని మనసు కుదుటపడి వుండేదేమో మరి, ఏం తెలుసు? ఏమీ తెలియదు, అయినా అప్పుడు మాత్రం నేనేమీ అనలేదు.

సాయంకాలానికి కాసీమ్ ఇంటికొచ్చాడు, అప్పటికి పొద్దు కుంగిపోయిందన్న మాటే. అంతవరకూ పొయ్యి రాజబెడుతూన్న అలిమన్ వాడు ద్వారంలో అవుపడగానే, కంటిలో నీరు నింపుకుని, వాడికేసి దూసుకువెళ్లి, వాడి మెళ్లో చేతులు మెలివేసుకుని, వాణ్ణి పెనవేసుకుంది.

''నేను వుండను, నువ్వు లేకుండా నేనుండను, నాకు చావే నయం, నేను చచ్చిపోతా!'' అంటూ ఏడ్చేసింది.

కాసీమ్ సరాసరి కంబైన్ దిగి వచ్చాడేమో, వాడి వొంటినిండా దుమ్ము, మకిలి, జిడ్డూనూ. తన బుజాలమీదనుండి భార్య చేతులు తీసి, అన్నాడు:

''ఉండు, అలిమన్, నా వొళ్లంతా వుత్త మురికిగా వుంది. సబ్బు, తువాలూ ఇయ్యి. ఏటికెళ్లి వొళ్లు కడుక్కొస్తా.''

అలిమన్ నాకేసి తిరిగి చూసింది. నాకు అర్థమైంది. ఖాళీగా వున్న బాల్చీ దానికి అందిచ్చి:

''పనిలో పని, దీనితో నీళ్లు పట్రా'' అన్నాను.

ఆనాడు వాళ్లిద్దరూ ఏటినుండి ఇంటికొచ్చేసరికి జామురాత్రి దాటి పోయింది. జైనాక్ సాయంతో ఇంటి పని చూసుకుంటున్నాను. సువన్‌కూల్ ఇంటికొచ్చేసరికి అర్ధరాత్రి అయింది. ఎక్కడికెళ్లి వుంటాడు చెప్మా అని అనుకుంటూ, అతని కోసం అలా కాసుక్కూచున్నాను. బూడిదెవన్నె దాట్ల గుర్రాన్ని మందనుండి తీసుకొద్దామని పగటిపూట కొండల్లోకి వెళ్ళాడట. అది ఇంకా పిల్లగా వున్నప్పుడే దాన్ని కొన్నాం కాసీమ్ కోసమని. ఆ రోజుల్లో వాడు ట్రాక్టరు నడపడం నేర్చుకుంటున్నాడు. అది ముచ్చటైన దాట్ల గుర్రం, జోరైన పరుగు, బలమైన గిట్టలు, కదం తొక్కుతూంటే ఖణ ఖణ మోగేది నేల, తెల్లని మేజోళ్లు తొడిగినట్టు తెల్లని మోకాళ్లు. ఆ గుర్రాన్ని తెలియనివారంటూ గ్రామంలో లేరు, ఆడపిల్లలు దానిమీద పాటలు కట్టి పాడేవారు కూడానూ:

దాట్లగుర్రం వీధిని వెళ్లడం విన్నా
పనిపాట్లు మాని వీధిలోకీ పరుగెత్తా....

కొడుకు ఇంటినుండి వెళ్లిపోయేముందు ఒకటి రెండు రోజులైనా తన బూడిదెవన్నె దాట్లగుర్రాన్ని స్వారిచేస్తే బాగుండునని తండ్రి మనసులో వుంది.

వేకువనే బయల్దేరాం అందరమూ ఎన్‌లిస్ట్‌మెంట్ ఆఫీసుకి. అలిమనూ నేనూ జైనాక్ బండిలో వెళ్లాం, కాసీమూ వాడి నాన్నా వాళ్ల గుర్రాలమీద వచ్చారు. బ్రహ్మాండమైన మోబిలైజేషన్ రోజులవి. గ్రామాల్లో

ప్రజలింకా హెచ్చుగానే వున్నారు. హైరోడ్డు నల్లని రిబ్బను పరచినట్టుంది; ఈ కొస పెద్ద కనుమ దగ్గర మొదలైంది, ఇహ ఆ కొస కంటికే కాన రాలేదు. అన్ని గ్రామాలనుండీ వచ్చారు జనం, గుర్రాలమీదా, ఎడ్ల బళ్లమీదా. జిల్లా కేంద్రం ఆఫీసుదగ్గర పోగడ్డ జనంమధ్యనుండీ బళ్ల మధ్యనుండీ కదలడానికే వీలైందికాదు. పసిపిల్లలేమిటి, ఆడాళ్ళేమిటి, ముస లాళ్ళేమిటి అందరూ వచ్చారక్కడికి. అందులో ఎవరి వాళ్ల చుట్టూ వాళ్ళు చేరి, వాళ్లను ఒక్క అడుగైనా కదల్నిచ్చారుకారు. బావురంటూ ఏడుస్తున్నవాళ్ళు కొందరూ, కాస్త తాగి మైకంలో వున్నవాళ్లు కొందరూ. శాస్త్రం చెప్పినట్టు: ప్రజ సముద్రంలాంటిది, లోతూ మెరకా. ఇక్కడ కూడా యుద్ధానికి మనుషులను సాగనంపుతూన్న ఈ బ్రహ్మాండమైన వీడ్కోలులోనూ సరిగ్గా అంతే పట్టుదలతో, తేట చూపులతో, నిబ్బ రంతో మసలుతూ, అంతేకాకుండా జనాన్ని నవ్వించుతూ కబుర్లు చెబుతూ, పాటలు పాడుతూ, ఎకార్డియాన్ వాయించుతూ డాన్సుచేస్తూన్నవాళ్ళూ వున్నారు. కొందరు రష్యన్ పాటలూ పాడారు, కొందరు కిర్గిజ్ పాటలూ పాడారు, ''కత్యూష'' పాట అందరూ పాడారు. నేను ఆ పాట విన్నది అప్పుడే.

ఎన్‌లిస్ట్‌మెంట్ ఆఫీసు ముంగిలి విశాలంగా వుంది. ఐనా రెక్రూ ట్లందరూ అందులో పట్టనే లేదు. అందుకని మస్తరు పిలిచేప్పుడు, వాళ్లనందరినీ ఆ వూరి పెద్దవీధిలోనే బారులుతీర్చి నిలబెట్టించి, ప్రతీ వాడినీ వాడి పేరూ తండ్రిపేరూ ఇంటిపేరూతో సహా పేరుపెట్టి హాజరు పిలిచారు. వెంటనే ప్రజల్లో సద్దు మణిగింది, ప్రతివారూ ఊపిరి బిగబట్టి వినడం మొదలెట్టారు. యుద్ధంలోకి వెళ్తూన్నవాళ్లందరికేసీ చూశాను, గొంతుకలో భగ్గున మండినట్టయింది. వాళ్లందరూ ఎంచిన పనసపళ్లలా వున్నారు — మంచి ఆరోగ్యంగా పైలాపచ్చీసులో వున్న జవాన్లు. వాళ్లు బతకాల్సిన బతుకు, చేయాల్సిన పని అంతా ముందే వుంది. ప్రతీ సారీ పేరుపెట్టి పిలచేప్పటికల్లా ఒక్కొక్క కుర్రాడూ, ''హాజర్!'' అని

జబాబుచెప్పి, మా వంక చూసేవాడు. ''సువన్‌కూలొవ్ కాసీమ్!'' అని పేరుపెట్టి పిలవడం వినబడేప్పటికల్లా, ఏమీ అనుకోకుండానే నిలువెల్లా గజగజ వణకిపోయాను, వేడి కన్నీటి వెల్లువ మరోసారి కళ్లనుండి కాల్వ కట్టిపారింది. ''హాజర్!'' అని జబాబుచెప్పాడు కాసీమ్. అలిమన్ నా చేయి గట్టిగా నొక్కి పట్టుకుంది. ''అత్తయ్యా!'' అంది ఎలుగురాసిన గొంతుకతో. నేనేం చేయగలను గనుక! దాని బాధ నాకు అర్థమైంది. ఈ ఎడబాటు దానికి ఎంతో కష్టంగా, ఎంతో ఘోరంగా వుంటుంది మరి, కాని తోడి ప్రజతో నిలబడకుండా ఎవరుండగలరు, అందులోనూ ఇలాంటి పాడు రోజుల్లో? ఓ అలిమన్, నా చిట్టి తల్లీ, అలిమన్! యుద్ధానికి ఇది అవసరమనీ, యావత్తు దేశానికీ ఇది అవసరమనీ అదీ అర్థంచేసుకుంది, కాని, మొగుణ్ణి ఇంత ఇలా వలచిన పెళ్లాన్ని, దీన్నే చూశాను కాని, నా జన్మలో మరే ఆడదాన్నీ చూడలేదు.

సైన్యంలోకి వెళ్ళాల్సిన వారందరూ మరో ఇరవైనాల్గు గంటల్లో వెళ్లాల్సి వుంటుందని చెప్పగా, ఆనాడే మేం వచ్చేశాం మా గ్రామానికి. అనవసరంగా ఈ పట్నం వీథుల్లో పడి తిరుగుతూ బడలిక పడిపోవడ మెందుకు, మీరు ఇంటికి వెళ్లిపోవడమే మంచిదనీ, వెళ్ళేప్పుడు దారిలో ఇంటిదగ్గర ఆగి వీడ్కోలు చెబుతాను కదా అనీ కాసీమ్ మాకు నచ్చచెప్పి, మమ్మల్ని ఇంటికి పంపించేశాడు. మా అదృష్టంకొద్దీ మా సమిష్టి క్షేత్రం హైరోడ్డు పక్కనే వుంది. అలిమన్ వెనుకనుంచి రావచ్చునని ఆమెకోసం సువన్‌కూల్ గుర్రాన్ని అక్కడ వుంచేసి, మేం కడమవాళ్లతో కలిసి బండిలో వచ్చేశాం. రెక్రూట్లను రైలుస్టేషనుకు తన బండిలో తీసుకెళ్లాల్సి వుందని జైనాక్ కూడా పట్నంలోనే వుండిపోయాడు.

రాత్రి ఇంటికి చేరుకుని, ఇల్లంతా చిన్నబోయి వుండడం చూసి, ఇక మనస్సులో ఆ బాధ భరించలేక భోరున ఏడ్చేశాను. సువన్‌కూల్ నీళ్లు మరిగించి, నా కోసమని చిక్కని టీ కాచి ఇచ్చాడు. నా పక్కనే కూచుని తను కూడా టీ తాగుతూ అన్నాడు:

''నిజంగా, నువ్వూ నేనూ, మనం ఎవరం, తొల్గొనాయ్? ఈ ప్రజతో వున్నాం, వుండి మనం మనిషి బతుకు బతుకుతున్నాం. వీళ్లందరితోనూ మనమూ మంచీ చెడుగూ ఒక్కలాగే పాలు పంచుకుందాం. రోజులు బాగా వున్నప్పుడు అందరూ తృప్తిపడ్డారు, మరి ఇప్పుడేమో, ఎవడిమట్టున వాడు తన గురించే ఘోషపడుతూ, తన ఖర్మం కాలిందని ఏడుస్తూ కూచోడమేనా? అబ్బే, అది నిజాయితీ అనిపించుకోదు. నువ్వు తమాయించుకోవాలి. అలిమన్ ఏడుస్తూ కూచుందీ అంటే, అది వేరే సంగతి, దానికి ఏమి అచ్చట్లూ ముచ్చట్లూ తీరాయి గనుక, మనకు తీరినట్టు? నువ్వా? నువ్వు బిడ్డలు కన్న తల్లివి. ఈ సంగతి మాత్రం మరచిపోకు. అంతేకాదు, తర్వాత, మరొకటి కూడా నువ్వు తెలుసుకోవాలి. ఏమిటంటావా, యుద్ధం గనుక ఇంకా ఈడ్చిందంటే, నేనూ వెళ్తాను యుద్ధంలోకి, మసెల్‌బెక్‌కీ ఈడు వస్తుంది, వాడికీ పిలుపు రావచ్చు. అంతగా అవసరమైతే అందరమూ వెళ్తాం. ఇదీ సంగతి, అందుకని, తొల్గొనాయ్, దీనికంతటికీ నువ్వు ఇప్పటినుండీ అలవాటుపడాలి....''

మరునాడు మధ్యాహ్నం అయాక, బయలుదేరడం ప్రారంభమైంది. వీడ్కోలు చెప్పేందుకని కాసీమ్‌కి అనుమతి దొరికింది. అందుచేత కాసీమూ అలిమనూ మిగతా వాళ్లల్లోనుంచి విడిపోయి గుర్రాలమీద దౌడుతీస్తూ ముందుగా ఇంటికి వచ్చారు. అలిమన్ కళ్లు వాచి ముద్దలైపోయున్నాయి, దారి కడవెళ్ళా ఏడ్చి వుంటుంది. కాసీమ్ ఎంతో ప్రయత్నంమీద నిభాయించుకుని గుండె దిట్టపరచుకున్నట్టుంది. కాని మనిషి మహా కష్టపడిపోతున్నాడు. మరి ఎందుకని ఈ కథ అల్లాడో నాకు తెలీదు, ఈ వీడ్కోలు భారాన్ని అలిమన్‌కి కాస్త తగ్గించేందుకనో, మరి నిజంగానే వాడితో నలుగురూ అన్నారో, గుర్రాన్ని దిగీ దిగడంతోనే అన్నాడు, మమ్మల్ని స్టేషనుకు రావద్దని. ఏమో, తను ఇంటికే మళ్ళీ వచ్చేస్తే వచ్చేయవచ్చునని, ఎందుచేతంటే, కోతలూ నూర్పులూ పూర్తి అయేంతవరకూ ట్రాక్టరు డ్రైవర్లనీ, కంబైన్ డ్రైవర్లనీ సైన్యంలోకి పిలవ్వద్దని నిశ్చయించారట

అనీ చెప్పాడు. అంతేకాదు, ఆ ఉత్తర్వు వేళకే అందేసూటుంటే, అసలు స్టేషనునుంచే తను సరాసరి ఇంటికే వచ్చేస్తానని కూడా అన్నాడు. ఇప్పుడు అర్థమైంది నాకు, అలిమన్‌మీదనూ మా అందరిమీదనూ వాడికి జాలి పుట్టి అలా అన్నాడని. రైలుస్టేషనుకి వెళ్ళాలంటే ఒక రోజు ప్రయాణం, అట్నుంచి తిరుగు ప్రయాణం ఎలా వుంటుంది? రోడ్డు ఎప్పటికీ తరగదు, అంతమంటూ అవుపడదు, కావలసినంత కన్నీరు తప్ప మరేమీ వుండదు. కాని అప్పుడు మాత్రం నేను నమ్మాను: బొందిలో ప్రాణం వున్నంత వరకూ మనసులో ఆశ వుంటుందని శాస్త్రం కదా మరి. హైరోడ్డు వరకూ వాణ్ణి సాగనంపడానికి ఎప్పుడైతే వెళ్ళామో, అప్పుడు మాత్రం నాలో అనుమానం మొదలైంది.

పంటకోతల్లో పనిచేసినవాళ్లందరూ రోడ్డు పొడుగునా కాసీమ్‌కి వీడ్కోలు ఇస్తూనే వున్నారు. కోతలవాళ్ళూ, డ్రైవర్లూ, కళ్లంలో నూర్పుల వాళ్ళూ, అందరూ పరుగులమీద వచ్చారు. కంబైన్ కూడా అక్కడికి అట్టే దూరంలో లేదు. కాసీమ్ అసిస్టెంట్లు కూడా కంబైన్ని దగ్గర్లో ఆపుచేసి, వీడ్కోలు ఇవ్వడానికి రోడ్డుమీదకి వచ్చారు.

కమ్మరివాడు యుద్ధానికి వెళ్లినప్పుడు వెళ్లొస్తానని తన సుత్తితోనూ దాగలితోనూ వీడ్కోలు చెబుతాడంటారు. మా కాసీమ్ పెద్దపనివాడు, తన పనిలో కమ్మరిమేస్త్రీ అన్నమాట. కంబైన్ ఆగిపోయిన వేళకి, తోడి గ్రామస్థులతో మాట్లాడుతూన్నవాడల్లా, రోడ్డుకేసి చూశాడు. సరిగ్గా ఆ క్షణానికి రెక్రూట్ల బారు కనబడింది, ఒక వరుసకి వరుసా గుర్రబ్బుల్లమీద వస్తున్నారు, మొగదలనున్న ఎర్ర జెండా ఆ క్షణమే రోడ్డు మలుపు తిరిగింది.

''దీన్ని కాస్త పట్టుకో, నాన్నా!'' అంటూ కాసీమ్ తన బూడిదె వన్నె దాట్ల గుర్రం కళ్ళేన్ని సువన్‌కూల్‌కి ఇచ్చి, కంబైనుకేసి వెళ్లాడు. కంబైన్ దగ్గరకెళ్లి, దాని చుట్టూ ప్రదక్షిణచేసి, దాన్ని అన్ని దిక్కుల నుండీ చూశాడు. అటుతర్వాత, చటిక్కున గెంతి ప్లాట్‌ఫారంమీదకి

ఎక్కినించున్నాడు. ''పోనీ, దీన్ని, ఎషెన్‌కూల్, జోరుమీద పోనీ! అప్పట్లానే జోరుమీద పోనీ!'' అని ట్రాక్టరు డ్రైవరుని కేకేశాడు.

సగం వేగంతో వినబడీ వినబడకుండా పనిచేస్తూన్న మోటార్లు ఇక ధణధణ మోతపెట్టాయి, దడదడ దద్దరిల్లాయి, ఉరుములు ఉరిమింది కంబైన్, గొలుసులు గలగలమన్నాయి, నూర్పిడి యంత్రం తుపాను బీభత్సంతో గడ్డి వరదను వెడల కక్కుతూంది, గోధుమ కంకులను నూర్పిడి రోలర్లతో ఫట్‌ఫట్ చరుస్తూంది. వడగాలిని కాసీమ్ తన ముఖాన కొట్టనిచ్చాడు, ఫక్కున నవ్వాడు, ఛాతి విరుచుకున్నాడు, ఈ లోకాన్నే మరచిపోయినట్టున్నాడు. వాడూ ట్రాక్టరు డ్రైవరూ ఒకరితో ఒకరు మాట్లాడుకున్నారు, తలకాయలు వూపారు, మడి చివరకు రానిచ్చి, ట్రాక్టరునీ కంబైన్‌నీ మళ్ళీ వెనక్కి మళ్ళించారు, స్తెప్‌మైదానంమీద నుంచి ఎగిరిపోతూన్న పక్షిలా, ఝైంయ్‌మని వెళ్లిపోతూంది పొలంమీదనుంచి కంబైన్. మేమందరం ఒక్క క్షణంవరకూ యుద్ధంమాటే మరచిపోయాం. అది చూస్తూ జనం అంతా అతి సంబరపడుతూ నిలబడ్డారు, అందరి కంటె మరీ సగర్వంగా వుంది అలిమన్. ఆమె మెల్లగా నవ్వుకుంటూ, కంబైన్ కేసి తాపీగా నడిచింది. కంబైన్ ఆగింది. మా ముఖాలు మళ్లీ ముడుచుకుపోయాయి. మా పొరుగు మనిషి అయ్‌షా కొడుకు బెక్‌తాష్, అప్పటికి పదమూడేళ్లవాడు. కంబైన్‌మీద హెల్పర్‌గా పనిచేస్తున్నాడు. వాడు కాసీమ్ దగ్గరకు పరుగెత్తి వెళ్ళి, కాసీమ్‌ని కౌగలించుకుని ఏడుపు మొదలెట్టాడు. నాకూ ఏడుపొచ్చింది, కాని పెదవి కరచుకుని ఏడుపు మింగేశాను. సువన్‌కూల్ పెట్టిన చీవాట్లు జ్ఞాపకంవచ్చి, ఇక ఏడవడానికి ధైర్యం చాలింది కాదు. బెక్‌తాష్‌ని కాసీమ్ చేతులతో పట్టుకుని ఎగరేసి ముద్దుపెట్టుకుని, వాణ్ణి మళ్ళీ దింపి కంబైన్ స్టీరింగ్ దగ్గర నిలబెట్టి, మెల్లగా కంబైన్ మెట్లు దిగాడు. మేమందరం వాడిచుట్టూ మూగాం. కాసీమ్ తన కడమ సహాయకులకూ, కంబైన్ ఆపరేటరుకీ, ట్రాక్టరు

డ్రైవరుకీ వీడ్కోలు చెప్పాడు. తొందరపడవలసివచ్చింది, అప్పటికప్పుడే రెక్రూట్ల బారులు మేం వున్న చోటుకి వచ్చేశాయి.

అలా ఇచ్చాం కాసీమ్‌కి వీడ్కోలు. ఇహ వాడు గుర్రం ఎక్కి బయ ల్దేరే వేళ అయేసరికి, అలిమన్, పాపం అలిమన్, పెద్దాపిన్నా చూస్తూ న్నారనైనా గమనించకుండా తన రెండు చేతులతోనూ వాడి మెడ పట్టు కుని, మూర్ఛపోయింది. దాని ముఖాన గంటుపెట్టినా రక్తంలేదు, కళ్లు మాత్రం నిప్పుల్లా మండిపోతున్నాయి. మేమందరం దాన్ని గట్టిగా పట్టు కుని లాగేశాం. కాని అది గింజుకుని, మళ్లీ వెళ్లి మొగుడుమీద పడి పోయింది. అలాగే చంటిపాపలాగా, ప్రతీసారీన్నీ, కాసీమ్ చెయ్యి పట్టుకుని గుంజుతూ, వాణ్ణి రికాబులో కాలు పెట్టనిచ్చిందికాదు. ఇహ వూరికే ప్రాధేయపడింది:

"ఉండు! ఒక్క నిమిషం వుండు! మరొక్క నిమిషం!"

ప్రతీసారీ కాసీమ్ దాన్ని ముద్దుపెట్టుకుని బుజ్జగించేవాడు:

"ఇదిగో, ఇహ ఏడవకు మరి, అలిమన్! నువ్వే చూస్తావుగా, స్టేషను నుంచి నేను రేపే వచ్చేస్తా. నా మాట నమ్ము!"

ఇహ అప్పుడు సువన్‌కూల్ కోడలితో అన్నాడు:

"అలిమన్, నువ్వు వాడితో రోడ్డుదాకా వెళ్లి వాణ్ణి సాగనంపు. మేం ఇక్కడే వాడికి వీడ్కోలు ఇస్తాం. వాణ్ణి ఇహ ఆపం." సువన్‌కూల్ కొడుకు చేయి పట్టుకుని మెల్లగా అన్నాడు: "నాకేసి సరిగా చూడు."

ఇద్దరూ ఒకరి కళ్లల్లో ఒకరు చూసుకున్నారు.

"నన్ను అర్థంచేసుకున్నావా?" అని అడిగాడు తండ్రి.

"అర్థంచేసుకున్నా, నాన్నా" అన్నాడు కొడుకు.

"దేవుడు చల్లగా చూసి సుఖంగా వెళ్లి రా, నాయనా!" అని అనేసి, సువన్‌కూల్ తన గుర్రం ఎక్కి, ఒక్కసారైనా ఇహ వెనక్కి తిరిగి చూడకుండా, దౌడాయించి వెళ్లిపోయాడు.

నా దగ్గరనుంచి సెలవు తీసుకుంటూ కాసీమ్ అన్నాడు:

''మసెల్‌బెక్ దగ్గరనుంచి వుత్తరం వచ్చినట్టాయెనా, వాడి ఎడ్రెసు నాకు పంపించండి.''

బూడిదెవన్నె దాట్ల గుర్రాన్ని నడిపించుకుని కాసీమూ, వాడి పక్కనే నడుస్తూ అలిమనూ రోడ్డువైపు వెళ్లిపోయారు. నా రెండు కళ్ళూ వాళ్లకి అప్పగించేసి అలా చూస్తూ నిలబడిపోయాన్నేను. రెక్రూట్ల బారులు అప్పుడే హైరోడ్డుమీదుగా కనుచూపుమేరనుంచి దాటిపోతున్నాయి. మొదటేమో అలిమన్ కాసీమ్ పక్కనే రికాబు పట్టుకుని పరుగెత్తింది, తర్వాత ఇహ చివర సారి కాసీమ్ వంగి దానిని ముద్దుపెట్టుకుని, గుర్రాన్ని గబగబా పోనిచ్చాడు. అలిమన్ మాత్రం ఆ గుర్రపు గిట్టల ధూళిమేఘాల్లోనుంచి అలా పరుగెత్తుతూ పరుగెత్తుతూనే వుంది. దాని వెంట నేనూ వెళ్ళి దానిని ఇంటికి తీసుకొచ్చేశాను.

మరునాడు పొద్దుగూకే వేళకి, తన బండి వెనకాల దాట్లగుర్రాన్ని కట్టుకుని, జైనాక్ రైలుస్టేషనునుంచి ఇంటికి వచ్చేశాడు.

## 5

దూరాన, ఎంతో దూరాన యుద్ధాలు జరిగాయి, నెత్తురు వరదలైపారింది, కాని ఇక్కడ మా పనితోనే మాకు యుద్ధం జరిగింది. ఆనాడు కాసీమ్ చెప్పిన జోస్యం నిజమే అయింది: మేం ఎంత తంటాలు పడినా కార్యం లేకపోయింది, ఆఖరి పైరు ఇంకా చేలో వుండగానే, ఆఖరి పన కళ్లంలో ఇంకా వుండగానే మంచు పట్టుకుంది. అక్కడా అక్కడా ఇంకా ఏరకుండా వున్న ఉర్లగడ్డని మంచు కప్పేసింది, ఇహ ఏరడానికి వీల్లేకపోయింది. మగాళ్లు ఒకరి తర్వాత ఒకరు రోజు రోజూ అలా యుద్ధానికి అందరూ వెళ్తూనే వున్నారు. మరి సమష్టిక్షేత్రంలో మేం పొద్దుగూకులూ యుద్ధం గురించే, అక్కడ ఏం జరుగుతూందో ఏమిటో అని చెప్పుకునే వాళ్లం. ఇహ ప్రతీ ఇంట్లోనూ, ఇంటికి ఎవరు వచ్చినా లెక్కచేసేవారు

కారు, పోస్టుజవాను ఎప్పుడొస్తాడా అని మాత్రం పడిగాపులు కాసుకునుండే వారు.

కాసీమ్‌ని పంపించేసిన ఒక వారానికి, మసెల్‌బెక్‌నుండి వుత్తరం వచ్చింది. వాడినీ, వాడితో కూడా చదువుకుంటూన్న అబ్బాయిల్నీ సైన్యంలోకి రమ్మన్నారట, కాని ప్రస్తుతానికి ఆ వూళ్ళోనే బారకాసుల్లో వుండమన్నారని మొదటి వుత్తరంలో రాశాడు. తను వెళ్ళొస్తానని సరిగా సెలవైనా తీసుకోకుండా వెళ్ళిపోయినందుకు ఏమీ విచారించవద్దని మరీమరీ కోరుతున్నాననీ, ఇలా జరుగుతుందని ఎవరికి ఎరుక అనీ, దాని గురించి మాత్రం విచారించి బెంగపెట్టుకోవద్దనీ — యుద్ధంలో గెల్చి, ఇంటికి వచ్చేయడమే అన్నిటికంటె ముఖ్యమనీ రాశాడు. రెండో వుత్తరం నొవొసిబీర్‌స్క్‌నుంచి వచ్చింది. తను ఆఫీసర్ల ట్రెయినింగు స్కూల్లో తర్ఫీదు పొందుతూన్నట్టు రాసి, తన ఫోటో పంపించాడు. ఆ ఫోటో చట్రం కట్టించి గోడకుంది, ఏనాటిదో మరి, వెలిసిపోయింది. చక్కని ఫోటో: వాడికి యూనిఫారం మాంచి అందంగా అమరింది; వొత్తుగా వున్న జుట్టు వెనక్కి దువ్వుకున్నాడు, ఏమిటో కాస్త జాలిగానూ ఆలోచిస్తూన్నట్టూ వున్నాయి కళ్ళల్లో చూపులు. అచ్చంగా ఇలాగే అవుపిస్తాడు వాడు కలలో నాకెప్పుడూనూ.... అన్నగారి పెళ్ళికి వచ్చినప్పుడే ఆ ఒక్కసారే వాడిని చూసింది అలిమన్.

''అత్తయ్యా, చూడు, మన మసెల్‌బెక్ ఎంత చక్కనివాడో!'' అంది అలిమన్ ఆ ఫోటో చూసి. ''ఆ రోజు అతనికేసి తెరవెనకాలనుండే చూశా. పెళ్ళికూతురిని కదా మరి, అతనికేసి ఎగాదిగా చూస్తే బాగుండదని, తమాయించుకుని కళ్ళు దించేశా. ఇప్పుడితను ఇంటికొచ్చేసుంటే ఎంత బాగుణ్ణు — తనలాగే చదువుకున్నది అందమైనది అయిన ఏ పిల్లనైనా చూసుకుణ్ణు! నిజంగా, ఎంత బాగుండును, అత్తయ్యా!'' అంది.

నాకూ అలానే అనిపించి అవునన్నాను. ఆ రోజు ఎప్పుడు వచ్చునా అని కలలు కనడం మొదలెట్టాం.

చలికాలం నడికారు వరకూ నాకేమీ బెంగలేకపోయింది. కొడుకులు ఇద్దరి దగ్గరనుంచీ వుత్తరాలు వస్తూండేవి, దాంతో మనసుకు తృప్తిగానే వుండేది. కాని కాసీమ్ వుత్తరం రాశాడు — వాళ్లను యుద్ధశ్రేణికి పంపిస్తున్నారని. ఇహ అప్పుడు నాకు మనస్సులో భయంపట్టుకుంది, గుండె జారిపోయింది. సరిగ్గా అప్పుడే సువన్‌కూల్‌కి రోజూ పిలుపు వచ్చేది, ఎన్‌లిస్ట్‌మెంటు ఆఫీసుకి వచ్చి అవుపడుతూండమని. డాక్టర్లచేత తనిఖీ చేయించుకోమని ఈ రోజున, పేరు నమోదు చేయించుకోమని మరునాడు, మళ్ళీ మరోసారి పేరు నమోదు చేయించుకోమని — ఆ మరునాడు. అటు ఎన్‌లిస్ట్‌మెంటు ఆఫీసూ, ఇటు మేస్త్రీగా సమష్టిక్షేత్రమూ — ఈ రెండింటి మధ్యా తిరగలేక మనిషి శుభ్రంగా హుసన్మైపోయి నలిగి నిస్త్రాణ పడిపోయాడు. సువన్‌కూల్‌ని సైన్యంలోకి రమ్మని పిలుస్తారని — అదేమిటో మరి — నేను ఏనాడూ అనుకోలేదు: ఏది ఎలాగున్నా, మేస్త్రీ లేకుంటే సమష్టిక్షేత్రానికి చేతులు రెండూ కొట్టేసినట్టేకదా. ఐనా — అతణ్ణి పిలిచారు. మంచుకింద కప్పడిపోయిన పైరుని చేలోనుంచి తీసుకొచ్చి, నూర్పుల సావిట్లో నూర్చుతున్నాం. అప్పుడు తెలిసింది నాకు ఈ సంగతి. కబురు విన్నాను, పంటికోలను గడ్డిలో నిలదొక్కి, చల్లని పిడికోలమీద నుదురు పెట్టి, ఏమి ఆలోచించేందుకూ శక్తిలేక అలా నిలబడిపోయా. ఏం చేయడం? ఇహ రేపు బతుకు ఎలా వెళ్తుంది? ఇద్దరు కొడుకులు అక్కడే వున్నారాయె, ఇహ ఇప్పుడు మగాడు కూడా అక్కడికే యుద్ధశ్రేణికే వెళ్తున్నాడు....

సరిగ్గా అప్పుడే వచ్చాడు సువన్‌కూల్ గుర్రాన్ని దౌడుతీయించుతూ అక్కడికి. ఏమీ మాటాడలేక గుర్రంమీదనుంచి దిగి, నా దగ్గరకి వచ్చి అన్నాడు:

''ఇంటికి వెళ్దాం, బిచాణా సర్దుకోవాలి.''

నేను గుర్రం ఎక్కాను, నడుస్తూవుంటే మాట్లాడుకుందుకు తనకు వీలుగా వుంటుందని చెబుతూ అతడు నా పక్కనే నడిచాడు. కాని

మా మాటలేమీ అతకలేదు – ఏమాటా తోచక మొత్తంమీద దారి పొడు గునా వూరికే వున్నాం ఇద్దరమూ. ఒకరితో ఒకరం చెప్పుకుందుకు ఏమీ లేకకాదు, గుండెల్లో భారంగా వుంది, వొంట్లో అంతా సమ్మెట్లతో బాదు తూన్నట్టుంది, మాట మాటాడ్డమంటేనే యమయాతనగా వుంది. దారి కడవెళ్లా అలాగే వెళ్ళాం – నేను గుర్రంమీదా, అతడు నడుస్తూనూ. ఆకాశం మసకమసకగా బూడిదెవన్నె మబ్బులు కమ్మివుంది. పసిమి లోయ నుండి రైంయ్‌మని కొడుతూంది ఉత్తరపు గాలి, భూమిలోంచి లేచివస్తూన్న గాలి నెమ్మదిగా కదలుతూంది, మంచుతుపాను వస్తోందని ముందుగానే ఎండిన తుప్పలు ఈలవేసి మరీ చెబుతాయి. చుట్టూ కలియజూశాను – చేను వట్టిదైపోయి, బావురుమంటూంది. మనుషులు లేరు, అలికిడి లేదు, ఎక్కడా కదలిక అన్నమాట లేదు, చలివేస్తూంది, చీకటిగా దిగాలుగా వుంది.

నడుస్తూన్నంత సేపూ సిగరెట్టు తర్వాత సిగరెట్టు అలా కాలు స్తూనే వున్నాడు సువన్‌కూల్. తర్వాత నా చేయి పట్టుకుని:

"చలేస్తుందా ఏమిటి నీకు?" అని అడిగాడు.

నేనేమీ జబాబు చెప్పలేదు. తనేదో చెప్పాలని అనుకుని, మళ్ళీ వూరుకున్నాడు. తన మనసులో మెదల్తూన్న ఆలోచనలను నాతో చెబుదామ నుకున్నాడు కాబోలు: "ఇదిగో మరి, మన అబ్బాయిలవెంటే నేనూ వెళ్తున్నా. ఏమి జరుగుతుందో, మన ఖర్మ ఎలా వుందో ఏమిటో, ఇంటికి రావడ మంటూ వుంటుందో వుండదో.... ఏమో, ఒకరినొకరం ఇదే కడపటి సారి చూసుకోవడమేమో? అలానే ఐతే – మనమిద్దరం ఇన్నాళ్లూ హాయిగా పొత్తుగా కలిసి బతికాం. ఎప్పుడన్నా కస్సుబుస్సు అనుకున్నా, ఒకరినొ కరం మన్నించి మరచిపోదాం. ఇంతకీ, ఏం చెప్పగలం మనకేమి రాసివుందో?" ఈ మాటలే అచ్చంగా చెప్పాలనుకున్నాడో ఏమిటో, మరి అతడికే తెలియాలి, కాని అప్పుడు మాత్రం అతడు నాకేసి చూస్తూ, ఏ మాటా ఆడకుండా, పెదవి కరచుకున్నాడు. అప్పుడు నాకు కళ్లకు కొట్టవచ్చినట్టు అవుపడింది –

అతడి మీసాలు నెరవడం మొదలెట్టినట్టు. అదేమిటో గాని, అంతకుముందు నేనెన్నడూ కనిపెట్టే లేదు ఆ విషయం.

ఈ చేనులోనే సువన్‌కూలూ నేనూ మొదట, అప్పుడు ఇద్దరమూ పడుచువాళ్లం, ఎలా కలుసుకున్నామో, ఈ చేనులోనే ఇద్దరమూ ఇరవై రెండేళ్లు చెమటోడ్చి ఎలా పనిచేశామో, పిల్లల్ని ఎలా సాకామో, పంట ఎలా పండించామో జ్ఞాపకం వచ్చింది, మా బతుకంతా రెప్పపాటులో నా కళ్ల ఎదుట నిల్చింది. ఇలా ఒకరినుండి ఒకరం విడిపోతామనీ, ఏమో మరెన్నటికీ కలుసుకోవడమంటూ వుండనే వుండదేమోననీ ఎన్నడూ నేను వూహించలేదు, ఒక్కనాడైనా అనుకోలేదు. ఓ మాటు వేసవికాలంలో, కోతలు మొదలుపెట్టిన తొలిరోజు రాత్రి, అచ్చంగా ఈ రోడ్డుమీదనుండే గుర్రంమీద స్వారిచేస్తూ వచ్చాం. గ్రామం పొలిమేరనున్న కొత్త వీధి ఇప్పుడు మనిషి వాసన లేకుండా, సగం లేచిన గోడలతో సగం వేసిన వాసాలతో పాడుపడి పోయుండడం చూశాను. అలిమన్ కాసీమ్‌లు ఇల్లు కట్టుకోవాలను కున్న జాగాలో కుప్ప పేర్చి వున్న రాళ్ళూ, ఇటికలూ ఇప్పుడు కళ్ల బడ్డాయి. కళ్లబడి, గుర్రం జూలుమీద వాలిపోయి, వలవల ఏడ్చేశాను. అలా చాలా సేపు ఏడ్చాను. సువన్‌కూల్ ఏమీ అనకుండా, ఎంతో ఓర్పుతో అలా నిలబడి, ఆ తర్వాత అన్నాడు:

''ఇదిగో, తొల్గొన్! ఏం ఫర్వాలేదు, కడుపులో వున్న దుఃఖం అంతా ఒక్కమాటు పైకి వచ్చేసేటట్టు ఏడ్చేయ్, ఇక్కడెవ్వరూ లేరు. కాని ఈ రోజునుండి మాత్రం పరాయివాళ్ల ఎదుట కంట తడిపెట్టకు. ఇప్పుడు నువ్వు ఇంటి యజమానివే కాకుండా, అలిమన్ జైనాక్‌లను చూసుకోవడమే కాకుండా—నా స్థానే నువ్వే మేస్త్రీగా పనిచెయ్యాలి కూడా. అందుకు మరెవ్వరూ లేరు.''

ఆ మాటలు విని, నేను మరీ జోరుగా ఏడ్చాను:

''ఇదేం ఖర్మం నాకు! నీ మేస్త్రీ పని నాకెందుకు? ఇలాంటప్పుడా ఈ మాటలు? నాకేమీ అక్కర్లేదు, ఆ వూసే నాకొద్దు!''

కాని ఆ సాయంకాలం సమష్టిక్షేత్రం ఆఫీసుకు రమ్మనమని నాకు కబురొచ్చింది. కొత్త అధ్యక్షుడు — యుద్ధంలో గాయపడి వచ్చిన ఉసెన్‌బాయ్, సువన్‌కూల్, ఇంకా చాలా మంది ముసలి సభ్యులూ, గ్రామపెద్దలూ, అందరూ అక్కడున్నారు. ఉసెన్‌బాయ్ వెంటనే నాతో ఇలా అన్నాడు:

''ఇదిగో తొల్గొనాయ్ పిన్నీ, మీరేమన్నా సరే, మగవాడిలాగే మీరూ నడుంగట్టి, పటకా బిగించి, మేస్త్రీ భారం మొయ్యాలి. ఈ భూమీ, ఈ నీరూ, మన గ్రామంలో మనుషులూ మీకంటె తగిన వారిని ఎరగరు. మీమీద మాకు నమ్మకం వుంది, అందునా మన మేస్త్రీలందరిలోనూ ఎన్నికమనిషిని — ఎంత కష్టమనిపిస్తూన్నా అతడిని యుద్ధానికి సాగనంపక ఇప్పుడు మాకు తప్పిందికాదు — మీరంటే నమ్మకం వుంది. మరొక దారి అంటూ ఏదీ లేదు, అంతే మరి. రేపటినుంచి ఈ పనిలోకి వచ్చేయండి, తొల్గొనాయ్ పిన్నీ!''

గ్రామపెద్దలు కూడా అలాగే సలహా చెప్పారు. ఎలాగైతేనేమి చివరకి నాకు నచ్చజెప్పి నాచేత ఒప్పించారు, మేస్త్రీగా వుండడానికి ఒప్పుకున్నాను. ఇంతకీ — ఒప్పుకోకుండా ఎలా వుండను? ఎలాంటి గడ్డు కాలం అనుభవిస్తున్నామో నాకు మాత్రం తెలియదా ఏమిటి? నేను ఒప్పుకోవడం సరిగానే వుందనుకున్నాను — మరెందుకూ కాకపోయినా, అది నా సువన్‌కూల్ కడపటి కోర్కె అవడం కారణంగా కూడానూ. ఆ రాత్రి తెల్లవార్లూ అతడు నిద్రపోలేదు, పని గురించి ఏమేమి చెప్పాలో అన్నీ చెప్పాడు: ''వసంతకారుకి ఇప్పుడప్పుడే అంతా సిద్ధం చేసుకోవడం మొదలెట్టాలి, లాగుడు పశువులకి విశ్రాంతి ఇవ్వాలి, నాగళ్లూ నొల్లిలూ బళ్లూ అన్నీ మరమ్మతులు చేయాలి.... పిల్లా జెల్లా వున్న పెద్ద కుటుంబాలనూ ముసలాళ్లనూ జాగ్రత్తగా చూసుకోవాలి.... ఇది చేయాలి, అది చెందాలి....'' అయ్యో, ఒక్క క్షణమైనా తీరిక ఎరగనైతివే నువ్వు, నన్ను వలచిన ఓ నా పెనిమిటా, ఓ ప్రాణ స్నేహితుడా....

రాత్రి తెల్లవార్లూ మంచుతుపాను ఎడతెరిపి లేకుండా కొడుతూనే వుంది, పొగగొట్టంలోనుంచి గాలి కుంయ్యోమని కూతపెడుతూనే వుంది.

సువన్‌కూల్‌ని కూడా మేము హైరోడ్డు వరకూ సాగనంపాం. నడికారు మళ్లీన మరికొందరు మనుషులతో కలిసి సువన్‌కూల్ బైనాక్ బండిలో ఎక్కి, ఆ తుపానులోనే వెళ్లిపోయాడు. మరి కాస్సేపటికి ఆ మంచు తెరవెనుక వాళ్లు మాయమైపోయారు. అబ్బ, ఆవేళ ఏమి చలి వేసింది! హోరుమని హడలెత్తించుతూ వీస్తూన్న గాలి నాలుగు దిక్కుల నుండీ వచ్చి ముఖాన కొడుతూంది. నేను నింపాదిగా నడుస్తూ వెళ్ళాను — వుండి ఉండి వెనక్కి తిరిగి చూస్తూ, కాస్సేపు వెక్కివెక్కి ఏడుస్తూ, కాస్సేపు బొళ్లున మొరపెడుతూ.

ఆ రోజునుండి నేను, మన అధ్యక్షుడు ఉసెన్‌బాయ్ చెప్పినట్టే, పటకా బిగించి, గుర్రం ఎక్కి, మేస్త్రీగా పని ఆరంభించాను. ఈనాడైనా అదేమంత సులువైన పనికాదు, ప్రతివాడికీ ఆ పని చేత అవదు, మరి ఆ రోజుల్లో ఇహ చెప్పేదేముంది? ఒకటే చిత్రహింస. ఆ మాత్రం ఈ మాత్రం ధాటీగా వున్న మగాడంటూ ఎవ్వడూ లేడు. వున్న మగాళ్లందరూ జబ్బువాళ్ళూ అవిటివాళ్ళూనూ, ఇహ పనిచేయడానికి మిగిలినవాళ్లు — ఆడంగులూ, పడుచులూ, పిల్లలూ, ముసలాళ్ళూనూ. మేం పండించినదంతా యుద్ధశ్రేణికి వెళ్లిపోయేది. వ్యవసాయక్షేత్రంలో వున్నవి — చక్రాలు లేని బళ్ళూ, తాసికమాసికలేసి తాళ్లతో కట్టిన జీను సామాన్లూ, విరిగిపోయిన కాడి మాన్లూ, రాక్షసిబొగ్గు లేని కమ్మరసాలా. కొలిమిచేత పని చేయించేందుకని ఎండిపోయిన లోయలో వున్న ముళ్లకంప పోగుచేసుకొచ్చి కాల్చి బొగ్గు తయారుచేసేవాళ్లం. ఇక మా బతుకా? — వెనుకటి రోజుల నాటి బతుకే కాదు. ప్రతీ ఇంట్లోనూ ఆకలి అతిథై కూర్చుంది. ఇంత ఇలా వున్నప్పటికీ — సమష్టిక్షేత్రంలో వ్యవసాయం మాత్రం నిల్చిపోకుండా వుండేందుకని ఎంత చెయ్యాలో అంతా చేశాం, అందరం శాయశక్తులా కష్టపడ్డాం. ఇప్పుడు తల్చుకుంటే జ్ఞాపకంవస్తూంది: మంచి

మాటలు చెప్పి కొందరిని పొంగవేసేదాన్ని, కొందరిని చీవాట్లు పెట్టే దాన్ని, ఒక్కొక్కప్పుడు ఇంచుమించు సిగపట్ల గోత్రం వరకూ వచ్చేది కూడా, ఎన్ని జరగాలో అన్నీ జరిగాయి, ఆ రోజుల్లో ఎన్ని అనుభవించాలో అన్నీ అనుభవించాను.... ఐతేనేంగాక, ఇప్పుడు వంగి వంగి దండాలుపెడతా ప్రజకి — ఆ రోజుల్లో ప్రజ ఒకరినొకరు అంటిపెట్టుకునే వున్నారు గాని విడిపోలేదు, ఒక ప్రజగా వుండిపోయారు. ఆనాటి పడుచులు — ఇప్పుడు ముసలమ్మలు, ఆనాటి పసిపాపలు — ఇప్పుడప్పుడే పిల్లల తండ్రులూ, బిడ్డల్ని కని సంసారాలు చేసుకుంటూన్న తల్లులూనూ. వాళ్ళందరూ బహుశా ఆ రోజులు మరిచిపోయేవుంటారు, నేను మాత్రం వాళ్లని చూసినప్పుడల్లా ఆ రోజులు జ్ఞాపకం తెచ్చుకుంటూంటాను ఆ రోజుల్లో వాళ్ళు ఎలా వుండేవారో. ఇప్పటిక్కూడా నా కళ్ల ఎదుట వాళ్ళు మసల్తూన్నట్టే వుంటారు — వొంటిని చింకి పాతలు, కడుపులో ఆకలి మంట. వాళ్ళు ఆ రోజుల్లో సమష్టిక్షేత్రంలో ఎలా పనిచేశారు, గెలుపుకోసం ఎలా కాసుకునున్నారు, దుఃఖంతో ఎలా కన్నీరు కార్చారు, ఎలా ధైర్యం చూపెట్టారు! ఇప్పటికి కూడా వాళ్ళు అనుకోవడం లేదు — తాము అమరకార్యం సాధించామని. ఆనాడు నేనెన్ని బాధలు భరించినా, తల మునిగిన భారంతో భుజాలు కుంగిపోయినా మేస్త్రీ పని నామీద వేసుకున్నందుకు నేను ఎన్నడూ విచారించను. పొద్దు పొడిచేదో లేదో, లేచి సమష్టిక్షేత్రానికి బయల్దేరే దాన్ని, పొద్దుగూకులూ గుర్రంపైనే, ఇక్కడకు వెళ్ళాల్సివుంటే ఇక్కడకూ, అక్కడకు వెళ్ళాల్సివుంటే అక్కడకూ, స్తెప్‌మైదానంనుంచి కొండలకీ, కొండలనుంచి స్తెప్‌మైదానానికీ — అలా తిరుగుతూండడమే; పొద్దుపోయిన తర్వాత జామురాత్రి వరకూ సమష్టిక్షేత్రం ఆఫీసులో అలాగు పనిలో మునిగిపోయేసరికి, రోజులు వెళ్లిపోతున్నాయన్న సంగతే మరచిపోయాను. ఇదే నన్ను రక్షించిందేమో. ఒక్కొక్కప్పుడు మనుషులు విసుగుతోనూ బాధలు భరించలేక కోపంతోనూ నన్ను తిట్టి, నా పీక పిసికేయడానికి సిద్ధపడి, నా ముఖంమీద పని పారేసినా, — నేను కోపం తెచ్చుకునేదాన్నికాను.

అందుకు బదులు, అలాంటప్పుడు, జైనాక్‌మీదనూ అలిమన్‌మీదనూ మరింత పని పడేసేదాన్ని, వాళ్లకి రాత్రింబగళ్లు విశ్రాంతి అంటూ వుండేదే కాదు, వాళ్లని అంత నిర్దాక్షిణ్యంగా రాసి రంపాన బెట్టానని నేను విచారించడమూ లేదు. లేకపోయుంటే, మా మనస్సు దుఃఖంతోనూ భయంతోనూ చితికిపోయుండేదే. ఒక్క కుటుంబంనుంచి ముగ్గురు మనుషులు యుద్ధానికి వెళ్లిపోయారే అని అదే మనసులో పెట్టుకుంటే, ఇహ బతకడమే? రెణ్ణెళ్లై కాసీమ్ దగ్గరనుంచి ఏ వుత్తరమూ లేదు, ఏ కబురూ లేదు. అలిమనూ నేనూ దోబూచులాడుకుంటూన్నట్టు ఒకరివంక ఒకరం చూసుకునేవాళ్లంకాం, చూసుకుంటే కాసీమ్ గురించి మనస్సుల్లో మెదలుతూన్న ఘోరమైన ఆలోచనలు ఒకరితో ఒకరం ఎక్కడ చెప్పుకోవడం మొదలెడతామో అని. అసలు ఒకరితో ఒకరం మాటాడుకున్నామూ అంటే—ఏదో పిచ్చా పాటీ, లేకుంటే వ్యవసాయక్షేత్రంలో పనీ పాటూ గురించీ, ఇంట్లో ఇది వుందనీ అది లేదనీ. అచ్చంగా చిన్నపిల్లల్లాగానే అసలు ఆ సంగతి జ్ఞాపకం వుంచుకోకుండా వుండేందుకు ప్రయత్నించేవాళ్లం.

చలికాలంలో ఓనాడు పొద్దున్న కమ్మరిసాలలో సాయంచేసేందుకని బయల్దేరాను. మా బండిగుర్రాలకి అక్కడే లాడంవేయడం. కమ్మరిసాలకి వెళ్ళాను. అధ్యక్షుడు ఉసెన్‌బాయ్ అల్లంత దూరంలో అవుపడ్డాడు. గుర్రం ఎక్కి కదం తొక్కిస్తూ వస్తున్నాడు. వేళ్లసందున చిన్న కాగితం పెట్టుకుని అరచేయి నా వంక చూపిస్తూ, "మీకు అర్జెంటు టెలిగ్రాం!" అని కేకేశాడు. నాకు ఊపిరి ఆడలేదు. నాకు వినబడినదల్లా కమ్మరిసాలలో దాగళ్లమీద సమ్మెట బాదులు. ఆ సమ్మెట బాదులు నా గుండెలమీద పడుతూన్నట్టే అనిపించింది. నా ముఖం ఎంత ఘోరంగా వుండాలో అంత ఘోరంగానూ వుండి వుంటుంది.

"ఏం భయపడకండి, తొల్గొనాయ్ పిన్నీ!" అని అధ్యక్షుడు కేకేశాడు. "మసెల్‌బెక్ యిచ్చాడు నొవొసిబిర్‌స్క్‌నుండి. టెలిగ్రాం అందుకోండి,

భయపడకండి!'' అలా అని జీనుమీదనుండి వంగి ఆ కాగితం అందించాడు నాకు. ''మీరు వెంటనే స్టేషనుకి బయల్దేరండి, మీ అబ్బాయి ఏదో రైలు మీద ఈ స్టేషనుమీదుగా వెళ్తున్నాడట, మిమ్మల్ని చూడాలనుందనీ, రైలుకి వచ్చి కలుసుకోమనీ యిచ్చాడు టెలిగ్రాం. మిమ్మల్ని స్టేషనుకి తీసుకెళ్లడానికని బండి సిద్ధంచేయమని చెప్పా, గుర్రాలకి దాణాకని కసవూ ఓట్సూ బండిలో వేసుకొస్తారు. అలా నిలబడి చూస్తున్నారేమిటి? ప్రయాణానికి తయారుకండి!'' అన్నాడు.

ఆ సంతోషం నన్నెలా ముంచెత్తేసిందో ఇహ నేను చెప్పలేను! నేను వూరకే హడావుడి పడిపోతూ, కమ్మరిసాలలోకి పరుగెత్తి వెళ్లానేగాని, ఏమి చేయడానికీ నాకు మతిపోయింది. కమ్మర్లు నన్ను అక్కడనుంచి పంపించేశారు.

''మా అంతట మేం చూసుకుంటాం లెండి, మేస్త్రీ. మీరు త్వరగా వెళ్లండి స్టేషన్‌కి, లేకుంటే వేళ మించిపోతుంది సుమండీ!'' అన్నారు వాళ్లు.

ఇహ నేనింటికి పరుగెత్తా. ఏం చెయ్యాలని పరుగెత్తానో ఏం చెందా లని పరుగెత్తానో నాకే తెలీదు. నాకు తెలిసినదంతా ఒక్కటే: మసెల్‌బెక్ నన్ను స్టేషనుకి రమ్మంటున్నాడు, మసెల్‌బెక్ నన్ను చూడాలంటున్నాడు. రోడ్డుమీద పరుగెత్తా, మంచుకి వొళ్లు ఉడుకెత్తింది, చెమటతో ముద్ద అయిపోయా. అలా పరుగెత్తుతూనే వున్నా, వెర్రిదానిలా, నాలో నేనే మాట్లాడుకుంటూనూ:

''నన్ను రమ్మంటున్నాడు, అంటే ఏమిటి దీని అర్థం? నిన్ను చూడ్డానికి వెయ్యి మైళ్లు పరుగెత్తుకొస్తాన్రా, రెక్కలు కట్టుకు వాల్తాన్రా, నా నాయన!''

అహ్, తల్లి మనసూ, తల్లి సంతోషమూ.... ఆ నిముషంలో అబ్బాయి ఎటు వెళ్తున్నాడో, ఎక్కడికి వెళ్తున్నాడో ఆ మాటే ఆలోచించు కోలేదు నేను.

ఇంటికి పరుగెత్తి వచ్చాను, ఆదరా బాదరా ఇంట్లో వున్నది ఇదీ

అదీ కలిపేసి ఏదో ఇంత చేసేశాను, మాంసం వండేశాను, ఏమంటే మసెల్‌బెక్ ఒక్కడే వుండడుగా! వాడితో ఇంకా మరికొందరు స్నేహితులుంటారు ఎలాగానూ, తను తినాలి, వాళ్లకి ఇంత ఇవ్వాలి వాడు. ఇంట్లో చేసినదని అందరూ ఇష్టంగా తింటారు. తయారుచేసినదంతా తోలు సంచిలో పెట్టి ఆ రోజే అలిమన్‌తోసహా స్టేషన్‌కి బయలుదేరాను. నాతో జైనాక్‌ని తీసుకెళ్దామనుకున్నాను మొదట, కాని వాడే రానన్నాడు.

''కాదమ్మా, అలిమన్ నీతో వస్తే మంచిదమ్మా, నేనింట్లో వుండి ఇల్లు చూస్తూ వుంటాను. అది బాగుంటుందమ్మా'' అన్నాడు వాడు.

తర్వాత నాకు అర్థమైంది, నా కడసారపు కొడుకు చెప్పినదే సరిగ్గా వుందని. వాడు వయసులో కుర్రాడే అయినా, మంచి సెబ్బరలు తెలియని వాడేంకాదు. ఆ రోజుల్లో అలిమన్ ఎలా బతుక్కొస్తూందో, బాధతో ఎలా కుమిలిపోతూందో వాడంతట వాడే గ్రహించుకున్నాడు. అలిమన్ పనిచేస్తున్న గడ్డి కొతారాలకు జైనాక్ పరుగున వెళ్లి, వదినెగారిని పిలుచుకొచ్చాడు. కోడలు అంత సరదాగా వుండడం చూసి ఎన్నాళ్ళో అయింది. మనిషి కళకళ్ళాడుతూంది, కళ్లు మెరసిపోతున్నాయి, నాకంటె హడావుడి పడిపోయి, నన్ను తొందరపెట్టేసింది:

''అత్తయ్యా, నువ్వు తొందరపడాలి, ఇహ నువ్వు తొందరగా సిద్ధమవాలి. ఇదిగో నీ జుబ్బా, ఇదిగో మెత్తని శాలువ కప్పుకుందుకు, బట్టలు వేసుకోమరి, వెళ్ళాలి మనం!''

దారి పొడుగునా గాభరాపడిపోయింది.

''త్వరగా పోనీ, త్వరగా!'' అంటూ బండివాణ్ణి వూరకే తొందరపెట్టేసింది, అంతేకాదు, అప్పుడప్పుడు బండి అబ్బాయి చేతుల్లోంచి కళ్ళెం గుంజుకుని, తనే బండి తోల్తూ, హేయ్ హేయ్ అని కేకలతో గుర్రాల్ని కళ్ళెంతో చరచి, వాటిని దౌడుతీయించింది.

బళ్లు నడచి నడచి గట్టిపడిపోయిన మంచుమీద బండి చకచక పోతోంది. గుర్రాలు హుషారుగా కదం తొక్కుతున్నాయి, చక్రాలు హుష్

హుష్‌మని నెమ్మదిగా చప్పుడు చేసుకుంటూ చక్కగా కందెనవేసిన ఇరుసులమీద సాఫీగా తిరుగుతున్నాయి. పేరినమంచు దారి పొడుగునా పడుతూనే వుంది — నిలకడగానూ సరదాగానూ. గాలి కొద్దిగా శీతలించి, చురుకు చురుకు మంటూంది. అలిమన్‌మీద మంచు చెక్కులు బాగా పడ్డాయేమో, దానికి తెలియలేదు కాని, దాని అందానికి అవి ఎంతో ఒప్పిదంగా వున్నాయి. దాని తలపైనా, శాలువపైనా మొగచెంప పాయలపైనా, తొడుక్కున్న కోటుకాలరుపైనా పేరినమంచు వొత్తుగా పడి, ఎర్రగా తళ తళ మెరసిపోతూన్న ఆ బొద్దు బుగ్గల చామనచాయ ముఖమూ, వడి వడి చూపులు సారించుతూ దేదీప్యమానంగా వెలుగుతూన్న ఆ నల్లని కళ్ళూ తెల్లని పల్వరసల అందానికి కొత్త అందం చేకూర్చుతున్నాయి. పడుచువాళ్లకి ఏదైనా ముచ్చటగా అతుకుతుంది — మంచు చెక్కులైనా సరే. దారి కడాకూ అలిమన్ అలా మాట్లాడుతూనే వుంది. ''మసెల్‌బెక్ రైలు దిగీదిగడంతోనే అతనితో నువ్వేమీ అనకు, నన్ను పోల్చుకుంటాడో లేదో చూదాం మొదట'' అంది నాతో. తర్వాత మళ్ళీ అంది కదా: ''మెల్లిగా వెనుకనుండే వచ్చి అతడి కళ్లు మూసేస్తా, చూద్దాం ఏమంటాడో. భయపడతాడో, లేకపోతే బహుశ, ఈ పెంకిపనీ పిచ్చి చేష్టలూ చేస్తూన్న దెవరిక్కడ? — అని అడుగుతాడో చూద్దాం.'' తన ఆలోచనలకి తనే నవ్వుకుంది, తనే కిచకిచలాడింది. ఓ అలిమన్, అలిమన్, నా ముద్దు కోడలా! తను అలా ఎందుకు ఐపోతూందో నేను ఆ మాత్రం తెలుసుకోలేకపోతున్నాననే అనుకుందా? పాపం, మాటల్లో పడి తనే చెప్పేసింది. తటాల్న వూరకుని, నవ్వు ఆపుకుని, ఓ నిమిషం అలా వుండిపోయి, అప్పుడంది, రహస్యం చెబుతూన్నట్టు:

''మసెల్‌బెక్ మూడు మూర్తులా మళ్ళీ కాసీమే. ఇద్దరూ కవల పిల్లల్లా వుంటారు కదూ, ఏం?''

నాకు వినబడనట్టు వూరుకున్నాను. అదీ వూరుకుంది, అట్టే ఆలోచించుకుంది ఏమిటోనూ, తర్వాత మళ్లీ కళ్ళేన్ని బండి అబ్బాయి చేతుల్లో

నుంచి గుంజుకుని, తనే బండి తోల్తూ, హేయ్, హేయ్ అని కేకలేస్తూ గుర్రాల్ని దౌడుతీయించింది.

సాయంకాలానికల్లా స్టేషను చేరుకున్నాం. గుర్రాలు ఆగే ఆగడంతో అలిమన్, నేనూ ప్లాట్‌ఫారంమీదకి పరుగెత్తాం, మసెల్‌బెక్ అప్పుడే వచ్చే స్తూన్నట్టుగానే. ప్లాట్‌ఫారంమీద ఎవ్వరూ లేరు. నాల్గువైపులా కలియ జూశాం, మనసు కుంగిపోయి, ఏం చేయడానికీ ఎటు వెళ్ళడానికీ తోచక, దిక్కులేని అక్కుపక్షుల్లా అలా నిలబడిపోయాం. నేలనుండి లేస్తూన్న గాలి స్లీపర్లమీదగా పట్టాల మధ్యనుండి ఝామ్మని పరుగెత్తుతూంది. మంచు ముద్దలు అంటుకుని, పట్టాలకు గడ్డకట్టుకుపోయిన గూడ్సు వాగన్లను ఇంజను ఒకటి చీమ నడకతో ముందుకీ వెనక్కీ తీసుకెళ్తూంది — వాగన్లు గణగణ శబ్దంతోనూ కణేలు కణేలు చప్పుడుతోనూ కదుల్తున్నాయి. టెలిగ్రాపు తీగెల మధ్యనుండి గాలి ఈలవేసుకుంటూ పోతూంది.

ఇంతకు ముందెప్పుడూ మేం ఏ రైలుకీ వెళ్ళలేదు, అందుచేత రైలు ఎప్పుడు వస్తుందో, అందుకు మేం ఎంతసేపు ఇంకా కనిపెట్టుకునుండాలో, ఆ సంగతి ఎవరికి తెలుస్తుందో, ఎవరిని అడుగుతే చెబుతారో మాకు తెలి యనే తెలియదు. అడిగి తెలుసుకోవాలని కూడా మాకు తోచలేదు. ఇలా వుండగా, దూరంనుంచి ఇంజను కూత వినబడింది.

''వస్తూంది, అత్తయ్యా!'' అంది అలిమన్.

నా మోకాళ్లు గజగజ వణకాయి, నాకు హడలేసిపోయింది. రైలు గబాగబా దగ్గరకొస్తూంది. మంచు దుమ్మును రేగ్గొట్టుతూ, రివ్వుమని వెళ్లిపోయింది ఇంజను మా పక్కనుండి. రైలు ఆగింది. కంపార్టుమెంట్ల పక్కనుండి పరుగెత్తాం మేం. కంపార్టుమెంట్లు నిండా కిక్కిరిసి వున్నారు జనం. ఆడాళ్ళూ, పిల్లలూనూ — సైనికులు కూడా వున్నారు. వాళ్లు ఎవరో, ఎక్కడికి వెళ్తున్నారో ఎవరికి ఎరుక? ప్రతీ కంపార్టుమెంటు దగ్గరా మేం ఆగి అడిగాం:

''మసెల్‌బెక్ సువన్‌కూలొవ్ వున్నాడా ఇక్కడ? మసెల్‌బెక్ సువన్‌కూలొవ్ ఇందులో వున్నాడేమో చెబుతారా, బాబూ?''

మాకు తెలీదన్నారు కొందరు, కొందరు ఏమీ అనలేదు, కొందరు ముసిముసి నవ్వులు నవ్వారు. మేం పరుగెత్తుతూ అలా అడుగుతూనే వున్నాం — ఇంజను కూతవేసి, రైలు వెళ్లిపోయింది. మా స్టేషనులో ఇంతా చేస్తే ఆ రైలు ఆగినది మూడు నిముషాలే. చేతికి దొరికిన రత్నం నాచుకపోయినట్టు మేం అక్కడే అలా నిలబడిపోయాం. వయసుమళ్లిన రష్యన్ రైల్వే మనిషి ఒకతను — నల్లని గొర్రెబొచ్చు కోటు వేసుకున్నాడు, ఫెల్ట్‌బూడ్సు తొడుక్కున్నాడు — మా దగ్గరకొచ్చాడు. ఇందాకట్లా రైలు వచ్చినప్పుడు ఇతడు ప్లాట్‌ఫారంమీదకి రావడం నేను చూశాను. ఎవరికోసం మీరిలా కనిపెట్టుకున్నారని అతడు అడిగాడు మమ్మల్ని. మా సంగతి చెప్పి, మసెల్‌బెక్ వేసిన టెలిగ్రాం చూపించాం. అతడు సులోచనాలు తగిలించుకుని, పెదవులు కదలించుతూ టెలిగ్రాం చాలా సేపు చదివి, అప్పుడన్నాడు:

''మీ అబ్బాయి మిలిటరీ రైల్లో వెళ్తున్నాడు. మరిగంటే — అది ఏ నెంబరు మిలిటరీ రైలో, అది ఎప్పుడు ఈ స్టేషను మీదుగా వెళ్తుందో — తెలీదే. బండి ఆలస్యం కాకుండా వుంటే, ఈ రాత్రికో రేపటికో రావాలి మరి. ఒహవేళ ఆ బండి అప్పుడే వెళ్ళిపోయిందేమో కూడా. ఈ రోజుల్లో అటుంచి ఇటూ ఇటుంచి అటూ రోజుకి ఎన్ని మిలిటరీ రైళ్లు ఇలా వెళ్తున్నాయో లెక్కా పద్దా! కొన్ని మిలిటరీ రైళ్లు ఈ స్టేషన్లో ఆగకుండానే వెళ్లిపోతాయి కూడానూ.''

మా ముఖాలు వేలబడిపోయాయి.

''ఇస్సు! యుద్ధం, ఏమిటో ఈ యుద్ధం!'' అంటూ ఆ రైల్వే మనిషి నిట్టూర్చాడు. ''కాలాన్ని తలకిందులచేసి పారేస్తూంది. అవును గాని, ఎందుకని ఈ గాలిలో మీరిలా ఇక్కడ నిలబడడం? అదిగో అక్కడుంది వెయిటింగు రూము, అందులోకెళ్లి కూచోండి. రైలు వచ్చినప్పు

డల్లా ప్లాట్‌ఫారంమీదకొచ్చి చూస్తూండండి.... అంతకంటె చేసేదేమీ లేదు మరి'' అన్నాడు.

వెయిటింగు రూములో ఏ పదిమందో వున్నారు జనం. కొందరు బెంచీలమీద పడుకున్నారు. వీళ్లని జీవితం రోడ్డుమీదకీ, రైలు స్టేషన్లలోకీ తరుముతూండాలి. అందుకు వీళ్లు అలవాటుపడిపోయారు, ఇంటికంటె గుడి పదిలం అన్నట్టు వీళ్లకి ఇక్కడే బాగుందేమో మరి. కొందరేమో హాయిగా పడుకున్నారు, కొందరు చుట్ట తాగుతూ కబుర్లు చెప్పుకుంటు న్నారు. ఇద్దరేమో ఓ మూల కూచుని, టిన్ను డొక్కులోనుంచి మరిగే నీళ్లు తాగుతూ నోరు కాల్చుకుంటూ, ఉఫ్ అంటూ నీళ్లమీద వూదుతూ నీళ్లు చల్లార్చుకుంటున్నారు. ఒకడేమో గిటార్ మెల్లగా మీటుతూ తనలో తనే కూనిరాగం తీసి ఏమిటో పాడుకుంటున్నాడు. విరిగిపోయి పొగచూరిన చిమ్నీతో వేలాడే దీపం ఒకటి మిణకరించుతూ పొగ కక్కుతూంది. ఆ చిరుచీకట్లో నాల్గు వైపులా కలియజూసి నేనూ అలిమనూ ఓ బెంచి అంచున కూచున్నాం. అలా కాస్సేపు కూచున్నాక రైలు చప్పుడు విన బడి, గుమ్మంలోకి పరుగెత్తాం. చీకట్లో విసరికొడుతూన్న గాలి, పావడ చెంగునీ కోటు అంచుల్నీ ఎగరగొట్టేస్తూంది. ఆ రైలుకి వున్నవన్నీ గూడ్సు బళ్ళే, మాకు సైనికులు కనబడే లేదు, ఐనా మేం వాగన్ల పక్క నుంచే:

''మసెల్‌బెక్ సువన్‌కూలొవ్ ఉన్నాడా ఇక్కడ?'' అని కేకేసు కుంటూ పరుగెత్తాం.

''మసెల్‌బెక్ సువన్‌కూలొవ్ ఎక్కడున్నాడు?''

ఏ జవాబూ లేదు, ఉలుకూ పలుకూ లేదు. అసలు మనుషులే లేరక్కడ. మేం మళ్ళీ వెయిటింగు రూములోకి వెళ్ళేసరికి అందరూ నిద్రలో వున్నారు.

''అత్తయ్యా, కాస్సేపు పడుకుని కాళ్ళు చాపుకోండి. నేను చూస్తూ వుంటాను రైలుకోసం'' అంది అలిమన్.

కోడలి బుజంమీద తల ఆనించి, రవంత సేపు కునుకు తీద్దామను కున్నా, కాని కన్ను మూతపడ్లేదు. ఎలా నిద్ర పోగలను? ఎలా నిద్రపడు తుంది — వస్తూన్న రైలు చప్పుడుకోసమని చెవులు రెండూ కాకుండా, గుండే మనసూ కూడా కాచుకుని వుంటే — ఎలా నిద్రపోను? భూమి కాస్త అదిరేటప్పటి కల్లా, మొదటిగుండా నా కాళ్లకే తెలిసిపోయేది ఏదో రైలు వస్తూందని, దానితో ఉలికిపడి చప్పున లేచేదాన్ని. ఎటు వైపు నుంచి రైలు వెళ్లినా సరే, తోలుసంచి పట్టుకుని ఒక్క గంతు వేసి ప్లాట్ ఫారంమీదకి పరుగెత్తే వాళ్లం.

ఎన్నో మిలిటరీ రైళ్లు వెళ్ళాయి, కాని వాటిలో దేనిలోనూ లేడు మసెల్‌బెక్. అర్ధరాత్రి అయింది, మా పాదాలకింద భూమి మళ్ళీ అదిరింది, ఒక్క గంతువేసి ప్లాట్‌ఫారంమీదకి వెళ్ళాం. కనుమ రెండు వైపుల నుండీ రెండు రైళ్లకూతలు ఒక్కసారే వినబడ్డాయి, కనుమ రెండు వైపులనుండీ ఒక్క సారే వస్తున్నాయి రెండు రైళ్ళూనూ. దాంతో మాకు మతులు పోయి, ఇటూ అటూ దేవుళ్ళాడుతూ, ఆ పట్టాలూ ఈ పట్టాలూ మధ్యను ఉండిపోయాం. రెండు వైపులనుండీ రెండు రైళ్ళూ ఝామని వచ్చేశాయి, ఒకదాని పక్కనుండి ఒకటి వెళ్తూన్నకొద్దీ వాటి జోరు మరింత ఉధృతమైంది. కణేలు కణేలు మంటున్నాయి చక్రాలు, హోరుమని విసరికొడుతూన్న గాలి మమ్మల్ని మంచు సుడిలో చుట్టబెట్టి, రివ్వున పరుగెత్తుతూన్న రైలు వాగన్లకిందకి మమ్మల్ని లాగేయాలని చూసింది.

''అత్తయ్యా!'' అని అలిమన్ ఒక్క కేకపెట్టి, నన్ను గట్టిగా పట్టుకుని, అక్కడున్న లాంతరు స్తంభానికి నన్ను అదిమి కౌగలించేసు కుని, ఇక వదలి పెట్టిందికాదు.

మెరుపుల్లా పరుగులు తీస్తూన్న ఆ రైలుకిటికీల్లోపలికి అట్టే చూశాను: ఏమో, వాటిలో నా కన్నకొడుకు, నా చిట్టి తండ్రి వున్నా డేమో? అయ్యో, నాకు తెలియకుండా వుందే! పరుగులు తీస్తూన్న ఆ

చక్రాలకింద వున్న పట్టాలు, నా కడుపున పుట్టిన కొడుక్కోసం హడలి పోతూన్న నా గుండెలాగానే, మ్రోమని మూల్గుతున్నాయి. ఒకదాని పక్కనుండి ఒకటి వెళ్ళిపోతూ అవి రేపిన మంచు మేఘాల్లోకే ఆ రెండు రైళ్ళూ అదృశ్యమైపోయాయి. ఎంతో సేపటివరకూ మేము ఆ స్తంభానికి అంటిపెట్టుకునే అలా వుండిపోయాం.

తెల్లవార్లూ ఆ వస్తూ వెళ్తూన్న మిలిటరీ రైళ్లవెంట, ఈ కొస నుండి ఆ కొసకూ, ఆ కొసనుండి ఈ కొసకూ పరుగెత్తుతూనే వున్నాం, ఒక్క క్షణమైనా కూచోలేదు. పొద్దు పొడుస్తూందనగా మంచుతుపాను తటాలున తేలిపోయేప్పటికి — అదేమిటో చిత్రంగా వున్న ఓ రైలు పడ మటినుండి వచ్చి, స్టేషన్లో ఆగింది. మేం అంతవరకూ చూసిన మన మిలి టరీ రైళ్ల ఏవీ ఇలా లేవు: కంపార్టుమెంట్లన్నీ నల్లగా కాలిపోయున్నాయి, పైకప్పులన్నీ ధ్వంసమైపోయాయి, తలుపులన్నీ విరిగిపోయి ఊడబెరికేసి వున్నాయి. రైలు అంతటిలోనూ ఒక్క మనిషి ఐనా లేడు. ఆ ఖాళీ పెట్టెలన్నీ శ్మశానంలా స్తబ్ధుగా వున్నాయి. పొగ వాసనా, దగ్ధమైన ఇనుమూ, బొగ్గుకింద మాడిన బల్లచెక్కలూ కాలిన రంగూ — అంతా కమురు కంపు కొడుతూంది.

నిన్న మాకు పరిచయమైన నల్లని గొర్రెబొచ్చుకోటు వేసుకున్న రైల్వే మనిషి లాంతరు పట్టుకుని అక్కడకొచ్చాడు.

అతడిని అడిగింది అలిమన్ డగ్గుత్తికతో:

''ఇది ఏ మిలిటరీ రైలు?''

''ఇది బాంబు దెబ్బలు తిన్న రైలు'' అని అతడూ డగ్గుత్తికతోనే బదులుచెప్పాడు.

''మరైతే, ఈ పెట్టెలు ఎక్కడకెళ్తున్నాయి?''

''మరమ్మతుకి'' అని మళ్ళీ ఇందాకట్లాగే డగ్గుత్తికతోనే బదులు చెప్పాడు.

ఈ సంభాషణ విన్నాను. ఆ కంపార్టుమెంట్లలో వుండినవాళ్ళు

ఆ పొగలోనూ, మూలుగుల్లోనూ, మంటల్లోనూ జీవితానికి స్వస్తిచెప్పిన వాళ్ళు, చేతులూ కాళ్ళూ ఎగిరిపోయినవాళ్ళు, ఇహ బతికున్నంత కాలమూ చెవులు గడియలు పడిపోయి, కళ్ళు చిల్లులు పడిపోయినవాళ్ళు – వీళ్ల మీదకే పోయింది నా మనసు.... కాని ఈ బాంబులు – యుద్ధం ప్రతి ధ్వనే. మరి అలాంటప్పుడు, అసలు యుద్ధం ఇంకా ఎలా వుంటుందో!

బాంబుదెబ్బలు తిన్న మిలిటరీ రైలు చాలాసేపువరకూ స్టేషను లోనే వుండిపోయింది, తర్వాత అది మెల్లగా బయల్దేరి, జాలిగా మొర పెడుతూ ఎక్కడికో వెళ్లిపోయింది. ఆ వెళ్లిపోతూన్న రైలును చూస్తూ వుంటే, నా గుండెల్లో కారుచీకట్లు నిరాశ అలముకుంది: బాంబులకు కాలి పోయిన ఈ మిలిటరీ రైలు ఎక్కడనుంచైతే వచ్చిందో అక్కడకే మసెల్ బెక్ వెళ్ళాల్సివుందన్న మాట. మరి కాసీమ్ ఎలా వున్నాడో? సువన్‌కూల్ మాటేమిటి? తన పటాలం ర్యజాన్ పట్టణం దగ్గర ఎక్కడో వున్నట్టు రాశాడు. బహుశ ఇది యుద్ధశ్రేణికి ఏమంత దూరంలో వుండదేమో....

తెల్లవారింది. మాకు బయల్దేరే వేళైంది. గుర్రాలకోసం తీసుకొచ్చిన గడ్డి అయిపోయింది. కాని మసెల్‌బెక్ ఇటుమీదుగా ఇంతవరకూ వెళ్లి వుండకపోతే – అప్పుడో? అప్పుడేమిటి? ఇంతసేపు కనిపెట్టుకున్నామే, తీరా ఇప్పుడు వెళ్లిపోవడమంటే గుండె బేజారెత్తిపోతూందే! నేనూ అలిమనూ ఎంతో ఆలోచించుకున్నాం, ఎంతో అనుకున్నాం. ఏమైనా సరే వెళ్లి పోడానికి మాత్రం మాకు కాళ్లు రాలేదు.

ఆకాశం చూస్తే నిన్నట్లాగే వుంది – ఈదరగాలి కొడుతూంది, చలి వణకించేస్తూంది. మరి అందుకనే కనుమలో వున్న ఈ రైలు స్టేష నుకి గాడ్పుల సత్రం అని పేరుపెట్టారు. తటాల్న మేఘాలు విడిపోయాయి, సూర్యుడు తొంగిచూపులు చూశాడు. మనసులో అనుకున్నాను: ''అబ్బా! మేఘాల చాటునుండి కనబడిన ఈ సూర్యుడికిమల్లేనే మా అబ్బాయి కూడా చటిక్కున మెరపు మెరసినట్టు కనబడితేనో, ఒక్కసారి నా కంటబడితేనో....''

సరిగా అప్పుడే దూరాన రైలు చప్పుడైంది. రైలు తూర్పునుంచి వస్తూంది. రైలు కూసిన రెండు కూతలూ కనుమవెంట దొర్లుకుంటూ వచ్చాయి.

కాళ్లకింద నేల దడదడ అదిరింది, పట్టాలు ఝంకరించాయి. పొగ మబ్బులా ఆవిరి మేఘాల అగ్ని జ్వాలలా నడుమనుండి ఎరుపు చక్రాలున్న నల్లని ఇంజన్లు రెండూ, టార్పాలిన్ గుడ్డలు కప్పిన టాంకులూ, పెద్దపెద్ద ఫిరంగులూ, వీటి పక్కను గొర్రెబొచ్చుకోట్లు తొడుక్కుని రైఫిళ్లు పట్టుకున్న కాపలా సైనికులూ వున్న ప్లాట్‌ఫారం వాగన్లూ, తెరచిన తలుపుల దగ్గర గుంపుకూడిన సైనికులున్నట్టి వెచ్చచేయబడిన గూడ్సుబళ్ళూ, ఒక దాని తర్వాత ఒకటి మెరపుల్లా మా పక్కనుంచి వెళ్లిపోయాయి. ఆ బళ్లు మా పక్కనుంచి చకచక పరుగెత్తి వెళ్లిపోతూంటే ముఖాలూ, ఓవరు కోట్లూ లిప్తమాత్రం కనబడ్డాయి, పాటల్లో సాహిత్యపు ముక్కలూ, మాటల తునకలూ, ఎకార్డియానూ బలలాయికా వాయిద్యాల శబ్దమూ క్షణమాత్రం వినబడ్డాయి. మేం అలా చూస్తూ నిలబడిపోయాం. అదే సమయానికి ఎవరో ఒక మనిషి పచ్చ జెండా ఎర్ర జెండా పట్టుకుని, మా దగ్గరకు పరుగున వచ్చి:

''ఇక్కడ రైలు ఆగదు! ఆగదు! లెండి! దోవలో నిలబడకండి!'' అని మా చెవిలో కేకవేస్తూ మమ్మల్ని అక్కడనుంచి వెనక్కి నెట్టేశాడు.

ఆ క్షణంలోనే మా పక్కను ఒక కేక వినబడింది:

''అ-మ్మ-మ్మా! అలిమా-న్!''

అయ్యో, అయ్యో! మసెల్‌బెక్! మసెల్‌బెక్కే అది — ఆరె భగవంతుడా మా పక్కనుంచే — సరాసరి మా పక్కనుంచే — పక్షి ఎగిరి వెళ్లిపోయినట్టు — వెళ్లిపోయాడు. ఒక చేతితో తలుపు పట్టుకుని, బండిలోనుంచి మనిషి అంతా వంగిపోయి చూస్తూ, రెండో చేతిలో వున్న టోపీ వూపుతూ గట్టిగా అరుస్తూ మాకు వీడ్కోలు చెప్పాడు. ''మసెల్‌బెక్!'' అని నేనొక్క కేక పెట్టా — అదొక్కటే నాకు జ్ఞాపకం. ఆ ఒక్క కను

రెప్పపాటు కాలంలోనూ వాడు స్పష్టంగానూ కళ్లకి కట్టినట్టూ అవు పించాడు: వాడి తల గాలికి రేగిపోయుంది, ఓవరుకోటు అంచులు పక్షి రెక్కల్లా కొట్టుకుంటున్నాయి, ఇహ ముఖంలోనూ కళ్లల్లోనూ సంతోషమూ విచారమూ, వ్యాకులమూ వీడ్కోలూ! నా రెండు కళ్ళూ వాడికే ఒప్పగించేసి, రైలును వెంబడించుతూన్నట్టుగా దాని వెంట పరుగెత్తా. ఆఖరి వాగను నా పక్కనుండి హోరుమని వెళ్లిపోయింది, నేను మాత్రం ఆ స్లీపర్ల మీదనుండి అలా పరుగెత్తుతూనే వున్నా, పరుగెత్తి పరుగెత్తి, తర్వాత పడిపోయా. అబ్బా, ఏమి మూలిగానో, ఏమి ఏడ్చానో! నా కన్న కొడుకు యుద్ధభూమికి వెళ్లిపోయాడు, నేనేమో ఆ చల్లని రైలుపట్టాను కౌగిలించుకుని వాడికి వీడ్కోలు ఇస్తున్నాను. రైలు చక్రాల టకటక చప్పుడు అంతకంతకు మరింత అస్పష్టమైపోతూంది, మరో గడియకల్లా మణగిపోయింది.

ఈనాటికి కూడా ఆ మిలిటరీ రైలు హోరుమంటూ నా గుండెల్లో పరుగెత్తుతూన్నట్టే వుంటుంది, ఆ చక్రాల చప్పుడు అలా నా చెవుల్లో వినబడుతూనే వుంటుంది.

అలిమన్ పరుగెత్తి వచ్చింది నా వెంట, దాని కళ్లవెంబడి కన్నీళ్లు ధారకట్టి కారిపోతున్నాయి. అది నా పక్కన వంగుని నన్ను లేవనెత్త బోయింది, కాని దాని చేతులు గజగజ వణకిపోతున్నాయేమో లేవనెత్తలేక పోయింది. ఆ సమయానికి, ఓ రష్యన్ రైల్వే కార్మికురాలు, కంటేవాలీ, మా దగ్గరకు వచ్చింది. ఆమె కూడా నన్ను కౌగలించుకుని, ''అమ్మా! అమ్మా!'' అంటూ బావురని ఏడ్చింది. వాళ్లిద్దరూ కలిసి నన్ను గట్టు మీదకు తీసుకెళ్ళారు. అక్కడనుంచి మేం స్టేషనుకు వెళ్తూండగా అలిమన్ సైనికుని టోపీ ఒకదానిని నాకు ఇచ్చి:

''దీన్ని తీసుకోండి, అత్తయ్యా, మసెల్‌బెక్ ఇచ్చాడు మీకు'' అంది.

నేను వాగనువెంట పరుగెత్తుతూన్నప్పుడు నాకోసమని వాడు తన టోపీని గిరవాటు వేశాడన్న మాట.

ఈ టోపీ పట్టుకుని ఇంటికి వెళ్లిపోయాం బండిలో; బండిలో కూచుని ఆ టోపీని నా గుండెలకి గట్టిగా హత్తుకున్నాను.

ఆ టోపీ ఈనాటికి కూడా ఇంట్లో గోడకి తగిలించే వుంది. సైని కులు పెట్టుకునే మామూలు టోపీయే అది—నుదుట చిన్న ఎర్ర నక్షత్రం వున్న బూడిదెవన్నె ఫరటోపీ. అప్పుడప్పుడు దానివి గోడమీద నుంచి తీసి, ముఖానికి అద్దుకుని, వాడి వాసన జ్ఞాపకం తెచ్చుకుందుకు ప్రయత్నిస్తూంటాను.

## 6

"ఓ తల్లీ, భూమాతా! నువ్వే చెప్పు, కన్నకొడుకుని ఒక్కసారి క్షణమాత్రం కళ్ళారా చూడ్డానికి ఏ తల్లి అయినా ఈ భూలోకంలో ఇన్ని అష్టకష్టాలూ, ఇంతటి మానసిక క్షోభా పడిందా?"

"చెప్పలేను, తొల్గొనాయ్. మీ కాలంలో జరిగిన అలాంటి యుద్ధాన్ని భూలోకం ఎన్నడూ ఎరగదు."

"అదే ఐతే, తన కన్నకొడుక్కోసం అంతలా పడిగాపులు కాసుకు నుండిన తల్లిని నేనే కడపటిదాన్ని అయితే అంతే చాలు! భగవంతుడు రక్షించి, మరే తల్లికీ కూడా రైలుపట్టాలను కౌగలించుకుని, స్లీపర్లమీద పడి నెత్తిని కొట్టుకునే ఖర్మం పట్టకుండా వుండాలి!"

"నువ్వు ఇల్లు చేరుకున్నప్పుడు నీ ముఖాన్నిబట్టే తెలిసిపోయింది, నీ కొడుకుని నువ్వు కలుసుకోలేదన్న సంగతి. నీ ముఖం పాలిపోయి పచ్చబడి పోయింది, చిత్రహింసల పాలైన ఆ కళ్లు జబ్బుతో తీసుకుని మంచం పట్టినట్టుగా, వూడిపడిపోవడానికి సిద్ధంగా వున్నాయి."

"నిజంగా ఏ జ్వరంతోనో పడిపోయుంటేనే నయమేమో!"

"పాపం, తొల్గొనాయ్, నిన్ను చూస్తే జాలి వేస్తుంది. ఆ ఏడాది లోనే నీ జుట్టు సాంతమూ నెరసిపోయింది. అంతకు ముందు నీ జడలు

ఎంత బరువుగా ఎంత వొత్తుగా వుండేవి.... ఆ రోజుల్లో నువ్వు మాటాడే దానవు కాదు, పరుసదనం కూడా వచ్చేసింది నీ కప్పుడు. మూతి ముడుచుకుని ఇక్కడకు వచ్చేదానవు, ఇక్కడనుంచి పళ్లు బిగించుకుని వెళ్లిపోయేదానవు. కాని నేను అర్థంచేసుకున్నాను నిన్ను, నీ కళ్లు చూస్తేనే తెలిసిపోయేది, తడవతడవకూ, నువ్వు మరింత మరింత బాధపడిపోతున్నావని.''

''అవును, తల్లీ, భూదేవీ! ఎంత అనుకున్నా నా శక్యం అయేదికాదు. ఇలా బాధపడిపోతూన్నదాన్ని నేనొక్కర్తెనే అయివుంటే పోనీ అనుకోవచ్చు — ఆ యుద్ధం వాతపడని కుటుంబం ఒక్కటీ లేదు. ఆ యుద్ధంవల్ల దెబ్బ తినని మనిషి ఒక్కడూ లేడు. ఆ నల్లని అంచు కాగితాలు, మరణపత్రాలు, వచ్చేసరికల్లా, గ్రామంలో ఒక్క పాళంగానే రెండు మూడిళ్లలో శోకన్నాలూ శాపనార్థాలూ మొదలయేవి. ఇహ నా వొళ్లు మండిపోయేది, శత్రువుమీద కసితీర్చుందామనే వెర్రి ద్వేషంతో కళ్లు గుడ్డి అయిపోయి, గుండె దహించుకుపోయేది. నా దుఃఖమూ పరాయివాళ్ల దుఃఖమూ నేను దిగమింగుతూ, కష్టాలూ ఆకలి పస్తులూ, చలి బాధలూ అన్నిటినీ వాళ్లతో కూడా పంచుకుంటూ, అచ్చంగా ఆ రోజుల్లోనే నేను మేస్త్రీగా వున్నానని నేనెంతో గర్వపడుతున్నాననుకో. అందుకనే అవన్నీ తట్టుకుని నేను నిలబడగల్గాను, ఇతరుల కోసమని నిలబడగల్గాను. లేకుంటే నేను నేలకొరిగే దాన్నే, యుద్ధం నన్ను మట్టికింద తొక్కితొక్కి పారేసివుండేదే. అప్పుడు గ్రహించుకున్నాను నేను, యుద్ధంలో మనిషి పాటించాల్సిన ధర్మం అంతా ఒక్కటి — యుద్ధంచేయడం, పోరాడ్డం, గెలవడం. లేకుంటే — చావు! తల్లీ, భూమాతా, ఓ చేనా! అందుకోసమే, ఆ రోజుల్లో నేనెప్పుడూ గుర్రంమీద స్వారిచేస్తూనే నీ దగ్గరకి వచ్చేదాన్ని, వచ్చి, నా కష్టాలతో నిన్ను బాధపెట్టకుండానే, నోరువిప్పకుండానే నీకు దండంపెట్టి, మారు మాటాడకుండా మళ్ళీ తిరిగి వెళ్లిపోయేదాన్ని.

## 7

అది కాసీమ్‌నుండి వుత్తరం వచ్చిన రోజు. ఆ వుత్తరం పట్టుకుని చప్పున గుర్రం ఎక్కి, దారీ తెన్నూ చూసుకోకుండానే ఒక్క గంటలో కాల్వల మీదనుండీ మంచుదిబ్బలమీదనుండీ దూకుతూ గుర్రాన్ని దౌడు తీయించి వెళ్ళాను. అలిమనూ, జైనాకూ చేనులో పెంట చల్లుతున్నారు. వాళ్ళని గుర్రందగ్గరకి రమ్మని కేకేశా:

''శుభవార్త, శుభవార్త!''

వాళ్ళని సంతోషపెట్టకుండా ఎలా వుండను? రెణ్ణెల్లై కాసీమ్ దగ్గరనుంచి వుత్తరం పత్రం లేదు. వాడు ఎక్కడ వున్నదీ, ఎలా వున్నదీ మాకు ఏ కబురూ లేదు. ఆ మాస్కో రక్షణశ్రేణులలో తను రెండుసార్లు యుద్ధం చేశాననీ, రెండుసార్లూ ఏమీ గాయపడలేదనీ వుత్తరంలో రాశాడు. జర్మన్లను ఇహ అక్కడ నిలువరించినట్టూ, వాళ్ళ కోరలు వూడగొట్టినట్టూ, తన రెజిమెంటును విశ్రాంతి కోసమని వెనక్కి తర లించినట్టూ రాశాడు.

అలిమన్ ఏమి సంబరపడిందో ఇహ చెప్పలేం! బండిలోంచి దూకేసి, జైనాక్‌కంటె మరింత వేగంగా పరుగెత్తి వాణ్ణి దాటేసింది.

''నీ నాలుక తేనె, అత్తయ్యా!'' అంటూ గజగజ వణకుతూన్న చేతుల్తో అలిమన్ ఆ వుత్తరం లాక్కుని, ఆనందంలో పడి కొట్టుకు పోయి, వుత్తరం చదవనేలేకపోయింది. ఎంతసేపూ దాని నోటివెంట ఒకటే మాట: ''బతికున్నాడు! బతికే వున్నాడు, బాగున్నాడు!''

ఆడంగులందరూ అక్కడికి చేరుకుని, దాని చుట్టూ చేరారు.

''అలిమన్, వుత్తరం చదువు! మీ ఆయన ఏమిటి రాశాడు? మా వాళ్ళ గురించి ఏమేనా రాశాడా?'' అని వాళ్ళందరూ అడిగారు.

అలిమన్ అంది:

''ఇదిగో చదువుతాను గాని, ఒక్క క్షణం వుండండి!'' అందేగాని ఒక్క ముక్క అయినా చదవలేకపోయింది.

జైనాక్ మరి ఓపికపట్టలేకపోయాడు:

''ఇదిగో, ఇలా ఇయ్యి! ఏమిటి రాశాడో వినాలని వుంది అందరికీనీ'' అంటూ దాని చేతిలోనుంచి వుత్తరం తీసుకుని పైకి చదవడం మొదలెట్టాడు.

అలిమన్ అక్కడ చతికిలబడి, నేలమీద వున్న మంచును దోసిళ్లతో తీసి నుదుట పూసుకుంటూంది. జైనాక్ వుత్తరం చదవడం పూర్తికాగానే ఆమె, ముఖాన వున్న మంచును తుడుచుకోవడం కూడా మరచిపోయి, లేచి నిలబడింది. సంతోషంలో మునిగిపోయున్న ముఖాన వున్న మంచు కరగి, పిల్లయేళ్లయి పారుతూంది.

''ఇహ మనం పనిలోకి వెళ్దాం!'' అని అలిమన్ మెల్లగా అంటూ, మంచులోంచి నెమ్మదిగా నడచింది.

నడుస్తూ, ఇటూ అటూ కలియజూస్తూ, ఏదో ఆలోచించుకుంటూంది. దాని మనసులో ఏమి ఆలోచనలు మెదల్తూవున్నాయో ఏం చెప్పగలం? క్రితం వేసవిలో తను కూజా పట్టుకుని దుబ్బుల్లోనుంచి పరుగెత్తి పెనిమిటిదగ్గరకు వెళ్లడం గురించో లేక కాసీమ్ తన కంబైనుకి ఇక్కడే వీడ్కోలు చెప్పడం గురించో అయివుండొచ్చు. తన స్మృతులలో ఏవి తనకు ప్రియతమమైనవో వాటన్నిటిలోనూ అలిమన్ మళ్ళీ మరొకసారి జీవించుతూందేమో అనిపించింది నాకు. ఆమె కళ్లు నవ్వుతూన్నాయి, మరు క్షణం చెమ్మగిలితూన్నాయి. హైరోడ్డువంక ఇటూ అటూ ఎంతో సేపు చూసింది — బూడిదెవన్నె దాట్ల గుర్రం రోడ్డుమీద ఎలా అదృశ్యమైపోయినదీ, దాని గిట్టల చప్పుడు టకటక ఎలా చప్పుడైనదీ, కాసీమ్ వెంట తను ఎలా పరుగెత్తినదీ, ఇదంతా దానికి మళ్ళీ జ్ఞాపకంవచ్చే వుంటుంది బహుశా.

జైనాక్ ఆమె పక్కనే నడుస్తూ, ఆమెను హాస్యం చేస్తున్నాడు:

''అవును గాని, ఇహ లేచి, తెలివితెచ్చుకో! వూళ్ళోవాళ్లందరూ నిన్ను చూసి నవ్విపోగలరు సుమా, ఆ మాట మరచిపోకు, తెలిసిందా! వుత్తరం

చదవలేకపోయావు, ఆహా ఏమి మనిషివి! నేను రాస్తా కాపీమ్‌కి — నీ పెళ్ళాం మళ్ళీ బడిలో ప్రవేశించి ఓనమాలు నేర్చుకోవడం మొదలెట్టిందని!''

అలిమన్ వాడికి నాలుగు తగిలించింది, తర్వాత వాళ్ళిద్దరూ పందెం వేసుకుని బండి దగ్గరకు పరుగెత్తారు.

నేనూ అలా ఆలోచనలో మునిగి వాళ్ళవెంట వెళ్ళాను. అవును మరి, ఇలాంటి జిగిత్‌లు, మా అబ్బాయిల్లాంటి జవాన్లు, కాకపోతే ఇంకెవరు కాపాడుతారు ప్రజని? వాళ్ళు బతికి బాగుండి, యుద్ధం గెల్చి ఇంటికొస్తే బాగున్ను. ఇక కడమదంతా భరించుతాం, ఎలాగో ఓర్చుకుంటాం, మను షులం ఎముకలపోగైపోయినా బాధలేదు, జయం మాత్రం సాధించితీరాలి, అంతే. అదిన్నీ త్వరలోనే, త్వరలోనే జయం పొందాలి! ఇది నా ఒక్కదాని కోర్కెకాకుండా, యావత్తు ప్రజలూ కంటూన్న కల, వారి జీవితలక్ష్యమూ కావడంచేతనే దీనినంతనూ నేను భరించగల్గాను, ఏమి జరిగినా సరే అని సమ్మతించాను.

నా చిన్నకొడుకు, నా కడసారపువాడు జైనాక్, వాడికింకా పద్దెని మిదేళ్ళేనా నిండలేదు — యుద్ధశ్రేణికి వెళ్ళిపోయినప్పుడు, నేనేమీ అనలేదు, పళ్ళు బిగించి, బాధ దిగమింగేసుకున్నాను.

శీతాకాలం ఆఖరి రోజుల్లో ఎన్‌లిస్ట్‌మెంటు ఆఫీసుకు రమ్మనమని తరుచు వాడికి పిలుపు వస్తూండేది, వాడికొక్కడికే కాదు, వాడితోపాటు ఇంకా ఎందరు కుర్రాళ్లకో కూడా — మిలిటరీలో తర్ఫీదు పొందాల్సిందని. అయితే, ఇది మామూలు సంగతే, ఇందులో పెద్దగా బెంగపెట్టుకుందుకు ఏమీ లేకపోయింది. కవాతుచేస్తూ నడవడం, కవాతుచేస్తూ నడవడం — అలా పదిరోజులపాటు, ఆతర్వాత మళ్ళీ ఇంటికి పంపించేసేవారు. ఒకసారి మామూలుకంటె ముందుగానే, రెండ్రోజుల్లోనే ఇంటికొచ్చేశాడు.

''ఇదేమిటి ఇంత ముందుగానే వచ్చేశావేమిటి?'' అన్నాను ఆశ్చర్య పడుతూ. ''మరి ఏకంగా ఆటవిడుపేనా ఏమిటి?''

''లేదమ్మా'' అన్నాడు జైనాక్ ''రేపు మళ్ళీ వెళ్తాను. ఒక రోజుకి

ఇంట్లో వుండి రమ్మన్నారు. ఈ సారి మమ్మల్ని అక్కడ మునుపటికంటె ఎక్కువ రోజులే వుంచుతారు, అంచేత నువ్వు మరేమీ దిగులుపడకు.''

సరే అని నేను నమ్మాను, నాకు ఏ అనుమానమూ తోచలేదు. ఆ రోజు మాత్రం వాడు ఏదో అదో మోస్తరుగా వున్నాడు, ఏదో దూర ప్రయాణంమీద వెళ్తూన్నట్టూ, అందుకని అంతా సిద్ధం చేసుకుంటూన్న ట్టూనూ. సుత్తీ మేకులూ పుచ్చుకుని ఉదయం అంతా ఇటూ అటూ తిరిగి ఇక్కడ ఈ మేకు కొట్టనూ, అక్కడ అది బిగించనూ. అదయాక, గొడ్డలి పుచ్చుకుని ఒక మోకు వంటచెరకు కొట్టాడు, పెరట్లోకి పెంట కుప్ప తోలాడు, షెడ్డు పైకప్పుమీద ఎండుతూన్న కసవు తిరగబోసి, మళ్ళీ దానిని పైకప్పుమీద పరచి, సర్ది, ఎండవేశాడు. ఇహ సాయంకాలం, నేను ఇంటికి వచ్చేసరికల్లా, ముందు పెరడంతా వూడ్చేశాడు, గుర్రపుశాల కాస్త పడిపోయుంటే దాన్నంతా బాగుచేశాడు. వాళ్ల నాన్న వున్నప్పుడు ఈ శాల అవసరమయేది, ఎప్పుడు కావలసివస్తే అప్పుడు గుర్రం తయా రుగా వుండడమంటే వాళ్ల నాన్నకి ఇష్టం.

''హారే నాయనా! ఎందుకురా వూరకే పనిచేసి అలసటపడతావు? అదంతా వేసవిలో చూసుకోవచ్చుగా'' అన్నాను వాడితో.

''తీరిక వున్నప్పుడే పనులు చక్కబెట్టుకోవాలి, ఆతర్వాత మళ్ళీ రమ్మన మంటే వస్తుందా ఏమిటి?'' అనేశాడు. తెలివిమాలినదాన్ని, నేనేమీ అప్పుడు గ్రహించుకున్నాను కాను. కొమ్‌సొమోల్ పిలుపు అందుకుని వాడు స్వచ్ఛందంగానే యుద్ధంలోకి వెళ్తున్నాడని నాకు తోచనే తోచలేదు. జైనాక్ ఇంటినుండి బయల్దేరిన తర్వాత మాకు తెలిసింది. స్టేషనునుంచి వుత్తరం రాసి, తన స్నేహితులకిచ్చి పంపించాడు. ఇలా చేసి వుండకూడ దురా, ఒరే నాయనా, నువ్వు ఎంత వుత్తరం పంపించినా, నువ్వు వీడ్కోలు చెప్పకుండా అలా వెళ్లిపోవచ్చునట్రా, నా తండ్రీ? దుఃఖంతో నాకు ఎంత మతిపోయి వుండినప్పటికైనా, ఏమైనా సరే, వెళ్లొస్తానమ్మా అని చెప్పివుండాల్సిందిరా. ఏమీ చెప్పకుండా వెళ్లిపోయినందుకు తనను క్షమించ

వలసిందని నన్నూ అలిమన్నీ కోరుతూ ఆ వుత్తరంలో రాశాడు. అలా వెళ్లిపోతేనే ఒక్క దెబ్బతో తుంచేసినట్టు తేలికగా వుంటుందన్నాడు. మీకు సాధ్యమైనంతవరకూ బాధ, బెంగ తగ్గించడానికనే, అంతా ఒక్కసారే తటాల్న మీకు తెలిస్తే ఇహ ఎలాగూ ఏమి చేసేదీ లేదని నా నిశ్చయంతో మీరు రాజీపడిపోయి, సరే అని సర్దుకుంటారు కదా అనే నేనిలా చేశాను అని రాశాడు. ఎవరు చెప్పగలరు, ఏమో వాడు చేసింది సరిగానే వుందేమో? అవును మరి, నాతో ముఖాముఖీ చెప్పడం వాడికెంతో కష్టమే, నేను నెత్తి నోరూ కొట్టుకుని లబోదిబోమని ఏడ్చి, ప్రాధేయపడి తనను ఎలాగో ఒప్పించి ఉంచేస్తానేమో అని భయపడ్డాడేమో కూడానూ....

ఇహ ఇప్పుడు, వాణ్ణి పోగొట్టుకున్నాక ఎన్నో యేళ్లు గడచినాక, నా తల్లి భూదేవితో ఎలా చెప్పుకుంటానో, వాడితోనూ అలానే చెప్పుకుం టాను.

జైనాక్, నేను చెప్పేది విను! నాకు నొప్పి కల్గించావని నీ మనస్సా క్షిని నిన్ను బాధపెట్టనివ్వకు, నాకేమీ నొప్పికల్గలేదు. నిన్ను నేను అప్పుడే ఆనాడే క్షమించేశాను, జైనాక్, నా చిట్టి తండ్రీ, నా నాయన, నా కంటి పాప, నా లేగదూడ, నా చందమామ! నువ్వు వీడ్కోలు చెప్పకుండా ఎందుకు వెళ్లిపోయావో, నన్ను ఒక్కర్తెనే చేసేసి నువ్వు ఎందుకు వెళ్లిపోయావో, నీ యౌవనానికీ పడుచుతనానికీ, నీ భావి జీవితానికీ ఎందుకు స్వస్తిచెప్పేశావో నాకు తెలియదనుకున్నావా? నువ్వు మంచి హుషారైన కుర్రవాడివి, హడా వుడి కుర్రవాడివి, కాని ప్రజలంటే నీ కెంత ప్రేమ వుందో ఆ సంగతి అందరకీ తెలియలేదు. మా బాధలు చూసి నువ్వు భరించలేకపోయావు, అందుకే నువ్వు వెళ్లిపోయావు. మానవులు మానవుల్లా వుండాలనే నువ్వెంతో ఆశించావు, మనుషులలో సజీవంగా వున్న మానవతాభావాన్ని యుద్ధం ముక్కచెక్కలు చేయకుండా వుండాలనీ, వాళ్లలో వున్న దయనీ కారుణ్యాన్నీ అది నిర్మూలం చేయకుండా వుండాలని నువ్వు ఆశించావు. ఇందుకోసం నువ్వు ఎంత చేయగలవో అంతా చేశావు. లోకంలో మంచి

పనులే మిగుల్తాయి, కడమదంతా ఎగిరిపోతుంది. నువ్వు చేసిన మంచి పని ఎప్పటికీ అలా నిలబడే వుంటుంది. నువ్వు వెళ్లిపోయి ఎంత కాలమో అయింది. యుద్ధం చేస్తూ జాడలేకుండా తప్పిపోయావని ప్రకటించారు. పారషూటిస్టుగా వున్నావనీ, శత్రుశ్రేణి వెనకాలకు మూడుసార్లు వెళ్లావనీ రాశారు. 1944లో ఓనాడు చీకటి రాత్రి, గెరిల్లా యోధులకు సాయంచేయడానికని నువ్వూ నీ కామ్రేడ్లూ విమానంలోంచి శత్రుశ్రేణి వెనకాల దిగారనీ, జాడలేకుండా తప్పిపోయావనీ రిపోర్టులు చేశారు. యుద్ధం చేస్తూనే నువ్వు చనిపోయావో, ఏ దారితప్పిన తుపాకి గుండు నిన్ను పొట్టబెట్టుకుందో, శత్రువు చేతిలోనే పడిపోయావో, మరి ఏ చిత్తడినేలలోనే కూరుకుపోయి మునిగిపోయావో — ఎవ్వరికీ తెలీదుకదా. మరి నువ్వు బతికే వుంటే, ఇన్ని యేళ్లల్లోనూ నీ దగ్గరనుంచి ఏదో ఒక్క కబురైనా వచ్చి వుండదా? ఎలాగైతేనేమీ, జైనాక్, నువ్వూ నాకు లేకుండా పోయావు. నువ్వింకా చిన్నవాడివి — చిన్నతనం వదలకుండానే వెళ్లిపోయావు, పద్దెనిమిదేళ్ల వాడివి, నీ గురించి నలుగురికీ ఏమంత జ్ఞాపకమేనా లేదు. కాని నిన్ను నేను జ్ఞాపకం వుంచుకున్నాను, నువ్వు ఎలా యుద్ధానికి వెళ్లిపోయినదీ. నేనంటే నీకు అంత ప్రేమ వుండబట్టే నాకు ఎంత బాధకల్గుతూందో అని భయపడిపోయావు, నాతో చెప్పి వెళ్లడానికి నీకు ధైర్యం చాలిందికాదని నాకు తెలుసు. ఓనాడు స్టేషనుదగ్గర ఓ కుర్రాడికి నువ్వు నీ గొర్రెబొచ్చుకోటు ఇచ్చిన సంగతి నేను జ్ఞాపకం తెచ్చుకుంటూంటాను. యుద్ధరంగంనుండి తరలించివేసిన కుటుంబం — తల్లీ, నలుగురు పిల్లలూ — అక్కడుండడం చూశావు. పెద్ద కుర్రాడి వొంటిమీద వెచ్చని కోటు ఏదీ లేకపోవడం నీ కళ్లబడింది, వెంటనే నువ్వు తొడుక్కున్న కోటు తీసి ఇచ్చేశావు. దవడలు గజగజ వణకిపోతూ నువ్వు ఇంటికి వచ్చేశావు. ఆ అబ్బాయి ఇప్పుడు నడికారులో వుంటాడు, బహుశ అప్పుడప్పుడు అతడు నిన్ను, తనకి వెచ్చని కోటు ఇచ్చిన అబ్బాయని, జ్ఞాపకం చేసుకుంటూంటాడేమో, ఎంచేతంటే అతను ఇప్పుడు నీకంటె పెద్ద, నువ్వు అతడికంటె

చాలచిన్న. ఐనా నువ్వు గురువులా అతనికి పాఠం నేర్పావు. దయ అనేది ఏదో దారి వెంట అకస్మాత్తుగా పడి వుండేదీ, అనుకోకుండా జరిగిపోయే ఘటనా కాదు. దయ అనే దానిని ఓ మానవుడు తోడి మానవుడికి నేర్పు తాడు.

అయ్యో, ఇప్పుడు ఇన్ని మాటలూ చెప్పి ఏం కార్యం? అవేవీ ఏమీ సాయం చెయ్యవు కదా. యుద్ధం ఎంతమందినో పొట్టబెట్టు కుంది. యుద్ధమే గనుక లేకుండివుంటే, నా జైనాక్ ఎంత చక్కనివాడూ ఎంత దయాళుడూ అయివుండేవాడో కదా!

నా ముద్దుల తండ్రీ, జీవితం తొడిగే పన్నెండు పువ్వుల్లోనూ ఒక్కటైనా నువ్వు కోసుకోలేదు. జీవితమంటే ఏమిటో తెలుసుకోవడం నువ్వు అప్పుడే కదా మొదలుపెట్టినది, మరి నీకు నచ్చిన అమ్మాయి ఎవరో కూడా నాకు తెలియదే....

నా బొందిలో కడపటి ప్రమిద కూడా వెలిగిపోతూంది. మరే నాల్గు రోజుల్లోనో ఇహ అది కూడా కొడిగట్టి ఆరిపోతుంది. ఐతే ఏం, నాకు అంతా జ్ఞాపకం వుంది. ఆ పాడు రోజున, మేం చేను దున్నుతూండగా, నా కోసమని ఒక ముసలతను రావడం కూడ జ్ఞాపకం వుంది.

అవి వసంతకారు తొలి రోజులు. స్నోడ్రాప్ల పూత ఇంకా అయిపోలేదు, నొల్లు తోలడం సరిగ్గా అప్పుడే మొదలెట్టాం. పసిమి లోయలోనుంచి వెచ్చని గాలి వీస్తూంది. శరత్తులో దున్నిన సాగునేల ఆరుతూంది, చేలో గడ్డి ఎండలో పచ్చగా తళతళ మెరుస్తూంది.

ఆనాడే అప్పుడే దుక్కి మొదలెట్టాం. చాలు తిరగతోసిన నేల సువాసన తనవితీరా ఆఘ్రాణిస్తూ, సువన్కూల్నుండీ కాసిమ్నుండీ చాలా రోజులై ఏ కబురూ లేదేమి చెప్మా అని అనుకుంటూ గుర్రంమీద స్వారి చేస్తూ, ట్రాక్టరు వెంబడే వెళ్తున్నా.

ఈలోపున, ముసలతను ఒకాయన గుర్రంమీద స్వారిచేస్తూ నా దగ్గర కొచ్చాడు. అతడిలో ఏ తొందర నాకవుపడ్లేదు. నేనన్నాను కదా:

''సరిగ్గా సమయానికొచ్చారు, అక్సకాల్.* ఏరువాక ఆశీ

అతడు అరచేతులు విప్పి, గడ్డం నిమురుకుని, గాద్గదికంగా అన్నాడు:

''సేద్యగాళ్ల ఇష్టదైవం దియ్‌కాన్-బాబా అనుగ్రహంవల్ల—మీ పంట నిండుపేరులా ప్రవహించుగాక!'' తర్వాత నాకు దగ్గరగా వచ్చి, నాతో ''తొల్గొనాయ్, జిల్లా కమిటీనుంచి నీ కోసమని ఎవరో వచ్చారు. నిన్ను ఆఫీసుకు రమ్మనమని కబురంపారు. ఆ మాట చెబుదామని వచ్చాను'' అన్నాడు.

''సరే, అక్సకాల్, కలిసి వెళ్దాం'' అన్నా.

దుక్కి పట్టుతూన్న వాళ్లదగ్గరకు వెళ్లి, సాయంకాలనికల్లా నేను మళ్ళీ వస్తాననీ, అప్పటికి ఎంత మేర దున్నినదీ సరిచూస్తాననీ వాళ్లతో ముందు గానే చెప్పేసి, ముసలతనితో కలిసి గ్రామంకేసి వెళ్ళాను. జిల్లా కమిటీ ప్రతినిధి నాకోసమని కబురుచేయడంలో కొత్త ఏమీ లేదు, అందుచేత నాకేమీ ఆశ్చర్యమనిపించలేదు. దుక్కి మొదలుపెట్టిన రోజుల్లో ప్రతి నిధులు చాలామంది గ్రామానికి రావడం మామూలు సంగతే. మేం సావకా శంగా స్వారిచేసుకుంటూ లోకాభిరామాయణం చెప్పుకుంటూ వెళ్ళాం, కాని ముసలాయన అదేమిటో జాగ్రత్తగా ఆచి తూచి మాట్లాడాడు:

''నీకు ధన్యవాదాలు చెప్పాలి, తొల్గొనాయ్, ఇలాంటి గడ్డు రోజుల్లో ప్రజకి నువ్వెంతో సేవ చేస్తున్నావు. నువ్వు ఆడదానవే ఐనా, మా కంద రికీ నాయకురాలివి నువ్వు. తొల్గొనాయ్, నువ్వు అలానే వుండి, పగ్గాలు వదలకుండా దృఢంగా జీనులో కూచునే వుండాలి. అలా వున్నావంటే, మాకందరకూ నీ ఆసరా వుంటుంది, నీకూ మా ఆసరా వుంటుంది. నిజంగా నువ్వు ఎన్ని కష్టాలు భరించుతూన్నదీ మేం ఎరుగుదుం. మనిషి కర్మ — కొండ దారి లాంటిది: ఓమాటు ఎగువకీ, ఓమాటు దిగు వకీ, చటుక్కున అగాధం అంచుకీ తీసుకెళ్తుంటుంది. ఒంటిగాళ్లకి

* కిర్గీజ్ భాషలో గౌరవనీయుడైన పెద్ద. — అను.

శక్యంగాదు, నలుగురూ సాయం చేస్తే ఎక్కేస్తాం.... మన హడావుడి బతుకే అలాంటిది మరి....''

వీధిలోనుంచి వెళ్తున్నామేమో అప్పటికి, మా ఇంటిముందు జనం మూగివుండడం చూశా. మట్టిగోడ వెనకాల అపుపడ్డాయి వాళ్ల తలలు, మరెందుచేతనో గాని దీనిని నేనేమీ పట్టించుకో లేదు. ఆటాల్బ ముసలాయన నా గుర్రాన్ని పగ్గాలతో పట్టుకుని, నా వంక చూడకుండానే అన్నాడు:

''దిగు, తొల్గొనాయ్, నివ్విక్కడ దిగాలి.''

నేను అతనికేసి నివ్వెరపోయి చూశాను. అతడు మాత్రం గుర్రం దిగి, నన్ను చేతితో పట్టుకుని, మళ్ళీ అన్నాడు:

''నువ్వు దిగాలి, తొల్గొనాయ్.''

అప్పటికీ నాకింకా ఆలోచన తట్టలేదు, ఏమిటిదంతా అని. కాని అదేమిటో మరి, మనసులో మాత్రం ఇదంతా అదేమిటో అపశకునంలా వుందనిపించి, ఘోరంగా భయంవేసింది. మీది ప్రాణాలు మీదికి ఎగిరి పోయాయి. జీనుమీదనుండి మెల్లగా కిందకి జారి దిగేసరికి అలిమన్ ఎదురు పడింది, మరో ముగ్గురు ఆడవాళ్లతో కలిసి ఇంటికి వస్తూందది. ఆ రోజంతా వాళ్లు కాల్వలో మురుగు తీస్తున్నారు. అలిమన్ తన పార బుజాన వేసుకుంది. దానితో కలిసి వస్తూన్న ఆడంగులలో ఒకామె ఆ పార అందుకుంది. అదంతా ఏమిటో అప్పుడు అర్థమైంది నాకు.

''ఏమైందేమిటి? ఏమనుకుని వచ్చారు మీరందరూ?'' అని నేను బిగ్గరగా కేకేశాను, వూరూ వాడా వినబడేటట్టు.

నేనిలా బొబ్బరించేసరికి, మా పొరుగామె అయ్‌షా ఇంట్లోనుంచి ఆడాళ్లందరూ పరుగెత్తుకొచ్చారు. ఎవ్వరూ ఏ మాటా ఆడకుండా, చప్పున నా దగ్గరకి వచ్చేసి, నన్ను చేతులతో పట్టుకుని, చెప్పారు:

''ధైర్యంగా వుండాలి నువ్వు, తొల్గొనాయ్, మన డేగలు రెండూ ఇహ మనకి లేవు, సువన్‌కూలూ, కాసీమూ నేలకొరిగారు.''

ఆ క్షణంలోనే అలిమన్ కెవ్వున కేక వేయడమూ, అందరూ ఒక్కపెట్టున మొర్రోమని గోలపెట్టడమూ నా చెవిబడింది:

''పాపం మా అన్నదమ్ములు! అయ్యో, పాపం!''

అంతే నే విన్నది, చటుక్కున నా చెవులు గడియలు పడిపోయాయి, నా కేకలవల్లే నా చెవులు గడియలు పడిపోయుండాలి బహుశ. వీధి అంతా గిర్రున తిరిగినట్టయింది, అమాంతమూ చెట్లు పడిపోతూన్నట్ట నిపించింది. ఇళ్లు కూలిపోతున్నాయనుకున్నాను. భయానకమైన నిశ్శబ్దంతో ఆకాశాన వున్న మేఘాలు నా కళ్ల యెదుట తళ్కొత్తుతూ పరుగెత్తాయి, ఆ వెలుగులో మనుషుల ముఖాలు అదేమిటో అష్టవంకర్లు తిరిగిపోయినట్టూ మూగవోయినట్టూ అవుపడ్డాయి. నన్ను బలంగా పట్టుకున్న చేతుల్లోనుంచి నా చేతులు విడిపించేసుకుందుకు గట్టిగా గింజుకున్నాను. నన్ను ఎవరు పట్టుకున్నదీ, మా గుమ్మంలో ఎందుకని అందరూ అలా మూగినదీ నాకేమీ అర్థమైందికాదు. నా కళ్లకి ఒక్క అలిమన్ మాత్రమే కనబడింది. నిర్దాక్షిణ్యమైన స్పష్టతతో కనబడిందది. రక్తాలు కారిపోతూన్న ముఖమూ, విరబోసుకున్న జుట్టూ, చింపేసి పీకేసుకున్న గౌనూ—దాన్ని చూస్తేనే భయం వేసింది. ఆడాళ్లందరూ దాన్ని పెడకట్లు కట్టి పట్టుకున్నారు, కాని అది మాత్రం విడిపించేసుకుందుకు శాయశక్తులా గింజుకుపోతూ, పెడబొబ్బలు పెట్టి, ఎంత బిగ్గరగా అరుస్తూందంటే, దాని నోటనుంచి వచ్చిన మాట ఒకటైనా నాకు వినబడ్లేదు. నేను కూడా దాని దగ్గరకే పరుగెత్తబోయాను. నా మనస్సులో ఒక్కటే కోర్కె—ఎంత వేగంగా దాని దగ్గరకెళ్లి దాన్ని ఓదార్చుదామా అని. కాని ఇద్దరమూ ఒకరి దగ్గరకు ఒకరం చేరుకునే వరకు యుగాలు పట్టినట్టు అనిపించింది. ఇహ చివరకి ఎప్పుడైతే అలిమన్ వచ్చి నా మెడమీద పడిందో అప్పుడు మాత్రమే గుండె బద్దలైపోతూ కఠోరమైన దాని కేక నాకు వినబడింది:

''అత్తయ్యా, మనమిద్దరం అనాథలమైపోయాం, అత్తయ్యా! దౌర్భాగ్యులం, విధవలం! మన సూర్యుడు మండిపోయాడు. మన దినం ఇహ చీకటి దినమే, అత్తయ్యా! మన దినం ఇహ చీకటి దినమే!''

అవును మనం అనాథలమైపోయాం. ఇద్దరు అనాథలు—అత్తా,

కోడలూ. మా ఖర్మానికి ఉసూరుమని ఏడుస్తున్నాం, ఒకరిమీద ఒకరు పడి ఇద్దరమూనూ. ఇద్దరి కన్నీటి కాల్వలూ ఏక వరదై పారాయి.

మా దుఃఖం ఇంకా తీరనే లేదు — ఏడవ రోజున సమష్టిక్షేత్రం వాళ్లందరూ మా దగ్గరకి వచ్చి, చనిపోయిన వారి ఇద్దరి స్మృతికీ మరొక సారి శ్రద్ధాంజలి ఘటించి, అప్పుడు మాతో అన్నారు:

''ఓ ఎడాది పొడుగునా మీరు దుఃఖించినా మీ దుఃఖం తీరదు. వాళ్లని మనం జ్ఞాపకం పెట్టుకునే వుంటాం, కాని బతికున్నవాళ్లు బతికి బాగుండాలి. వీళ్ళు బతికుండాల్సిన ఏళ్లు మసెల్‌బెక్, జైనాక్‌ల ఆయుర్దాయానికి కలవాలని మనం కోరుకుందాం.'' (అప్పటికింకా జైనాక్ నుండి మాకు వారం వారమూ వుత్తరాలు వస్తూండేవి.) ''వాళ్లు యుద్ధం గెల్చుకుని వస్తారు, అదే మన కోర్కె. మరి మీరు మళ్ళీ పనిలోకి రావాలని మేం మిమ్మల్ని కోరుతున్నాం. విత్తులు చల్లే కారు రానే వచ్చింది, మన కోసమని భూమి కనిపెట్టుకుని వుండదు. మీరు మనసు కుదుటబరచు కోవాలి. మాతో కలిసివచ్చేయండి, శత్రువుమీద మనం ఇలాగే కసి తీర్చు కుందాం.''

అలిమనూ నేనూ ఆలోచించుకుని, జనం చెప్పినదానికి సరే అన్నాం.

మరునాడు పొద్దుపొడవగానే పనిలోకి వెళ్ళేందుకు సిద్ధమౌతున్నాం. అప్పుడు అధ్యక్షుడు ఉసెన్‌బాయ్ కాగితాలు రెండు పట్టుకొచ్చాడు. అవి మరణ పత్రాలనీ వాటిని మేం భద్రంగా దాచిపెట్టుకోవాలనీ చెప్పాడు. కాసీమ్ పోయినట్టు కాగితం పక్షం రోజుల క్రితమే సమష్టిక్షేత్రానికి అందిందట, మాస్కో సమీపాన ఒరేహొవ్‌క గ్రామం దగ్గర యుద్ధంలో వాడు చనిపోయాడట. ఈ కబురు మాకు ఎలా చెబుదామా అని వాళ్లం దరూ అనుకుంటూండగా, అంతట్లో సువన్‌కూల్ చనిపోయిన కబురు కూడా అందిందిట. యెలేత్స్ పట్టణం దగ్గిర జరిగిన పెద్ద ఎదురు దాడిలో అతడు నేలకొరిగాడట. ఇహప్పుడు గత్యంతరంలేక నిజం చెప్పేందుకే నిశ్చయించుకున్నారట. ఇహ సరే, దుర్వార్తలు రెండూ ఒకే రోజున చెబు

దాసుని అనుకున్నారట. ఆతర్వాత ఏముంది చెప్పడానికి! మళ్ళీ మరొక సారి, నేను నడుంకట్టి, పటకా బిగించి, మేస్త్రీ గుర్రం ఎక్కాను.

నేనూ గుండె బాదుకుని లబోదిబోమని ఏడుస్తూ, నొసటి రాతను తిట్టుకుంటూ కూచుంటే, అలిమన్ గతి ఏంగాను? అది ఎంతగా చిక్కి శల్యమైపోయిందంటే, దాన్ని చూసేసరికే నాకు హడలేసిపోయింది. దాని దుఃఖంకంటె నా దుఃఖం ఏమీ తక్కువకాదు, నా మొగుడూ పోయాడు, కొడుకూ పోయాడు — రెండు దెబ్బలూ ఒక్కసారే తగిలాయి నాకు, రెండింతలు కష్టం నాది, ఐనా నా సంగతి వేరు. కాస్తో కూస్తో నేనూ సువన్ కూలూ ఇద్దరమూ చాలా ఏళ్ళే కలిసి సంసారం చేసుకున్నాం. చాలా చూశాం, చాలా అనుభవించాం — చమటోడ్చి కష్టపడ్డాం, హాయిగా బతికాం. పిల్లలు పుట్టారు, వాళ్లను పెంచి పెద్దవాళ్లను చేశాం, అందరం కలిసి కష్టపడ్డాం. యుద్ధమే గనుక రాకుండా వుండివుంటే, దినం తీరే వరకూ అందరం కలిసే వుండేవారం. మరి కాసీమూ అలిమనో? — పాపం వాళ్లు ఏం ఎరిగారని, ఏ సరదాలూ ఏ ముచ్చట్లూ వాళ్లకి తీరాయని? వాళ్లకి బతుకంతా ముందే వుండెనాయె, కలలు కనడంలోనే అయిపోయిందాయె అంతానూ. ఒక్క గొడ్డలిపెట్టుతో యుద్ధం వాళ్ల యౌవనం అంతటినీ మొదలంటా నరికి పారేసింది. నిజమే, కాలం సాగినకొద్దీ అలిమన్ హృదయంలో గాయం మానుకొస్తుంది. లోకంలో మంచివాళ్లకి కొదువలేదుగా, ఏమో వెనుక దాని మనసు మరలుకొన్నట్టే, ఎవడో మంచివాడు కనబడతాడు, వాడిమీద దాని మనసు మరలుకోకూడదా ఏమిటి? జీవితం మళ్లీ కొత్త ఆశలతో మొలకెత్తుతుంది. యుద్ధంలో చనిపోయినవాళ్ల భార్యల విషయంలోనూ ఇలాగే జరిగింది. యుద్ధం ముగిసింది, వాళ్లు మళ్ళీ పెళ్ళాడారు. కొందరి కాపురాలు బాగా వెళ్తున్నాయి, కొందరివి అంత బాగా వెళ్లడంలేదు. ఏమైతేనేం, ఎవ్వరూ ఒంటరిగా వుండిపోలేదు, అందరూ ఇప్పుడు సంసారాలు చేసుకుంటున్నారు, బిడ్డల తల్లులయారు. చాలా మంది హాయిగా వున్నారు. ఐనా అందరూ

ఒక్కలా వుండరుగా. చచ్చిన దుఃఖం మరచిపోయి, చచ్చిన కొత్త బాట తొక్కేవాళ్ళు కొంతమంది వుంటారు. కొంతమందేమో వ్యసనపడి, వ్యసనపడి, నిస్పృహ చెందిపోయి, పాత స్మృతులు మరచిపోయేందుకు శక్తిలేక, ఉన్న మూలనే వుండిపోయి, ముక్కిపోతారు. దాని దురదృష్టం కొద్దీ అలిమన్ ఇలాంటి మనిషి అయింది. గతం మరచిపోలేకపోయింది, నా ఖర్మం ఇలా వుందికదా సరే అని రాజీపడలేకపోయింది. నేను చేసిన క్షమించరాని తప్పు ఇక్కడే వుంది. నాకు శక్తి లేకపోయింది, దానిమీద నాకున్న జాలికి లొంగిపోయాను....

ఆ వసంతకాలంలో మా దళం ముఖ్యమైన పంటకాల్వలు తవ్వుతూంది. నేనూ అక్కడే పనిచేస్తున్నాను. ఓ రోజున సూర్యాస్తమయం ముందుగానే మేం పని పూర్తిచేసుకుని, ఎవరిమానాన వాళ్ళం ఇంటి ముఖం పట్టాం. నాకు సేద్యకాంట్రాక్టరుతో కాస్త పని వుండడంచేత, నాకోసం తను వుండొద్దని అలిమన్‌తో చెప్పాను. సేద్యకాంట్రాక్టరు గుడారం అక్కడికి దగ్గర్లోనే వుంది. వాళ్లు సరిగ్గా అప్పుడే కూచున్నారు రాత్రిభోజనానికి. వాళ్లు చేయాల్సి పని గురించి వాళ్లతో మాట్లాడి, నేను గుడారం బయటికొచ్చేసి, గుర్రం ఎక్కబోతూన్నాను, అలిమన్ కనబడింది. ఆమె ఇంటికి వెళ్లిపోకుండా అక్కడే వుండిపోయినట్టుంది. ఒక్కర్తె వుండిపోయి, బంజరులో పూస్తూన్న ట్యూలిప్ పువ్వులు కోస్తూంది. అచ్చంగా చిన్నపిల్లగానే దానికి పువ్వులంటే ఎంతో సరదా, అయ్యో, అలిమన్, అలిమన్, కోడలా, ఎంతటి నిర్భాగ్యురాలవే నువ్వు! దాని చేతిలో పెద్ద పువ్వులు పది వున్నట్టుంది. ఇంటికి తీసుకొద్దామనే వాటిని పోగుచేసింది బహుశ. పువ్వులు చేతితో పట్టుకుందేమో, దానిని చూసేసరికి నా నుదుట వేడి చెమట పోసిపోయింది. ఆనాడు చేను అంచున పూసిన అడవి పూబెండ పువ్వులు కోసి, వాటిని అచ్చంగా ఇలాగే పట్టుకుంది. ఆనాడు మాత్రం తలపై కట్టుకున్నది ఎరుపు రుమాలూ, చేతిలో తెల్లని పువ్వులూ, ఈనాడు తలపై నల్లని రుమాలూ చేతిలో ఎర్రని పువ్వులూ — భేదం

అంతా ఇంతే. కాని నా కడుపు ఎలా తరుగుకుపోయింది! అలిమన్ తల ఎత్తి, ఇటూ అటూ చూసింది, తర్వాత తల వాల్చేసి, ఇదంతా ఎవరి కోసం, ఎక్కడికి తీసుకెళ్లను వీటిని?... — అన్నట్టుగా పువ్వులకేసి అట్టే చూసింది. తటాలున కదలిక పుట్టి, నేలమీద కూలబడి, తను ఏరిన పువ్వులనే ఎక్కడికక్కడికి రేకలు ముక్కముక్కలకింద చింపేసి, కాడలతో నేలనేసి కొట్టింది. ఓ గడియ వూరుకుని, తర్వాత రెండు చేతులూ తన తలచుట్టూ కట్టేసుకుని, బుజాలు గజగజ వణకిపోతూ అలా వుండి పోయింది. అది నన్ను చూడకుండా వుండాలని గుడారం వెనక్కి వెళ్లి పోయి అక్కడ దాగున్నాను నేను. ఏడవనీ, ఏడవడమే మంచిది, అలా ఏడ్చిన తర్వాత మనసు కాస్త తేలిక అనిపిస్తుంది అనుకున్నా. కాని అది చెంగున లేచి నిలబడి, పచ్చిక బయలుమీదనుంచి హైరోడ్డుకు ఒక్క పరుగున దూసుకుపోయింది. నాకు భయమేసుకొచ్చి, చప్పున గుర్ర మెక్కి — దానివెంట వెళ్ళాను. నల్లని శాలువ కప్పుకుని ఎర్రని చేలోపడి నా ముద్దు కోడలు అలా పరుగెత్తి వెళ్లడం చూస్తూంటే ఎంతో ఘోర మనిపించింది నాకు.

''అలిమన్! ఆగు! ఏమైందేమిటి? ఆగు, అలిమన్!'' అని కేకేశా, కాని అది ఆగలేదు.

బూడిదెవన్నె దాట్లగుర్రం ఎనాడో దౌడుతీసి వెళ్లిన ఆ రోడ్డు చేరుకుందది. అక్కడ అందుకున్నాను దానిని.

''నువ్వేమీ అనకు, అత్తయ్యా! నువ్వేమీ అనకు! ఏమీ అనకు నన్ను!'' అంది.

నేను గుర్రాన్ని ఆపాను, ఆమె గుర్రందగ్గరకి వచ్చి, దాని జూలు పట్టుకుని, నా పాదంమీద పడి వెక్కివెక్కి ఏడవడం మొదలెట్టింది. నేను ఏమీ అనకుండా వూరకున్నాను. అనడానికేనా ఏముంది గనుక? కాస్సే పటికి అది తలెత్తింది, ముఖం అంతా బురద పట్టి, కన్నీటితో తడిసి వుంది. అలా ఏడుస్తూనే అంది:

''అత్తయ్యా, చూడు, సూర్యుడెలా వెలిగిపోతున్నాడో, ఆకాశం ఎంత అందంగా వుందో, స్టెప్పె మైదానమంతా పువ్వులతో ఎంత ముచ్చటగా వుందో! కాసీమ్ మరి రానేరాడంటావా? ఎన్నటికీ రానేరాడా?''

''రాడు, ఇహ తిరిగిరాడు'' అన్నాన్నేను.

అలిమన్ భారంగా నిట్టూర్చింది.

''నన్ను క్షమించు, అత్తయ్యా'' అంది మెల్లగా. ''పరుగెత్తి పారిపోయి, అతడు పోయిన చోటనే అతనితో కలిసి చచ్చిపోవాలని వుంది నాకు.''

ఇహ నేను దుఃఖం ఆపుకోలేక ఏడ్చేశాను, ఏమనడానికీ నా నోరు ఆడలేదు. నేను గనుక నిజంగా తెలివితేటలుగల దాన్నీ, ముందు చూపున్న దాన్నీ అయివుంటే, గట్టిగా చెప్పి చివాట్లేసి వుండేదాన్ని: ''నువ్వేమి చిన్న పిల్లవా చితకపిల్లవా? నువ్వు ఒక్కదానవేనా ఏమిటి, నీలాగే ఎంతమంది ఆడాళ్లు మొగుళ్లు చచ్చిపోయి అఘోరిస్తున్నారుకారు? — వాళ్లెందరో లెక్క పెట్టేందుకేనా సాధ్యంకాదే! నువ్వు తమాయించుకోవాలి. నా మాటలు అతి కిరాతకమే అని నీకనిపించినా సరే కాసీమ్‌ని నువ్వు మరచిపోవాలి. అయిందేదో అయింది, అది మళ్ళీ రాదు. సమయం వస్తుంది నీ మనసుకు నచ్చిన మగాడు నీకే అవుపడతాడు. నువ్వు గనుక మనసు కుదట పెట్టుకోకపోతివా నువ్వు మరీ అధ్వానమైపోతావు. ఇలా అడుగంటిపో కూడదు, తప్పు! నువ్వింకా చిన్నదానవు, నాలుగు కాలాలు బతకాల్సిన దానవు.'' ఈ మొరటు సత్యాన్ని, ఈ ఏకైక సత్యాన్ని దానితో చెప్పేందుకు నాకప్పుడు ధైర్యం చాలిందికాదే అని ఇప్పుడు విచారిస్తున్నా. తర్వాత కూడా ఎన్నోసార్లు నాకు అవకాశం దొరికింది, ఆ మాటలు నాలుక చివరవరకూ వచ్చేవి, కాని అనేందుకు జంకే దాన్ని, అదేదో నా శక్తికి మించిన శక్తి యేదో నన్ను పట్టుకుని వెనక్కి లాగేసేది. అసలు అలిమన్ నా మాటలు వినేందుకే ఇష్టపడేదికాదు. ఏమాటకైనా, నిజంగానే, అనువైన వేళ ఒకటుంటుంది, అప్పుడది, ఎర్రగా కాలిన ఇనుంలాగున మెత్తగా వుంటుంది.

కాని ఆ అదను కాస్తా తప్పిపోయిందంటే మాత్రం — అది చల్లబడిపోయి, రాయీ పాషాణమూ అయిపోయి, గుండెలమీద చాపరాయి అయి కూచుంటుంది, ఇక దాన్ని వదలించుకోవడం దుర్ఘటంమవుతుంది. ఇదంతా ఇప్పుడు, ఇన్నేళ్ళు అయినాక ఇప్పుడు, అంటున్నాను. మరి అప్పుడు, దైనందినపు గొడవల్లో, నిత్యజీవితపు బెంగల్లో, సమష్టిక్షేత్రపు అవసరాల కొరతల్లో దేని గురించి అనుకోడానికీ యోచించుకోడానికి వేళ లేకపోయింది. మా ఆశలన్నీ, మా ఆలోచనలన్నీ ఒకే ఒక విషయంపై లగ్నమయాయి — త్వరగా జయం కల్గాలి, త్వరగా యుద్ధం ముగియాలి, ఇహ కడమదంతా తర్వాత చూసుకోవచ్చు. యుద్ధం ముగిసిందీ అంటే — "ఇక సర్వమూ దేనికది అమరిపోతుంది — "అనుకున్నాం అప్పుడు. కాని అదేమీ అలా జరగనేలేదు....

8

"తల్లీ, భూదేవీ, సువన్‌కూలూ, కాసీమూలాంటి మనుషులు నేల కొరిగినప్పుడు కొండలు ఎందుకు కూలిపోవు, సరస్సులు ఎందుకు పొంగిపోవు? తండ్రీ కొడుకులు ఇద్దరూ గొప్ప సేద్యకాండ్రే! ఇలాంటి మనుషుల కృషివల్లనే కదా ఆదినుండీ కూడా ప్రపంచం బతుక్కొన్తూంది! దానిని వాళ్ళు తిండిపెట్టి పోషించారు, యుద్ధాలు వచ్చినప్పుడు దానిని కాపాడారు, అస్త్రశస్త్రాలు ధరించి అందరికంటే ముందు యుద్ధంలోకి ఉరికారు. యుద్ధమే లేకుండా వున్నట్టయితే సువన్‌కూలూ, కాసీమూ ఇంకా ఇంకా ఎంత పనిచేసుండే వారో కదా, తమ శ్రమ ఫలితంగా ఎంత మందికో ఉపకారం చేసివుండేవారు కదా, ఇంకా ఎన్ని చేలో చల్లి వుండేవారు, ఎంత పంటో నూర్చివుండేవారు కదా! వాళ్ళమటుకు వాళ్ళే తమ తోడిమనుషుల శ్రమవల్ల మరింత ధన్యులై, ఇంకా ఎంతో ఆనందమూ సౌఖ్యమూ అనుభవించి వుండేవారు కదా! తల్లీ, భూదేవీ, నువ్వే చెప్పు, నాతో నిజంగా చెప్పు: యుద్ధం లేకుండా మనుషులు బతకలేరా?"

''చాలా కష్టమైన ప్రశ్నే వేశావు నువ్వు, తొల్గొనాయ్, ఈనాటికీ ఐవూ జాడా లేకుండా యుద్ధాల్లో మాయమైపోయిన ప్రజలూ వుండే వారు, అగ్నికి ఆహుతైపోయినవీ, ఎడారి ఇసుకకింద కప్పడిపోయినవీ మహా నగరాలూ వుండేవి, మానవుని అడుగుజాడకోసమని నేను యుగయుగాలుగా కలలుగన్న కాలమూ వుండేది. ప్రజలు ఒకరిమీద ఒకరు యుద్ధానికి దిగే ప్పుడు ప్రతీసారీ నేను అనేదాన్ని: 'ఆగండి! ఒకరి రక్తం ఒకరు చిందిం చుకోకండి!' ఈ రోజు కూడా మళ్ళీ అంటున్నాను: 'పర్వతాల కావల, సముద్రం అద్దరిని వున్న ప్రజలారా, ఈ చక్కని ప్రపంచంమీద నివ సించే ప్రజలారా! మీకేమి తక్కువొచ్చింది భూమా? ఇదిగో నేను వున్నాను — భూమిని! మీ అందరికోసమనే నేనున్నాను, మీరందరూ నాకు సమానమే. మీ విరోధాలు నాకొద్దు, నాక్కావలసినది మీ స్నేహమూ మీ శ్రమా! నాగటి చాలులో ఒక్క విత్తు మీరు వేయండి — వేయి విత్తులు ఇస్తాను మీకు. ఒక్క పుడక పాతండి — మహావృక్షంగా మొలిపిస్తాను. తోట వేయిం చండి — ఫలాలు కురిపిస్తాను. పశుగణాలను పెంచండి — నేను పచ్చగడ్డి అయి మొలుస్తాను. ఇళ్లు కట్టండి — నేనే గోడలై లేస్తాను. వృద్ధిలోకి రండి, జనసంఖ్య వృద్ధిచేయండి — మీ అందరికోసమూ నేనే చక్కని ఇల్లవుతాను. నేను అనంతం, నేను అపారం, నేను ప్రగాఢం, నేను ఉన్నతం, నేను అశేషం — మీరందరూ నానుండి ఎంత తీసుకున్నా నేనింకా ఇస్తాను!' మరి నువ్వో, తొల్గొనాయ్, నువ్వు నన్ను అడుగుతున్నావు యుద్ధంలేకుండా మనుషులు బతకలేరా అని. అది నామీద కాదు అది మీమీదే ఆధారపడి వుంది, మీ సంకల్పంమీదా మీ జ్ఞానంమీదా ఆధారపడి వుంది.''

''కన్నతల్లీ, భూదేవీ! నువ్వు ఒక్కసారి ఆలోచించుకో, నీ పని వాళ్లందరిలోనూ తెలివైనవాళ్ళూ, మేస్త్రులందరిలోనూ గట్టివాళ్ళూ యుద్ధంలో చచ్చిపోతున్నారే. దీనికి నేను ఎంత మాత్రం సమాధానపడను, నా బొందిలో ప్రాణం వున్నంతవరకు నేను సమాధానపడేది లేదు!''

''ఐతే, వాటివల్ల నేను బాధపడడంలేదనే నువ్వు అనుకుంటున్నావు

కాబోలు? అలా ఎంతమాత్రమూ అనుకోకు, నేనెంతో బాధపడుతున్నాను. కృషికారుల హస్తాలు నన్ను స్పృశించడంలేదని నా మనసు ఎంతో పరితపించిపోతూంది, నా బిడ్డలకోసమని, నా సేద్యగాండ్రకోసమని అహోరాత్రాలు ఏడుస్తున్నాను, సువన్‌కూలూ కాసీమూ, జైనాకూ, నేలకొరిగిన సైనికు లందరూ లేకపోవడం నా కెంతో లోపంగా వుంది. నన్ను దున్నకుండా వదిలేసినప్పుడు, పైరుతో వున్న చేలు కోయకుండా వున్నప్పుడు, పంట నూర్పులేకుండా దిగడిపోయినప్పుడు 'ఓ నా సేద్యగాళ్ళూ, ఎక్కడున్నారు మీరు? ఓ విత్తువారా, ఎక్కడున్నారు మీరు? నా బిడ్డలారా, లేవండి! సేద్యగాళ్ళూ, రా రండి! వచ్చి నాకు సాయంచేయండి, నాకు ఊపిరి సలపడంలేదు, నేను చచ్చిపోతున్నాన్రా!' అని నేను వాళ్లను పిలుస్తూంటాను. అప్పుడు సువన్‌కూల్ తన పార పట్టుకునీ, కాసీమ్ తన కంబైన్ నడిపించీ, జైనాక్ తన బండి తీసుకొచ్చీ నా దగ్గరకి వస్తే ఎంత బాగుండును! కాని వాళ్లు ఏ ప్రత్యుత్తరమూ ఇవ్వరు....''

''భూదేవీ, నీ మాటలకు ధన్యవాదాలు. వాళ్లు లేకపోవడం నాకెంత లోటు అనిపిస్తూందో నీకూ అంత లోటూ అనిపిస్తూందన్న మాట, వాళ్లకోసం నేనెంత దుఃఖిస్తున్నానో, నువ్వూ అంత దుఃఖిస్తున్నావన్న మాట. భూదేవీ, నీకు ధన్యవాదాలు.''

## 9

యుద్ధం మూడో ఏడాదీ నాల్గో ఏడాదీ సంతోషాన్నీ తీసుకొచ్చాయి, కష్టాన్నీ తీసుకొచ్చాయి: శత్రువును ఒక్కొక్క అడుగే ఒక్కొక్క అడుగే వెనక్కి వెనక్కి తరిమేశారు—మా గుండె సంబరపడింది, ఐనప్పటికీ ఆ రోజుల్లో బతుకు రోజు రోజుకి మరింత మరింత దుర్భరమైపోతూ వచ్చింది. శరత్తులో అంత కష్టమనిపించలేదు, దుబ్బుల్లో రాలిపోయి వుండిపోయిన కంకుల్ని పోగుచేసుకున్నాం, పెరటి తోటల్లో పండిన ఉర్లగడ్డలు తవ్వి

ఏరుకున్నాం, కాని చలికాలం మధ్యలో ఇహ ఆకలి పస్తులు మొదలయాయి. వసంతకారులోనూ, బంగారు పసిమి వేసవిలోనూ మరీ కష్టాలు వచ్చాయి, కొందరికి తిండి తిప్పలే వుండేవికావు, ఆకూ అలమూ తిని, నీళ్లలో ఓ చుక్క పాలు పోసుకుని తాగేవారు. నేనూ అలిమనూ ఇద్దరమూ పని చేసేవాళ్లం, మా కొంగుపట్టుకుని వేలాడ్డానికి పిల్లా పీచూ ఎవ్వరూ లేరు మాకు. నిజానికి, పిల్లా పీచూ వుంటేనే నయమనిపించేది. కడమ ఇళ్లల్లో, అందులోనూ గంపెడు పిల్లలున్న ఇళ్లల్లో పిల్లల్ని — అనపతుంబల్లా పొట్టలూ, పొంగిన ముఖాలూ, పరాయివాళ్ల చేతులవంక ఓ పిసరు రొట్టె ముక్కకోసమని నోటితో అడగకుండా కళ్లతో ప్రాధేయపడుతూన్న పిల్లల్ని — చూసేసరికి గుండె బద్దలైపోయేది. ''మీరు యుద్ధంలోకి వెళ్లండి, అక్కడికెళ్లి మీరు చావండి — అలా చస్తేరా అప్పుడు యుద్ధం తప్పకుండా ముగుస్తుంది, అప్పుడు పిల్లలకి సుష్ఠుగా తిండి దొరుకు తుంది'' అని ఎవరైనా నాతో అనివుంటే నేను ఒక్క క్షణమైనా ముందు వెనుకలు ఆలోచించకుండా యుద్ధంలోకి ఉరికేదాన్నే. ఆకలితో అలమటి స్తూన్న ఆ చూపులు తప్పించుకుందుకు ఆ పని తప్పకుండా చేసి తీరు తాననిపించింది. ఇలా అనుకుని ఈ ఆలోచనను అలిమన్‌తో పాలుపంచుకు న్నప్పుడు ఆమె నాకేసి ఓ నిమిషం చూసి, తర్వాత అంది:

''నేనూ ఆ పనే చేసివుందును. అన్నిటికంటే ఘోరం ఎందుకిలా వాళ్లు ఆకలి పస్తులుండాలో పిల్లలకేమీ అర్థంకాకపోవడం. ఇందుకు కారణమేమిటో పెద్దాళ్లకి తెలుసు, ఎప్పుడో ఒకప్పుడు ఇది ఆఖరై తీరుతుందని వాళ్లకి తెలుసు, అందుచేత పెద్దాళ్లు వాళ్లమటుకు వాళ్లు ఎలాగే ఊరటపొందుతారు. పిల్లలకి యిది తెలీదు. వాళ్ల తండ్రులు యుద్ధంనుంచి వచ్చేవరకు పిల్లల్ని మనమే పోషించాలి. ఈ పని మనమే చేయాలి, అత్తయ్యా, ఈ మాత్రమూ చేయకపోతే — ఇహ బతికి ఎందుకు....''

యుద్ధంకోసమే సర్వమూ సంపూర్ణంగా అర్పించేశాం: జీవితం, శ్రమ, సంకల్పం, ఇహ చివరికి చంటిపిల్లలకోసమని కాచే జావ కూడానూ —

సర్వమూ సంపూర్ణంగా ఒక పిసరంతైనా వుంచేయకుండా, ఆకలి తీరని ఆ యుద్ధం నోట్లోకే వెళ్ళిపోయింది. ఐనప్పటికీ, యుద్ధంకోసం ఏమీ ఇవ్వడం ఇష్టపడని వాళ్ళూ లేకపోలేదు; అవును, అలాంటి మనుషులు ఉండనే వున్నారు, మరి అలాంటప్పుడు ఆ మాట దాచుకోవడం ఎందుకు? మా పొట్టకొట్టి ఆ పట్టెడు తిండేనా మా నోట్లోకి వెళ్లకుండా వాళ్లు దాన్ని కాజేశారు.

ఓ సారి ఘోరమైన ఘటన జరిగింది.... అది పంథొమ్మిదివందల నలభైమూడు చలికాలం నడిమధ్యలోనో, చివరలోనో జరిగింది. స్తెప్ మైదానంలో అక్కడా అక్కడా నేలను కప్పిన మంచు కరిగి నేల కనిపిస్తోంది, కాని రాత్రిపూట ఇళ్లలో కిటికీ అద్దాలపైన మంచు పేరుకుపోయేది.

ఓ రోజు రాత్రి వూరు మాటు మణిగింది. తటాల్న ఎవరో దభీదభీ మని కిటికీ తట్టారు, కిటికీ అద్దాలు బద్దలైపోయాయనే అనుకున్నాను.

''తొల్గొనాయ్! మేస్త్రీ లెండి, లెండి! నిద్ర లెండి!'' అని వీధిలో నుంచి ఎవరో కేకపెట్టారు.

నేనూ అలిమనూ హడలిపోతూ మంచంమీదనుంచి చెంగున లేచాం.

''అత్తయ్యా!'' అంది అలిమన్ చీకటిలో గాద్గదికంగా, ఏదో అద్భుతం జరగబోతున్నట్టు.

అబ్బ! ఆ పాపిష్ఠి ఆశ చావకుండా మనస్సులో అలా దేవుళ్ళాడుతూనే వుంది! నా గుండె కూడా భయంతోనూ, అస్పష్టమైన ఆనందంతోనూ పట్టేసినట్టయింది: ''ఏమో, మా వాళ్లలోనూ ఎవరేనా తిరిగి వచ్చా రేమో?'' అలా అనుకుంటూ కిటికీ అద్దంలోనుంచి అట్టే చూశాను.

''ఎవరక్కడ? ఎవరది?''

''బైటకి రాండి, తొల్గొనాయ్! త్వరగా రాండి! గుర్రాల్ని ఎవరో పట్టుకుపోయారు!'' అని ఎవరి గొంతుకో కిటికీదగ్గర వినబడింది.

అలిమన్ దీపం వెలిగించేలోపున, నేను గబగబ బూడ్సు తొడుక్కుని, పెద్దకోటు వేసుకుని వీధిలోకి పరుగెత్తాను. మేం గుర్రపుసాల చేరుకునే

సరికి అప్పటికే అక్కడ అధ్యకుడితోపాటు జనం పోగై వున్నారు. దొంగలు పడి, మూడు గుర్రాలను తోలుకుపోయారు, ఆ తోలుకుపోయిన వాటిలో మేం సమష్టిక్షేత్రానికి ఇచ్చిన బూడిదెవన్నె దాట్లగుర్రం కూడా వుంది. మా మేస్త్రీకి వున్న విత్తులుకొట్టిన గుర్రాల్లో ఇవే ప్రశస్తమైనవి. వసంత కారు దుక్కులకోసమని వీటిని తయారీలో వుంచుతూన్నాం. గుర్రపు సాల మనిషి అన్నాడు: గుర్రాలకి అర్ధరాత్రి మేతకోసమని కసవు తెచ్చేందుకు గడ్డికొఠారానికి తను వెళ్ళాడట. తీరా తను వచ్చి చూసుకునే సరికి సాలలో లాంతరు ఆరిపోయి, అంతా అంధకారంగా వుందట. బహుశ గాలికి ఆరి పోయుంటుంది దీపం అనుకుని, తాపీగా లాంతరు వెలిగించి చూసే సరికి — ఇంకేముంది, చివరి మూడు సాలలూ ఖాళీ.

ఆ రోజుల్లో పనిచేసే మూడు గుర్రాలను సమష్టిక్షేత్రం నష్ట పోయిందంటే ఈ రోజుల్లో పది ట్రాక్టర్ల నష్టంతో సమానం అన్న మాట. బాగా ఆలోచిస్తే దాని అర్థం — యావత్తు యుద్ధశ్రేణిలోనూ వున్న ప్రతి సైనికుడూ ఒక రోజు బ్రెడ్డు భత్యం నష్టపోవడంతో ఇది సమాన మన్నమ్మాట. మేం గుర్రాలెక్కాం, మాలో కొందరు తుపాకులు పట్టుకున్నారు, దొంగల వెంట పడ్డాం. వాళ్లు మాకు దొరికి వుంటే, మాకు దయ దాక్షిణ్యాలు వుండేవేకావు. నిజంగా చెబుతున్నాను, మాకు ఏ కనికరమూ వుండేది కాదు!

గ్రామం పొలిమేర చేరగానే, ముగ్గురు నల్గురం కలిసి చిన్నచిన్న జట్లుగా విడిపోయి, చెరి ఒక దిక్కూ వెళ్ళాం. నేను స్వారిచేస్తూన్నది విత్తులుకొట్టని జాతి గుర్రం, నిప్పులాంటిది, నాల్గు కాళ్ళూ ఎగరేసి ఎప్పుడు పోదునా అని వుంటుంది దానికి. ఇహ కళ్ళెం వదలి దాన్ని పోనిచ్చా. నాకు బాగా జ్ఞాపకం వుంది. హైరోడ్డు దాటి కొండల అంచువెంట దూసుకుపోయాం. నాతో కూడా మావాళ్లు మరిద్దరున్నారు. నేను చటిక్కున వెనక్కి తిరిగి చూసేసరికి — వాళ్లిద్దరూ మరి అవుపడ్లేదు. వాళ్లు మరో పక్కదారంటే వెళ్ళారో, నేనే మరో పక్కదారంట వెళ్ళానో

మరి. దారి తప్పిపోవడం సులువే: చంద్రోదయం అయి, వెన్నెల వున్నప్ప టికీ, అది మాయిదారి వెలుగు — ఓ ఇరవై గజాల ఆవల అంతా మసక చీకటిలో కలసిపోతుంది. ఐనా, ఆ గుర్రపు దొంగలను ఎలాగైనా పట్టు కోవాలనే ఆలోచన తప్ప నా బుర్రలో మరో ఆలోచనే లేదు. గుర్రాల్ని తోలుకు పోయారో అని నాకు ఎంత చికాకూ కోపమూ వచ్చాయంటే నా గుర్రం నన్ను ఎక్కడికి తీసుకెళ్తూందో కూడా నేను చూసుకోలేదు. అది తటాల్న నిలబడిపోయేసరికి, అప్పుడు చూసుకున్నా — ఎదుట అగాధంలా వున్న కనుమ. మొదటి వరుస కొండల్లోకి సరిగ్గా వచ్చామన్నమాట. నల్లని పర్వత పంక్తి వెనుక చంద్రుడు పదిలంగా కదుల్తున్నాడు, నక్షత్రాలు మిణుకు మిణుకు మంటున్నాయి, చుట్టుపక్కల ఎక్కడా దీపం అన్నది కానరావడంలేదు. నేలమీదనుండి గాలి జోరున లేస్తూంది, ఎండిన ఉమ్మెత్త పొదలూ రెప రెపలాడిస్తూ, కీచుగా ఈలకొడుతూంది. కూలిపోయి పడిపోయిన పాత మట్టి సమాధి శిథిలాలలోనుంచి గుడ్లగూబలు కూస్తున్నాయి.

స్వారిచేస్తూ దారికి అడ్డుగా వున్న కనుమలోకి దిగాను. ఏ చడీ వినబడలేదు. నక్క ఒకటి మాత్రం జడుసుకుని రెల్లు పొదల్లోనుంచి గంతువేసి, నీలిఛాయ పసిమి వన్నెవలె వెన్నెట్లో కనబడుతూ రివ్వున పారి పోయింది. చుట్టుపక్కల మరే జీవీ కానరాలేదు.

గుర్రాన్ని గ్రామంకేసి తిరుగు ముఖం పట్టించాను. కనుమ అంచు వెంట వెళ్తూండగా మా గ్రామంలో వుంటూండిన జెన్‌షెన్‌కూల్ గురించి ఆలోచించాను. ఇతగాడు సైన్యంనుండి పరారై వచ్చేశాడనీ, ఇలాంటి వాళ్ళే మరో ఇద్దరు — పసిమి లోయవాళ్ళో, మరెక్కడనుంచి వచ్చినవాళ్ళో మరి — కొండల్లో దాగుంటున్నారనీ వూళ్లో నలుగురూ చెప్పుకుంటూన్న సంగతి నాకు జ్ఞాపకం వచ్చింది. నేనూ విన్నానేగాని, ఆ పుకార్లను నేనంతగా పట్టించుకోలేదు. సర్వమూ ఇంత ప్రమాదంలో వున్నప్పుడు ఇలా వాళ్లు దాచుకునే వాళ్లు వుండడం ఎలా సాధ్యమో నాకేమీ అర్థంకాలేదు. కొంద రేమో యుద్ధానికెళ్లి దెబ్బలు తిని చచ్చిపోవాలా? కొందరేమో వీళ్ల

వెనకాల దాగుని హాయిగా బతకాలా? అబ్బెబ్బే, ఇంత సిగ్గులజ్జలు లేనివాళ్ళు ఎవ్వరూ వుండరు అని అనుకున్నా నేను. కాని ఇప్పుడు తటాల్న నాకు అనుమానం తోచింది. గ్రామంలో వున్న వాళ్లం అందరం, అరచేతి ఐదు వేళ్లల్లా, ఒకరినొకరం ఎరుగుదుం. పోనీ అనుకుందుకేనా, గుర్రపు దొంగలాంటి మనిషి ఒక్కడూ లేడు మాలో. ఇంతకీ ఎత్తుకుపోయిన వస్తువును దాచేయడానికి, కుట్టుసూదా ఏమన్నానా, గుర్రమాయె. అందు లోనూ ఒకటి కాదు, మూడు గుర్రాలాయె. దీని అర్థం, దొంగలు ఎక్క డ్నుంచో వచ్చివుండాలనే. వీళ్లిప్పుడు తోడేళ్లల్లా స్తెప్‌మైదానంలోనూ కొండల్లోనూ తిరుగాడుతూండాలి. జెన్‌షెన్‌కూల్ నిజంగానే సైన్యంనుండి పరారే అయితే, ఇకనేం! ఇది వాడి పనే అయివుండాలి అనుకున్నాను. ఐనా దీనికి రుజువూ దాఖలా ఏమీ కనబడదే: ఏది ఎలా వున్నా, దొరికేవరకూ దొంగకాడు, ఇంతకీ వాణ్ణెవ్వరూ చూడలేదాయె.

ఈ మూడు గుర్రాలనూ ఒక జట్టుగా రెండు క్రరుల నాగటికి కట్టేవాళ్లం. ఎలాగో ఒకలా తంటాలుపడి, నాలుగు గుర్రపు దూడలను లొంగదీసి నాగటికి కట్టాం. పాపం, మా గుండెలు అవిసిపోయాయి. కాని ఏం చెయ్యడం? గత్యంతరం లేదాయె. విత్తే కాలం రానేవచ్చింది, తరుణం మించిపోతే కార్యంలేదు, గుండెలు అవిసిపోవడం మాట తర్వాత చూసుకుందాం, దొంగల మాట ఇప్పడేమొచ్చె తొందర అనుకున్నాం. ఈ వసంతకాలంలాంటి గడ్డు వసంతకాలాన్ని నా జన్మ అంతట్లోనూ ఇహ చూడ్లేదు. ప్రజలా? ప్రజల్లో ఏ తప్పు లేదు. ప్రజలకి పని చేయాలనే వుండె, పని చేయడానికి శాయశక్తులా తంటాలుపడ్డారు, కాని ఓ మూల కడుపులో కాల్తూంటే, కడుపులు చేతిలో పెట్టుకుని ఏం పనిచేయగలరు? వెనకటి రోజుల్లో ఒక రోజులో చేసేపని ఇప్పుడు వారంరోజులు పడుతూండె. ఆలస్యంగా సాగుతున్నాయి పనులు, నానుపుతో జరుగుతూంది విత్తడం. ఇదేదీ చాలనట్టు, మరొక దురదృష్టం వచ్చి పట్టుకుంది. సమష్టి క్షేత్రంలో సరిపడ్డా విత్తనాలు లేకపోయాయి. ఇహ ఇక్కడా అక్కడా వూడ్చి,

ఆ మూలా ఈ మూలా వెతకి, గింజ గింజా ఏరి, పోగుచేసి, ఆరబోసి, ఎలాగో చచ్చీచెడీ, మా దళం మాత్రం ప్లాను ప్రకారం విత్తడం పూర్తిచేసింది.

మా బతుకుల తీరు గురించి ఆ రోజుల్లో నేను తీవ్రంగా ఆలోచించే దాన్ని. రోజంతా రెక్కలూడిపోయేటట్టు కష్టపడిన తర్వాత — పనిరోజుకి ముట్టాల్సిన భత్యాలూ వెచ్చాలూ ఏమీ ముట్టడంలేదు. అంతకుముందు కూడబెట్టుకున్న నిల్వలన్నీ ఏనాడో నిండుకున్నాయి. ఇహ ఏం చేయడం? దేశంమీద పడి తిరగడమా, నాలుగు దిక్కులా చెదిరిపోయి గాలిగుడ్డల్లా దేవుళ్ళాడ్డమా? దీని అర్థం ఇహ అన్నీ వదలుకోవడమే అన్నమాట. అబ్బే, వీల్లేదు. ఐతే, మీదటికి బతకడం ఎలా? సరే, శరత్తువరకూ సాగి, చలికాలం కూడా ఎలాగో ఒకలాగ ఈడ్చేస్తామే అనుకుందాం, తర్వాత మళ్ళీ వసంతకాలం వస్తుందే, అప్పుడు మళ్ళీ అర్థాకలితో బాధపడుతూ నీర్సించిపోయినవాళ్ళచేత పనిచేయించడమా? మరి, పనిచేయకపోతే అసలు బువ్వ వుండదాయె, బతకడం ఎలాగు?

పూర్వాపరాలన్నీ ఆలోచించేదాన్ని, రాత్రి నిద్రపట్టేదికాదు. ఓనాడు తటాలున మెదడులో మెరపులా మెరసింది ఓ ఆలోచన: బీడుగా వదిలేసిన భూమిని, విడిగా వున్న చిన్న మడిచెక్కని దున్నితే, ఆ పంటను అన్ని కుటుంబాలూ పంచుకుని తినొచ్చునే. ఈ సంగతి అధ్యక్షుడితో మాట్లాడా, అక్కడనుంచి బయల్దేరి జిల్లా ఆఫీసుకి వెళ్ళా. వెళ్ళి మా ప్లాను మేం పూర్తిచేశాం, ఇది ప్లానుకుమించి అదనంగా చేసే పని, దీనిని మా సొంత కష్టంమీద ఆధారపడి మా అంతట మేమే చేసుకుంటాం, ఈ విధంగా మా పనిరోజులకి ముట్టాల్సినదీ మాకు ముట్టుతుంది. ప్రజలకీ ఆదరవూ దొరుకుతుంది అని చెప్పా. బల్లదగ్గర కూచున్న మనిషి ఎవరో ఒకతను ఓ మాట విసిరాడు:

''సమష్టిక్షేత్రపు స్టాలిన్ చట్టాన్ని అతిక్రమిస్తావే!''

నాకు వొళ్ళు మండి అనేశా:

''చట్టం చట్టుబండలు గానూ! చట్టమూ లేదు గిట్టమూ లేదు!

తిప్పూ తిప్పలూ లేకుండా చస్తూంటే తిండి పెట్టే నాధుడెవడయ్యా?''

''ఇలాంటి మాటలన్నందుకు నీకు ఏ గతి పడుతుందో తెలుసుగా?''

''తెలుసు. నీకు అదే తేలికైతే తోలవయ్యా నన్నక్కడికి. ఒక్క సంగతి ముందు ఆలోచించుకుని మరీ ఆ పనిచెయ్యి — యుద్ధశ్రేణిలో వున్న సైనికులకి బ్రెడ్డుకోసమని విత్తనాలు ఎవరు విత్తుతారయ్యా?''

పెద్ద గగ్గోలు బయల్దేరింది. జిల్లా పార్టీ కమిటీలో గొప్ప రగడ లేచింది. దీనికి నేను సొంతంగా బాధ్యత తీసుకునే షరతుపైన జిల్లా కమిటీ సమావేశం కొసకి ఒప్పుకుంది. కాని అసలు విషయం బాధ్యత ప్రశ్న కాదు, అసలు విషయం విత్తనాలు గురించి. సమష్టిక్షేత్రంలో ఒక్క గింజ ఐనా లేదు — పూర్తిగా ఖాళీ. వున్నదంతా చల్లేశాం. కిందా మీదా పడి ఆలోచించా. ఆలోచించి, మా దళంవాళ్లనందరినీ — ముసలీ ముతకా, పిల్లా జెల్లా, అందరినీ — పిలిచా. అదొక సమావేశంగా కానేకాదు, కుటుంబం అంతా కలిసి ఆలోచించుకునే సభగా కూడాం.

''మనం నిశ్చయించుకుందాం — ఏమిటి చేయడం మనం? ఇప్పుడు మనం చేనులో చల్లిన దానిమీద మనమేమీ ఆశపెట్టుకోకూడదు. అదంతా యుద్ధశ్రేణికే అనే సంగతి మీకందరికీ తెలుసు, దానిలో ఏమైనా మిగుల్తుందా అంటే అది విత్తనాలక్కి అట్టేపెట్టేయాలి కదా. మీ దగ్గర అక్కడా అక్కడా ఏ మాత్రం గింజైనా మీ కంటబడినట్టాయెనా, దానిని చిన్న పొలంలో చల్లి, పెద్ద కుటుంబాలున్నవాళ్లకీ, ముసలివాళ్లకీ, అనాథ శిశువులకీ బువ్వ పెట్టొచ్చు. మీకు గనుక నామీద నమ్మకం వుంటే, ఈ బాధ్యతను నేను నామీద వేసుకుంటా. ఇప్పుడు మనం చేయాల్సిందేమిటంటే: బంగారంలా దాచుకున్న గింజల్ని ఏమాత్రమైనా సరే మీరు దాచుకునివుంటే, మీలో ప్రతి ఒక్కరూ కూడా ఇంటికి వెళ్లి, ఈ రోజే మీ సంచుల్లోనూ జాడీల్లోనూ అడుగూ మడుగూ వున్న గింజల్ని కూడా పట్టుకొచ్చి ఇచ్చేయాలి. మా నోట్లోకి వెళ్ళాల్సిన ఆ పట్టెడు తిండీ మేమే వదలుకుంటున్నాం, ఇహ మేం ఆకలితో మాడి చావాల్సిందే అంటూ

నామీద కోపంతెచ్చుకోకండి, పంట చేతికొచ్చేవరకూ మనం ఎలాగో ఓలాగు పాలచుక్కలమీదేనా బతికి ఈడ్చుకొస్తాం, అందుకు ప్రతిఫలంగా ప్రతీ గింజకీ నూరు గింజలు మనకి ముట్టుతాయి. మిత్రులారా! మీరు శాయశక్తులా చెమటోడ్చి, పళ్లు బిగించి, నడుం కట్టండి, మీ కోసమూ, మీ పిల్లల కోసమూ ఈ వీరోచిత కృత్యానికి సాహసించండి. ఏమీ విచారించకండి. నేను బిడ్డలు గన్న తల్లిని, నా మాట నమ్మండి, నాకు సాయ పడండి, తరుణం మించిపోలేదు. విత్తులు చల్లేందుకు ఇంకా వేళ వుంది....''

అక్కడ చేరిన అందరూ నాకు ఊత ఇచ్చినట్టే కనబడింది. కాని తీరాచేతలకి వచ్చేసరికల్లా, అప్పుడు వాళ్లకి కష్టమని తోచింది, ఏకంగా ఘోరమే అనిపించేసింది. గంపెడు సంసారాలున్న తల్లులు వీధిలోకి పరుగెత్తుకొచ్చేసి లోకంమీద వున్న సర్వానికీ, యుద్ధానికీ, వాళ్ల బతుకులకీ, వాళ్ల పిల్లల బతుకులకీ, సమష్టిక్షేత్రానికీ, నాకూ, శాపనార్థాలు పెడుతూ, తిట్టుకుంటూ ఉసూరుమంటూంటే నాకు మరీ ఘోరమనిపించిపోయింది. వాళ్లు ఇంతలా బాధపడిపోయినా కూడా, ఆ దాచుకున్న గింజల్ని ఇచ్చేయడమంటే తమ గుండెకాయలో ఒక ముక్క కోసి ఇచ్చేయడమే అయినా, ఎంతో కొంత ప్రతీవాళ్ళూ తాము ఇవ్వగల్గినదంతా ఇచ్చారు: కుంచెడు ఇవ్వగల్గిన వాళ్లు కుంచెడు ఇచ్చారు, పిడికెడు ఇవ్వగల్గినవాళ్లు పిడికెడూ ఇచ్చారు. వాళ్ల దగ్గర వున్న ఆఖరి గింజసహా ఏరి తీసుకొచ్చి ఇచ్చారన్న సంగతి నాకు తెలుసు, తెలిసి వుండి కూడా నేను వాళ్ల దగ్గరనుంచి తీసుకున్నాను. అందరు ఇచ్చినదీ పిడికెడేసీ పిడికెడేసీ తీసి ఒక సంచీలో పోగుచేశాను. ఇంటింటికీ బండిమీద వెళ్లి, ఇంట్లోవాళ్లని ప్రాధేయపడి, బతిమాలుకుని బామాలుకుని, కొప్పడి వాళ్ల చేతుల్లోనుంచి బలవంతాన ఊడబెరికా. నాకొక్కటే ఊరట శరత్తులో ఒక్కొక్క పిడికెడుకీ ఒక్కొక్క బస్తా వాళ్లందరికీ ముట్టుతుందే అనీ, అప్పుడు వాళ్ళే నన్ను మెచ్చుకుంటారు కదా అనీ.

మా పొరుగింటి మనిషి, అయ్‌షా పట్ల నేను ఎలా వ్యవహరించినదీ

ఎన్నటికీ మరచిపోలేను నేను. పాపం ఆ మనిషి జబ్బుది. ఆమె పడుచుతనంలో వున్నప్పుడే మొగుడు — జమాన్‌బాయ్ — పోయాడు, యుద్ధానికి బాగా ముందే. పాపం ఒక్కర్తే, రోగిష్ఠి, ఒక్కగానొక్క కొడుకు బెక్‌తాష్. జబ్బు తగ్గిన రోజున సమష్టిక్షేత్రానికేనా వచ్చి పనిచేసేది, లేకుంటే తన పెరటి తోటలోనేనా పనిచేసుకునేది, ఆవు ఒకటుంది. దాని పాడితో కొడుకు సంరక్షణ జరిగిపోయేది, వాడూ ఎదిగి వచ్చాడు. ఇప్పుడు బెక్‌తాష్ పెద్దాడై చేతికి అందుకొచ్చాడు, పొలంలో పనిచేస్తున్నాడు, కుర్రాడు నమ్మకస్థుడు. ఆ రోజు వాడి బండిమీదనే నేను ఇంటింటికీ వెళ్ళాను. వాళ్ల గుమ్మం చేరగానే, నేను వాడితో అన్నాను:

''బెక్‌తాష్, మీ ఇంట్లో వెనకేసుకున్నది ఏమేనా వుందిరా, అబ్బాయ్?''

''అట్టే లేదు'' అన్నాడు, అని కాస్సేపు వూరకుని, ''కాని వుంది పొయ్యి గూటి వెనకాల సంచిలో'' అన్నాడు.

''ఐతే, మరి వెళ్లి తీసుకురా'' అన్నాను.

''నే వెళ్లను, తొల్గొనాయ్ పిన్నీ, మీరే వెళ్లండి'' అన్నాడు వాడు.

అయ్‌షాకి ఆనాడు వంట్లో బాగులేదు. ఆమె నడుముకి వెచ్చని శాలువ చుట్టుకుని, కంబళి పరచుకుని కూచుంది.

''అయ్‌షా, నే వచ్చా మరి, నువ్వేమి ఇస్తావో తీసుకుందుకని'' అన్నా.

''మాకున్నదంతా అదుగో అక్కడుంది'' అంటూ పొయ్యిగూటి వెనకాల వున్న సంచికేసి చూపించింది.

''ఏముందో అదే ఇయ్యి. నేను సరదాపడి తీసుకోవడం లేదు. విత్తనాలకని పొలం సిద్ధంగా వుంది, విత్తడం ఆలస్యమైపోతూంది, మరి నన్ను వూరకే నిలబెట్టకు, అయ్‌షా'' అని నేను తొందరచేశాను.

కాని ఆమె పెదవి కొరుక్కుని, ముఖం వేలేసి, మాటాడకుండా వూరకుంది. అబ్బా, ఆ పాడు లేమి అలాంటిది, మనుషులచేత ఏమైనా చేయిస్తుంది!

''అయ్‌షా! నువ్వే కాస్త ఆలోచించుకో: మరి చూడు, ఆ వున్నది

ఏ పది రోజులకో, మరీ కడుపు మాడ్చుకుంటే ఏ పదిహేను రోజులకో వస్తుంది. తర్వాత వచ్చే చలికాలం గురించీ, వసంతకాలం గురించీ ఆలోచించుకో. మీ అబ్బాయి కోసమని బతిమాలుతున్నా నిన్ను, అయ్‌షా. వాడు బండితో కాసుకున్నాడు వీధిలో నా కోసమని.''

ఆమె ముఖం ఎత్తి, ప్రాధేయపడుతూ నావంక చూసింది.

''నువ్వే ఆలోచించు, నా ఖర్మం, ఇంతకుమించి నా దగ్గర వుంది గనుకనా? నీకు తెలియనిదేముంది, ఇద్దరం ఇరుగు పొరుగువాళ్లం....''

ఆమె అలా ప్రాధేయపడుతూంటే నేను మెత్తబడిపోతూన్నానేమో అనిపించింది నాకు, కాని మరునిమిషమే మనసులో పుట్టుకొస్తూన్న కని కరాన్ని వెనక్కి నెట్టేసి:

''ఇప్పుడు నేను నీ పొరుగు మనిషిని కాను, మేస్త్రీని!'' అన్నాను ఆమె మాటలకు అడ్డంపడి. ''నీ దగ్గరనుండి ఈ గింజల్ని ప్రజల తర పున తీసుకుంటున్నాను'' అంటూ నేను వెళ్లి, నా చేత్తో ఆ సంచి తీసు కున్నా.

అయ్‌షా ముఖం వెనక్కి తిప్పేసింది.

ఆ సంచిలో ఏడు కిలోగ్రాములు గోధుమలున్నాయి. అన్నీ తీసుకుం దామనే అనుకున్నా, కాని నాకు ధైర్యం చాలిందికాదు. ఓ బాల్చీలో సగం గింజలు పోసి,

''ఇదిగో చూడు, అయ్‌షా, సగమే తిసుకుంటున్నా, నన్ను తిట్టకేం!'' అని ఆమెతో అన్నా.

ఆమె నా వంక తిరిగింది. ఆమె కళ్లవెంట కన్నీరు ధారకట్టి, గడ్డం వైపుకి కిందనుండి కారుతూంది. నాకు కడుపులో కెలికేసినట్టయింది. చప్పున ఆ ఇంట్లోనుంచి బయటికొచ్చేశా. అబ్బ! ఆ సంచిని అక్కడే ఎందుకుంచేశానుకానో? మరి, నేను పోగుచేసిన గింజలకి ఏ గతి పట్ట బోతుందో నాకెలా తెలుస్తుంది?

పోగుచేసిన గింజలన్నీ రెండు పెద్ద బస్తాలయాయి. గింజల్ని జల్లించి, చెరిగి, పొల్లు తీసి, శుభ్రంచేసి గింజగింజా ఏరి సిద్ధంచేశాం. వాటిని నేనే

స్వయంగా మోసి పొలం దగ్గర చేర్చా. నేను తొందరపడ్డాను గాని ఆ రోజుకి ఆగి వుండాల్సింది. మడిచెక్క అంచులంట దున్నవలసినది ఇంకా కాస్త మిగిలిపోయింది. కాని మడిలో త్వరగా విత్తులు చల్లేవరకు నేను ఓపిక పట్టలేకపోయాను. వేకువనే లేచి వెళ్లి చేతితో చల్లుదామను కున్నా. అంతా సిద్ధంచేసుకున్నాం — విత్తనాలూ, పొలమూ, సర్వమూ అను కున్న ప్రకారం జరుగుతూంది.

ఆ సాయంకాలం పనులు పూర్తిచేసుకుని ఇంటికి వచ్చేశాను. కాని అదేమిటో మనసులో మాత్రం ఏదో బెంగగా వుంది, ఏదో సరిగా లేదని పించి ఏమీ తోచలేదు. బెక్‌తాష్‌తోనూ మరో కుర్రాడితోనూ చెప్పాను, నొల్లలు బండిలో వేసుకుని ఆ పూటే మడిచెక్కదగ్గరకు తోలుకెళ్లమని. ఏం చెప్పినా, కుర్రాళ్లు కుర్రాళ్ళే మరి — చెప్పిన మాట వినరుకదా అనుకు న్నాను. అలా అనుకుని, నేను చెప్పిన పని చేశారో లేదో చూసివద్దామనుకుని,

''కుర్రాళ్ల దగ్గరకి వెళ్లి, వాళ్ళేం చేస్తున్నారో చూసి వస్తా'' అని అలిమన్‌తో అన్నా.

గుర్రం ఎక్కి వెళ్ళా.

గ్రామం పొలిమేర చేరుకున్నాక, దౌడుతీయించి వెళ్ళా: సందె వెలుగు, కాని చప్పచప్పన చీకటి పడిపోతూందప్పుడే. మడిచెక్క చేరుకుని, చూద్దును కదా! నాగటు పూసిన ఎడ్లు అలానే నిలబడున్నాయి పొలంలో, పాపం వాటిని గాటనుండేనా విప్పలేదు. ఎవ్వరూ లేరక్కడ. నాగలి పట్టుకుని దున్నే మనిషిమీద — వాడింకా కుర్రాడే — చెడ్డ కోపం వచ్చింది నాకు, ఎడ్లని కాడినుండి విప్పనందుకు ఉండరా, అబ్బాయ్, వుండుండు నీ పని పట్టిస్తా అని మనసులో అనుకున్నా. వాడికోసం వెదకుదామని వెనక్కి తిరిగి చూశా. నొల్లలు వేసుకొచ్చిన బండి తిరగబడి వుంది. బండి దగ్గర ఎవ్వరూ లేరు.

''ఏయ్, కుర్రాళ్ళూ! ఎక్కడున్నార్రా మీరు? ఉలకరేం పలకరేంరా?'' అని వాళ్లకోసం కేకేశా.

ఏ జవాబూ లేదు, ఆ చుట్టుపక్కల ఎవ్వరూ లేరు. ఏమొచ్చింది వీళ్లకి? — అని నాకు భయంవేసింది. గుడారం వరకూ గుర్రం ఎక్కివెళ్లి, అక్కడ చెంగున దిగాను. దిగి అగ్గిపుల్ల వెలిగించి చూదును గదా — కాళ్ళూ చేతులూ కలియగట్టేసి, నోట్లో గుడ్డలు కుక్కేసి, మెత్తగా దెబ్బలు తిని, నెత్తురుకారుతూ, కిందపడి వున్నారు కుర్రాళ్లు. బెక్‌తాష్ నోట్లో కుక్కివున్న గుడ్డ ఊడబెరికి, గట్టిగా కేకేశా — ఆ గొంతుకే నాది కాదు:

''విత్తనాలు ఏవీ? ఎక్కడున్నాయి విత్తనాలు?''

''పట్టుకు పారిపోయారు! మమ్మల్ని కొట్టారు!'' అంటూ వాడు బొంగురుపోయిన గొంతుతో చెప్పి, దొంగలు పారిపోయిన వైపు తలకాయ తిప్పాడు.

ఇహ తర్వాత ఏం జరిగిందో నాకు జ్ఞాపకంలేదు. ఆ రాత్రి గుర్రాన్ని నాలుగుకాళ్ళూ ఎగరేయించి స్వారిచేసినట్టు నా జన్మలో ఎప్పుడూ స్వారి చేయలేదు. రాత్రి అనీ లెక్కచేయలేదు, వల్లకాటి కటిక చీకటినీ లెక్కచేయలేదు. మా కొంప తగలడిపోయి బందిపోట్లు దోచుకున్నా సరే మారుమాటాడి వుండేదాన్నిగాను. శరత్తులో కళ్లంలోనుంచి పది బస్తాల గింజలు దొంగలు పట్టుకుపోయుండినా: పోతే పోయిందిలే, ఎలుకలు ఎత్తుకు పోయాయనుకుందాం, అనేసి వుండేదాన్ని. కాని ఈ విత్తనాల గింజలు, మా భావి ఆహారం, రేప్పొద్దున్న మాకు బువ్వపెట్టే గింజలు — ఆ దొంగలు నాకు దొరికి వుంటే — ఆహా, నా చేజేతులా వాళ్ల పీకలు పిసికేసి వుండేదాన్నే.

నేను దొంగలవెంటే పడి, వాళ్లను శరవేగంతో వెంబడించుతూన్నట్టు నాకు తెలిసిపోయింది, మరో గడియకల్లా వాళ్లు నా కంటబడ్డారు. వాళ్ల గుర్రాల గిట్టలనుండి నిప్పురవ్వలు రేగుతున్నాయి. వాళ్లు విత్తనాల బస్తాలను జీన్లముందు వేసి కట్టుకున్నారు. కొండల పక్కనుంచి వెళ్తున్నారు వాళ్లు.

వాళ్లను చూసి, నేను కేకలుపెట్టి బతిమాలాను:

‘‘ఆ బస్తాలు వదలిపెట్టేయండి, అవి విత్తనాలు! వాటిని వదిలి పెట్టేయండి, అవి విత్తనాలు! విత్తనాలు!’’

వాళ్ళు వెనక్కి తిరిగైనా చూడ్లేదు. రానురాను నేను వాళ్లకు దగ్గరపడుతున్నాను, ఇహ అప్పుడు నాకు కనబడింది, వాళ్ళ ముగ్గురిలో వెలపలివాడు స్వారిచేస్తూన్న గుర్రాన్ని వెంటనే పోలికపట్టేశాను. అరె, అదేమిటి, బూడిదెవన్నె దాట్లగుర్రాన్ని నేను పోల్చుకోలేకపోవడమేమిటి? దాని నడక తీరూ, దాని కాళ్లమీద మేజోళ్లలాగు తెల్లని మచ్చలూ, నాకు తెలియదూ? అప్పుడు నేను గట్టిగా అరిచాను:

‘‘ఆగు, ఆగు, నువ్వెవరో నాకు తెలుసు! నువ్వు జెన్‌షెన్‌కూల్‌వి, నువ్వు జెన్‌షెన్‌కూల్‌వి! నా చేతిలోనుంచి ఇహ నువ్వు తప్పించుకోలేవు! ఆగు!’’

అవును, ఆ మనిషి నిజంగా జెన్‌షెన్‌కూలే. వాడు కడమవాళ్ల నుండి వేరుపడి, నా వంక తిరిగాడు — నాతో మాట్లాడ్డానికా అన్నట్టు. ఆ చీకటిలో తటాల్న నిప్పుమంట మెరసింది. ఢామ్ ఢామ్ అని ఉరుముల చప్పుడైంది. నేను గుర్రం మీదనుండి కింద పడిపోతున్నాను — అప్పుడు తెలిసింది, తుపాకి గుండు తగిలిందని. కాని మొదట మాత్రం అనుకున్నాను, మరేం లేదులే గుర్రం తొట్రుకుందని.

కాస్త తెప్పరిల్లేసరికి, మొద్దుగా భారంగా, ఎముక విరిగినట్టుగా వెన్నులో నొప్పి వేస్తూన్నట్టనిపించింది. తలలోనుంచి నెత్తురు వూరి, మెడ మీదనుంచి కిందకి కారి, నేలమీద చల్లని మడుగు కట్టుతూంది. నా పక్కనే గుర్రం పడిపోయుంది, గుర్రు గుర్రున గురక పెడుతూంది, ఊపిరాడక గిజగిజ కొట్టుకుంటూంది, అదింకా లేచి నిలబడ్డానికి ప్రయత్నిస్తూ, కాళ్లు తన్నుకుంటూంది. మృత్యువేదనతో గుటకలు మింగుతూ వస్తూన్న శ్వాస దాని గుండెలు చీల్చుకుంటూ బయటికొచ్చింది, తలకాయ నేలకి దుబ్బున తగిలి ఒరిగిపోయింది, గుర్రంలో మరి చలనంలేదు. చుట్టూ అంతా నిశ్శబ్దం — జీవకోటి నిశ్శబ్దమైపోయింది. నేనలా కదల

కుండా పడివున్నాను, లేచి నిలబడేందుకు ప్రయత్నించనైనా ప్రయత్నించ లేదు. ఇప్పుడు సర్వమూ ఒకటే అనిపించిపోయింది. దేనిమీదా మనసు పోలేదు, జీవితంలో అర్థమే కనిపించలేదు. ఏమి చేస్తే నా ప్రాణం నేను తీసుకోగల్గుతానా అని ఆలోచించాను. దగ్గర గనుక కొండచరియ వుండివుంటే, ఆ అంచు దరికి దేకుకుంటూ వెళ్లి, అగాధంలోకి దొర్లి పోయుండేదాన్ని. ఏ ముఖం పెట్టుకుని నేను తోడి మనుషులను చూడగల్గు దును? అనిపించిపోయింది నాకు. ఆ నిమిషంలో నాకు ఆకాశంలో గడ్డి కోతగాని బాట కనబడింది. మసక మసగ్గా వెలుగుతూ, మంచు తెరలా కానవస్తూన్న పాలపుంత ఏరు, ఆనాడు అయ్‌షా ముఖంమీదనుంచి మడ్డిగా బొటబొట కారిన కన్నీటినే జ్ఞాపకం తెచ్చింది. మెల్లగా మోకాళ్లమీద లేచాను, మరి కాస్సేపటికి లేచి నిలబడ్డాను, జోగిపోయి మళ్ళీ కింద పడ్డాను, మనస్తాపంతోనూ బాధతోనూ వెక్కివెక్కి ఏడుస్తూ శాపనార్థాలు పెట్టుతూ బొబ్బరించాను:

"యుద్ధం ఉసురు నీకు తగలా, ఓరి జెన్‌షెన్‌కూల్! చచ్చిన వాళ్ల శాపాలు నిన్ను తగలెయ్యా, ఓరి జెన్‌షెన్‌కూల్! చంటిపిల్లల తిట్లు నీ మొహం ఈడ్చా, ఓరి జెన్‌షెన్‌కూల్!"

వంట్లో శక్తి వున్నంతవరకూ అలా ఏడుస్తూనే వున్నాను, అలా శాపనార్థాలు పెడుతూనే వున్నాను.

ఎంతో సేపు అక్కడలా పడివున్నా. తర్వాత ఎవరో వస్తూన్నట్టు అడుగుల చప్పుడైంది. ఎవరో నన్ను పిలిచారు:

"తొల్గొనాయ్ పిన్నీ! ఎక్కడున్నావ్? తొల్గొనాయ్ పిన్నీ!"

ఆ పిలుస్తూన్నది బెక్‌తాష్ అని గొంతుకబట్టి పోల్చుకుని, వాణ్ణి పిలిచాను. పరుగున వచ్చాడేమో వాడికి వూపిరి అందలేదు, రొజుకుంటూ మోకాళ్లమీద నా పక్క పడి, రెండు చేతులతోనూ వాడు నా తల పైకెత్తి.

"తొల్గొనాయ్ పిన్నీ, ఏమిటైంది నీకు, దెబ్బతగిలిందా ఏమిటి?" అని అడిగాడు.

''లేదు రా, అబ్బాయి, పడితే గీసుకుపోయిందిలే'' అనేశాను, వాడు గాభరా పడకుండా వుండేందుకని. ''అదిగో, చూడు, గుండుదెబ్బ తగిలి గుఱ్ఱం చచ్చిపోయింది.''

''అంతే కదా, ఐతే మరేం ఫర్వా లేదు. మీకు సాయంచేసేందుకు మేం వున్నాంలెండి!'' అన్నాడు బెక్‌తాష్ ఉత్సాహంగా. అని వాడు జోడించాడు: ''వేళకి దొరికింది మనకి మాంసం. వూళ్ళో నలుగురికీ పంచిపెడదాం.''

కుఱ్ఱాళ్లు వచ్చి, నన్ను బండిలో ఎక్కించి, ఇంటికి తీసుకెళ్ళారు. మూణ్ణాలుగు రోజులు మంచంపట్టాను, వెన్ను ఎత్తనిచ్చింది కాదు. ఈనాటికి కూడా మబ్బు పట్టిన రోజునా చెమ్మగా వున్న రోజునా నడుము నొప్పిగానే వుంటుంది. నేను మంచంపట్టిన రోజుల్లో ఎందరెందరో వచ్చారు నన్ను చూడ్డానికనీ, నా వంట్లో ఎలా వుందో కనుక్కోడానికనీ. వాళ్లందరికీ ఎన్నో ధన్యవాదాలు, నన్ను ఎవ్వరూ నిందించలేదు, ఏమీ జరగనట్టుగా ఆ వూసే ఎవ్వరూ ఎత్తలేదు, అందుకు ముఖ్యంగా మరీమరీ ధన్యవాదాలు. నేనెంతగా మనసులో బాధపడుతూన్నదీ వాళ్లు గ్రహించే వుంటారు బహుశ. మా కష్టమంతా బూడిదలో పోసిన పన్నీరైందనీ, మా మడిచెక్క విత్తకుండా అలానే వుండిపోయిందనీ, ఆకలితో ఏడుస్తూన్న పసిపాపల తిండి పడగొట్టి, నేను తీసుకెళ్లిన గింజలు ఆ పాపిష్ఠి దోపిడిదొంగల పాలయాయనీ తల్చుకున్నప్పుడల్లా యమబాధతో గుండె భగ్గున దహించుకుపోతుంది, కళ్లు చీకట్లు కమ్ముతాయి.

10

''తొల్గొనాయ్, నువొక్కర్తెవే కాదు సుమా ఈ బాధ అనుభవించింది, భూదేవివి నేనూ ఈ బాధ అనుభవించాను. వేసవికారు అంతా ఆవురావు రంటూ ఆవులిస్తూవుతూన్న గాయంలా ఆ మడిచెక్క ఖాళీగానే

వుండిపోయింది. ఆ బాధ చాలా కాలమే వుంది. ఎప్పుడైతే చేలు గొడ్డుపోతాయో, అప్పుడే నాకు తగులుతుంది అన్నిటికంటె పెద్ద గాయం, తొల్గొనాయ్. మరి యుద్ధంనుండి ఎన్ని చేలు పంటలు లేకుండా పాడుపడిపోయా కదా! శత్రువులందరిలోనూ నాకు బద్ధశత్రువులు యుద్ధాన్ని ఆరంభించే వాళ్ళే.''

''నువ్వు అన్నది ముమ్మాటికీ నిజం, తల్లీ, భూదేవీ. మా అబ్బాయి మసెల్‌బెక్ రాసినది అచ్చంగా దీన్ని గురించే కదా మరి? వాడి వుత్తరం నీకు జ్ఞాపకం వుందా, భూదేవీ?''

''జ్ఞాపకం వుంది, తొల్గొనాయ్.''

''అవును, మనిద్దరికీ జ్ఞాపకం వుంది. ఈ రోజు స్మృతి దినం, తల్లీ, భూదేవీ. ఈ రోజున వెనుక జరిగినదంతా స్మరించుకుందాం.''

''అలాగే స్మరించుకుందాం, తొల్గొనాయ్. మసెల్‌బెక్ నీ కడుపున పుట్టిన కొడుకే కాదు, నా కడుపున పుట్టిన కొడుకు కూడానూ సుమా — భూదేవి కన్నకొడుకు. వాడి వుత్తరం మళ్ళీ మరొకసారి నాకు చదివి వినిపించు, తొల్గొనాయ్.''

## 11

జనం నన్ను చూడ్డానికి వచ్చినప్పుడు, నా మీద జాలికొద్దీ జరిగిన దాని గురించి చెప్పడం మానేసి, తాజా వార్తలు గురించీ, పనిపాటుల గురించీ, కాలమానం గురించీ ముచ్చటించుతూ కూచునేవారు; కాని అందుకు మరో కారణం కూడా వుంది. ఆ కారణం ఏమిటో తర్వాత పోల్చుకున్నాను. కాని నాకు ఏం జరగబోతుందో వాళ్ళందరికీ ఆనాడే తెలుసు.

అయ్‌షా, మరెందుకనో గాని మా యింటికి వచ్చింది, ఓ గిన్నెనిండా గిన్నెడు మీగడ పట్టుకొచ్చింది. ఆమె గడపలో కాలు పెట్టడం చూసి,

ఇహ చెప్పలేనంత సిగ్గుపడిపోయాను నేను. ఏమనడానికీ నాకు తోచలేదు. మాటాడకుండా మంచంమీద అలా వుండిపోయాను. అమే అంది:

''జరిగిపోయిన దాన్ని గురించి నువ్వేమీ మనసులో పెట్టుకోకు, తొల్గొనాయ్. మరి నా లోపాన్ని కూడా మన్నించు. నాకు నీమీద ఏమీ కోపంలేదు. అవసరమైతే నీ కోసం నా ప్రాణం ఇవ్వాల్సొచ్చినా కూడా ఏమీ విచారించను. మా బెక్‌తాష్ ఇప్పుడు పెద్దవాడయాడు, మన రెండు కుటుంబాలకోసమూ వాడు కష్టపడగలడు. నా మీదకంటే నీ మీదే వాడికి హెచ్చు ఆపేక్ష. ఆ సంగతి నీకూ తెలుసు. అందుకు నేనెంతో సంబరపడుతున్నాను. ఎందుకంటే దాని అర్థం, వాడు సంగతులు తెలుసుకుంటున్నాడన్న మాట, బుద్ధిమంతుడౌతున్నాడన్న మాట.''

నేనేమీ అనలేక వూరకే గొణిగాను:

''నువ్వు అన్న మాటలకు ధన్యవాదాలు, అయ్‌షా.''

మరునాడు ఉదయం నాకు బాగా నయంగా వుంది, ఇల్లూ వాకిలీ ఎలా వుందో చూదామని వీధి గుమ్మంలోకి వెళ్ళాను. కాని వెంటనే అలసట వచ్చేసింది, ఇహ దాంతో, కిటికీ దగ్గర ఎండగా వుంటే అక్కడ చతికిలబడ్డా. అలిమన్ కూడా ఇంట్లోనే వుంది. గుడ్డలు ఉతుకుతూంది పెరట్లో. పనిలోకి వెళ్లమన్నాను దానిని. కాని నేను ఒక్కర్తెనే వున్నానని చెప్పి, అధ్యక్షుడు ఆ పూటకి తనను ఇంట్లో వుండిపొమ్మన్నాడు అని చెప్పింది.

ఆ ఏడాది వసంతకాలంలో పెద్ద ఆపిల్ చెట్టు — సువన్‌కూల్ నాటినది — ఎంత బాగా పూత పెట్టిందంటే, కొత్త సత్తువ పుంజుకుని, మళ్ళీ కొత్త పడుచుతనం అనుభవించుతూందా అనిపించింది నిజంగా. పళ్ల తోటలు పూతలో వున్నప్పుడు గాలి శుభ్రంగా వుండి, దూరం కూడా దగ్గర పడినట్టుంటుంది. అలా కూచుని చుట్టుపక్కల వున్న వస్తువులన్నిటినీ చూసి ఆనందిస్తున్నా. సరిగా ఆ వేళకి మా పోస్టు జవాను, వృద్ధు తెమిర్‌చాల్, నన్ను పలకరించి, నన్ను పరామర్శించి, కుశలం అడి

గాడు. అడిగాడే కాని, అతడి మామూలు అలవాటు చొప్పున కాకుండా, తనకేదో వొంట్లో బాగు లేనట్టూ, తన దగ్గుమీద చికాకుపడుతూ, విసుక్కుంటూన్నట్టుగా దగ్గుతూ అదేమిటో తనకేదో తొందరపని మునిగి పోతూన్నట్టూ హడావుడి పడ్డాడు; కిందటి వారం తనకు పడిశం పట్టిం దనీ, తెగ బాధపడిపోతున్నాననీ చెప్పి, తర్వాత అదేదో మాటవరుసకి అన్నట్టు:

''అవును గాని, నీకేదో వుత్తరం వుందనుకుంటాను సుమా'' అని తన సంచిలోనుంచి వుత్తరం తీసి ఇచ్చాడు.

ఆ మనిషి ఉపేక్ష చూసి నాకు కోపంవచ్చింది:

''ఆ మాట ముందే చెప్పావు కావేమీ? ఎవరి దగ్గరనుంచి ఆ వుత్తరం?''

''మసెల్‌బెక్‌నుంచి అనుకుంటాను'' అని గొణిగాడు.

ఉత్తరం వచ్చిందనే సంతోషించా గాని, ఆ వుత్తరం మామూలుగా సైనికులు ఎప్పుడూ రాసి ముక్కోణంగా మడిచిపెట్టి పంపే వుత్తరం కాదనీ, తెల్లని దళసరి కవరు వుత్తరమనీ, దానిపైన చిరునామా టైపు చేసి వుందనీ మొదట నేను చూసుకోనే లేదు. మా పొరుగు మనిషి, యుద్ధంలో గాయపడి వచ్చిన బెక్‌తుర్‌సూన్, చంకకర్రలమీద కుంటు కుంటూ మా దగ్గర కొచ్చాడు. గాయపడిన కాలు పాపం బాధపెడుతూంది కాబోలు అనుకున్నా నేను, మనిషి ఇంచుమించు నిలబడలేకపోయాడు. అప్పుడప్పుడు అతడు మా దగ్గరకొచ్చి కూచుని పిచ్చాపాటీ కబుర్లు చెబు తూంటాడు. బెక్‌తుర్‌సూన్ నన్ను కుశలం అడిగి, ఆ కవరు వుత్తరంకేసి చూశాడు. మసెల్‌బెక్ నుంచే ఆ వుత్తరం అన్నాడు.

''నీ చేతులు ఎందుకలా వణకుతున్నాయి? చంకకర్రలమీద అలా నిలబడ్డమెందుకు? ఇలా కూచుని, ఈ వుత్తరం చదివిపెట్టు'' అని అడిగా.

అతడికి కూచోవడం ఎంతో కష్టమైపోయింది. కాలు ముడుచు కోలేడు పాపం. వణుకుతూన్న వేళ్లతో అతడా కవరు చించి, వుత్తరం చద

వడం మొదలెట్టాడు. అయ్యో, నా ముద్దుల తండ్రీ, నీ మొదటి మాటలతోనే నాకు అంతా అర్థమైపోయింది రా, నా నాయనా! వాడిలా

''అమ్మా, విను, కాలం గడుస్తూన్నకొద్దీ, నువ్వు నన్ను అర్థం చేసుకుంటావు. నేను సరిగానే ప్రవర్తించానని నువ్వే ఒప్పుకుంటావు. మా అబ్బాయి చేసినదంతా చిత్తశుద్ధితోనే చేశాడని నువ్వే తప్పకుండా అంటావని నాకు తెలుసు. ఐనా, నువ్వు నన్ను అర్థంచేసుకున్నా, నీ నోటితో నువ్వు నాతో అనకపోయినప్పటికీ, నీ కడుపులో ఏ మూలో దాగున్న మాటలు: 'ఈ ఉజ్వల ప్రపంచాన్ని నువ్వు ఇంత సులువుగా వదిలేసి ఎలా వెళ్లిపోగల్గావురా, నాయనా? నిన్ను నవమాసాలూ మోసి కన్నానే, నిన్ను పెంచి పెద్దవాణ్ణి చేశానే, ఇందుకేనా?' — అనే మాటలు నీ కడుపులోనే అలా వుండిపోతాయి. అవును, అమ్మా, నువ్వు తల్లివి, మాతృమూర్తివి, నన్నలా అడగానికి నీకు హక్కుంది, కాని నీ ప్రశ్నకి చరిత్ర తర్వాత జవాబిస్తుంది. మరి ఇప్పుడో, ఇప్పుడు నేను ఇదే అంటాను: ఇది మనం కోరి తెచ్చుకున్న యుద్ధంకాదు, దీన్ని మనం మొదలెట్ట లేదు, ఇది మనకందరికీ, మన యావత్తు ప్రజకీ బ్రహ్మాండమైన విపత్తు తెచ్చిపెట్టింది. ఈ బ్రహ్మరాక్షసిపైన చావుదెబ్బ తీయాలంటే, దీన్ని నాశనం చేయాలంటే, ఇప్పుడు మనం మన నెత్తురు చిందించక తప్పదు, మన జీవితాల్ని ధారపోయక తప్పదు. ఈ పని మనం చేయకపోతిమా, 'మనిషి' అని పిలుచుకుందుకు మనం తగం. యుద్ధంలో వీరోచిత కృత్యాలు చేయాలని నాకేనాడూ తృష్ణలేదు. అన్నిటికంటే అడకువైన వృత్తినే — నేను నేర్చుకుందామనుకున్నాను. బడిపంతులు అవుదామని అనుకున్నాను. అలా గని గంపెడాస పెట్టుకున్నాను. సుద్దముక్క, చూపుడు కోల బదులు ఇప్పుడు నా చేతిలోకి తుపాకి వచ్చి, సైనికుడనయాను నేను. ఇది నా తప్పు కాదు. కాలం అలా చేసింది నన్ను. ఒక్క పాఠమైనా పిల్లలికి చెప్పేం దుకు నోచుకోలేదు నేను.

''మరో గంటలో మాతృదేశంపట్ల నా విధ్యుక్తధర్మాన్ని నెరవేర్చేం దుకు వెళ్తున్నా. ప్రాణాలతో తిరిగివస్తాననుకోను. రానున్న ఎదురుదాడిలో అనేక మంది నా కామ్రేడ్ల ప్రాణాలు కాపాడేందుకని నేను అక్కడకు వెళ్తున్నాను. ప్రజలకోసమని, జయంకోసమని, మానవునిలో వున్న సకల సౌందర్యాన్ని కాపాడేందుకోసమని నేనక్కడకు వెళ్తున్నాను.

''ఇదే నా కడపటి వుత్తరం, ఇవే నా కడపటి మాటలు. అమ్మా! నన్ను కనిపెంచిన నిన్ను, 'అమ్మా!' అనే పేరు వెయ్యిసార్లు పునశ్చరణ చేస్తూ నిన్ను స్మరించుకుంటాను, అప్పటికి కూడా నీ ఋణం నేను తీర్చుకో లేకపోతాను. నీకు ఎంతో బాధ కల్గించినందుకు, అమ్మా, నన్ను క్షమించు. ఒక్కటి మాత్రం అర్థంచేసుకో, అమ్మా, నేనేదో వెర్రి తెంపరితనంతో బలిదానం చేయడంలేదు సుమా, లేదు. ఇలా జీవించాలని నా జీవితమే నాకు నేర్పింది. ఈ గుణపాఠాన్నే నా బడిపిల్లలికి తొలి సారీ కట్టకడపటి సారీ నేను నేర్పితీరాలనుకున్నాను. నా ఇష్టంతోనూ మనస్కారంతోనూ పోతున్నాను. నా తోడిప్రజలపట్ల నా సర్వోత్కృష్ట విధిని నెరవేర్చుతు న్నాను కదా అని నేనెంతో గర్వపడుతున్నాను.

''అమ్మా, ఏడవకు, ఎవరినీ ఏడవనివ్వకు. ఇలాంటి సందర్భంలో ఎవ్వరూ ఏడవకూడదు.

''క్షమించు, అమ్మా, ఇక నాకు సెలవియ్యి.

''నాకు సెలవిప్పించండి, నా పర్వతాల్లారా, ఓ అలా-తో! మిమ్మల్ని ఎంత ప్రేమించుతున్నానో కదా!

''నీ పుత్రుడు, ఉపాధ్యాయుడు, లెఫ్టినెంట్ మసెల్‌బెక్ సువన్ కూలొవ్.

''యుద్ధశ్రేణి, 1943, మార్చి 9, అర్ధరాత్రి రాసినది.''

కలలో మసలుతూన్నట్టుగా తలెత్తాను. తల బరువెక్కిపోయింది. ముందరి వాకిట్లో జనం కూడారు, అందరూ నిశ్శబ్దంగా వున్నారు. ఎవ్వరూ ఏడవలేదు, ఎవ్వరూ ఏడవకూడదనే కోరాడు మసెల్‌బెక్. ఆడం

గులు నన్ను చేయిపట్టుకుని లేవనెత్తారు. నేను లేచేప్పటికి, రివ్వున కొట్టిన గాలికి ఆపిల్ పువ్వుల తెల్లని రేకులు వాన చినుకుల్లా రాలాయి. అవి మా తలమీద నిశ్శబ్దంగా పడ్డాయి. మా ఆపిల్ చెట్టు కావల, సుదూర పర్వతాల తెల్లని శిఖరాల కావల అనంతంగా స్వచ్ఛమై అపారమైన ఆకాశం నీలంగా ప్రకాశిస్తూంది. నాలోనుంచి, నా గుండెల్లోనుంచి, కేక ఒకటి పైకి పెల్లుబికింది. సర్వప్రపంచమూ వినేటట్టు కేక పెట్టాలనిపించింది నాకు. కాని నేను నోరు కుట్టేసుకున్నాను. నా కన్నకొడుకు కడపటి కోర్కెను పాటించాను, ఏడవవద్దని నన్ను బతిమాలుకున్నాడు. అలిమన్ ఏం చేస్తూండెనో నాకు తెలీదు. నా వంక చేతులు చాచి నా దగ్గరకు అది వస్తూండడం చూశాను. నా దగ్గరకు వచ్చి, నా కళ్లలో కళ్లు పెట్టుకుని చూసి, వెనక్కి తిరిగి, రెండు చేతుల్లోనూ ముఖం పెట్టుకుని వెళ్లి పోయింది.

ఇదీ — నా నడిమివాడు నాకు లేకుండా పోయిన వైనం. నాకు మిగి లినది వాడి టోపీ ఒక్కటే.

## 12

''వాడి పేరు నా దగ్గర ఉంది, తొల్గొనాయ్. వాడి మాతృభూమిని నేను. వాడి మాటలున్నాయి ప్రజలకి, తొల్గొనాయ్. వాడి స్వదేశస్థులు వాళ్లు.''

''అవును, తల్లీ, భూదేవీ, నువ్వు చెప్పినది నిజమే. మా సమష్టి క్షేత్రానికి వాడి పేరే పెట్టారు. మసెల్‌బెక్ కామ్రేడ్లు వాడి ఆఖరి వుత్తరం పంపిస్తూ, దానితో గ్రామ సోవియట్‌కి వుత్తరం రాశారు. తమ కామ్రేడ్‌ని తాము ఎన్నటికీ మరచిపోమనీ, అతడి వీరోచిత కృత్యం తమకు ఎల్లప్పుడూ గర్వకారణమనీ, అతని స్మృతిని మాతృభూమి చిరకాలమూ స్మరించుకుంటుందనీ రాశారు. మన భారీ ఎదురుదాడి ఒకటి జరగబోతుం

దనగా, ఆ ముందరి రాత్రి, మసెల్‌బెక్ శత్రువు మందుగుండు గిడ్డంగిని పేల్చివేశాడనీ, ఆ పేలుడు హోరుకి మైళ్లకొద్దీ చుట్టుపక్కల ప్రదేశం సర్వమూ దుంప నాశనమై పోయిందనీ వాళ్లు రాశారు. ఆ వీరుల ఎదుట, నా కన్నకొడుకు మసెల్‌బెక్ ఎదుట, నేను తలవంచి వారికి నివాళులెత్తు తాను, వారి కీర్తి నాకు గర్వకారణం, కాని ఏదీ కూడా, ఎంత కీర్తి అయినా కూడా, వాడు లేకపోయినందువల్ల నాకు కల్గిన లోటును తీర్చలేదు. పిల్లలుగన్న తల్లిని ఎవరినైనా అడగండి, అలాంటి కీర్తి గురించి ఏ తల్లీ కలలు గనదు. వాళ్లు జీవించాలనే, కేవలం లోకకల్యాణం కోసమనే పిల్లల్ని కంటుంది తల్లి...."

"నువ్వు అన్నది నిజం, తొల్గొనాయ్. ఆ వసంతకాలాన్ని, విజయం తరలి వచ్చిన ఆ వసంతకాలాన్ని నేను ఎల్లప్పుడూ జ్ఞాపకం వుంచుకుంటాను. ఆ దినాన్ని, యుద్ధశ్రేణినుండి తిరిగివచ్చిన సైనికులను మీరూ ప్రజలూ కలుసుకున్న దినాన్ని, నేను ఎల్లప్పుడూ జ్ఞాపకం వుంచుకుంటాను. కాని, తొల్గొనాయ్, ఈనాటివరకూ కూడా నేను చెప్పలేకుండా వున్నాను, ఆనాడు ఏది హెచ్చుగా వుండిందో — ఆనందమో, లేక దుఃఖమో."

## 13

మా పెరటితోటను దున్నుకోడానికని సమష్టిక్షేత్రపు నాగటిని వాడు కుందుకు మా వంతు ఆ రోజున పడింది. దుక్కి పూర్తిచేశామో లేనే లేదో, తటాలున వీధిలో ఏదో పెద్ద హడావుడీ, సంతగోలా వినబడింది. అదేమిటో తెలుసుకుందామని అలిమన్ వీధిలోకి పరుగెత్తి వెళ్లి, చప్పున తిరిగి వచ్చేసింది.

"అత్తయ్యా, దబ్బున రాండి" అని నన్ను తొందరపెట్టింది. "సైని కులను కలుసుకుందుకు జనం వెళ్తున్నారు."

నాగటినీ, నాగటి గాటకు పూన్చిన ఎడ్లనీ మడిలో నడిమధ్య అలాగే వదిలేశాం. నిజంగానే, యావత్తు గ్రామమూ, గుర్రాలమీదా కొందరూ, కాలినడకను కొందరూ, నడుంవంగిన ముసలాళ్లు ఆడా మగా, పిల్లా జెల్లా, యుద్ధరంగంలో గాయపడి చంకకర్రలమీద ఆనుకుని కుంటుతూ వస్తూన్న మాజీ సైనికులూ — ఒకరేమిటి, ఆబాలగోపాలమూ ఒక్క దిశనే ఎక్కడికో అలా పరుగెత్తుతున్నారు. పరుగెత్తుతూన్నవాళ్లు పరుగెత్తుతూనే పక్క వాళ్లకి కబురు అందిస్తున్నారు — ఎవడో దారంట పోతూన్న మనిషి ఒకడు (నది అవతలి ప్రాంతంనుంచి వస్తూన్న మనిషి అయివుంటాడన్నారు మరి) ఇంకెవడితోనో చెప్పాడట: సైనికులు ఇంటికి వచ్చేస్తున్నారనీ, రెండు మిలిటరీ రైళ్లు వచ్చి రైలు స్టేషన్లో ఆగాయనీ, అన్ని గ్రామాల కుర్రాళ్ళూ అక్కడకు చేరుకున్నారనీ, సైనికులు రైలు స్టేషనునుంచి అప్పుడే బయల్దేరారనీ, వాళ్లు ఏ నిముషమేనా ఇక్కడకు రావచ్చుననీ. ఇది నిజమేనా, లేక గాలికబురా అని ఎవ్వరూ అడగలేదు. ఇది నిజం అయి తీరాలనే ప్రజ కోరుకున్నారు, ఎన్నాళ్లనుంచో ఈ రోజు కోసమని కలలు కంటున్నారు, అందుచేత ఎవ్వరికీ ఏ అనుమానమూ తట్టలేదు.

గ్రామం పొలిమేరకు, ఎక్కడైతే యుద్ధం వచ్చేముందు సరిగా కొత్త వీధి కట్టడం మొదలెట్టారో అక్కడికి, పరుగెత్తాం. గుర్రాలమీద వచ్చిన వారు గుర్రాలు దిగలేదు, కాలినడకను వచ్చినవాళ్లు పంటకాల్వ పక్కనున్న తిప్ప ఎక్కారు, ఇక కుర్రజట్టు అంతా, సగం సగం లేచి శిథిలమైపోయిన గోడలూ, పక్కనున్న చెట్లూ ఎక్కిపోయారు. ఎప్పుడొస్తారా అని అందరూ కాసుకుని, రోడ్డుకేసి చూస్తున్నారు. ఒకరితో ఒకరు కబుర్లు చెప్పుకుంటూ, ఇహ ఉండలేక ఒకరి మాటలకి ఒకరు అడ్డం పడుతూ, క్రితం రాత్రి తాము నిద్రలో కన్న శుభ వార్తల కలలు గురించి చెప్పుకుంటున్నారు కొందరు; కాలిన గులకరాళ్లను పోగుచేసి, వాటిని గిలకరించి చూసుకుని జోస్యం చెబుతున్నారు కొందరు. కలల్లో ఐతేనేమి, ఈ జోస్యాల్లో ఐతేనేమి అన్నిటిలోనూ ప్రజకి శుభమే కనబడింది, కోర్కెలు

ఈడేరడమే అవుపడింది. నాకిది ఈ రోజు జ్ఞాపకం వచ్చి, ప్రపంచంలో ప్రజలందరూ ఆనాటిలాగానే తమ కొమాళ్లనూ, అన్నదమ్ములనూ, తండ్రులనూ, భర్తలనూ ప్రేమించుతూ వాళ్లకోసం కాసుకుని వున్నప్పుడు ఎలాగైతే అందరూ ఒకే భావం కల్గివున్నారో అలాగే గనుక ఎల్లప్పుడూ వుంటే ఇహ యుద్ధాలు వుండేవికావు కదా, అని మనసుకి అనిపించుతూంది.

మూకలో సాగుతూన్న బాతాఖానీ తగ్గేసరికల్లా ప్రతీవారూ నిశ్శబ్దంగా వుండి, తల వంచేసుకుని, ఎవరి ఆలోచనల్లో వాళ్లు మునిగిపోయేవారు. ఎవరికేమి రాసిపెట్టిందో విధి అని నిరీక్షించుతూ వుండేవారు. ఎవళ్ల మట్టుకు వాళ్లు ప్రతీవారూ ప్రశ్నించుకునేవారు: ఎవరు తిరిగి వస్తున్నారు, ఎవరు తిరిగి రావడంలేదు? నిరీక్షణ ఫలితం ఎవరికి దక్కుతుంది, ఎవరికి దక్కదు? ఈ జవాబులపైన ఆధారపడున్నాయి — జీవితమూ, భవితవ్యమూనూ.

సరిగా ఈ సమయంలో, చెట్టుమీద ఎక్కి చూస్తూన్న ఓ కుర్రాడు తటాల్న కేకేశాడు, ''వస్తున్నార''ని. అందరూ ఎక్కడివారక్కడ కొయ్యబారిపోయారు, కొముజ్ వాద్యపు తీగెల్లా ప్రతీవారు బిగుసుకుపోయారు, తర్వాత అందరూ ఒక్కపెట్టున చెవులు చిల్లులడేట్టు అరచారు, ''వస్తున్నార''ని. మళ్ళీ నిరీక్షణలో మునిగి సద్దు మణిగింది. ప్రగాఢ నిశ్శబ్దం. కాని తర్వాత మళ్ళీ ఒక్కసారి లెప్పరిల్లినట్టుగా, కేక పెట్టారు, ''ఎక్కడ? ఎక్కడున్నారు వాళ్లు?'' అని. మళ్ళీ అందరూ మాటలు కట్టిపెట్టి నిశ్శబ్దంగా వున్నారు. హైరోడ్డుమీద బండి రావడం కనబడింది. బండి ఖణఖణ శబ్దంచేసుకుంటూ వచ్చి, రోడ్డు చీలికదగ్గర — మా గ్రామానికి వెళ్ళే మట్టిరోడ్డుదగ్గర ఆగింది, బండిలోనుంచి గంతువేసి సైనికుడు ఒకడు దిగాడు. అతడు దిగి, తన ఓవరుకోటూ, సామాన్ల సంచీ బండిలోనుంచి తీసుకుని, బండి తోల్తూన్నతనికి వీడ్కోలు చెప్పి, మా దిశగా నడిచాడు. మూకలోనుంచి ఒక్క మాట అయినా పెగల్లేదు, అందరి నోరూ మూతబడిపోయింది, అందరూ ఆశ్చర్యంతో రోడ్డుకేసి

చూస్తున్నారు — ఒకేఒక్క సైనికుడు ఓవరుకోటూ, సామాన్లసంచీ బుజం మీద పడేసుకుని నడిచి వస్తున్నాడు. అతడు దగ్గరపడ్డాడు, కాని జనం మాత్రం నిల్చున్న చోటనుండి కదల్లేదు, ఒక్కరైనా కదల్లేదు. మనుషుల ముఖాల్లో దిగ్భ్రమ పెల్లుబికింది. ఏదో అద్భుతంకోసం అందరం కాసుకున్నాం. మా కళ్లతో చూసినదానిని మేమే నమ్మలేకపోయాం, ఏమంటే ఒక్క మనిషికోసం కాదు, ఎంతమంది కోసమో కాసుకుని కూచున్నాం మేం.

ఆ సైనికుడు అంతకంతకు మరింత దగ్గరపడ్డాడు, తర్వాత తటపటాయించి ఆగాడు. గ్రామం పొలిమేర మాటా మంతీ ఉలుకూ పలుకూ లేకుండా పోగడి వున్న మూకను చూసి దిగాలుపడ్డాడు కూడా. ఇదేమి మనుషులు వీళ్లు, నోట మాట పెగలకుండా ఇలా ఇంత నిశ్శబ్దంగా వున్నారేమిటి, ఇలా స్తంభించిపోయి నిలబడ్డారేమిటి? బహుశ ఎవరికోసమో కాసుకున్నారేమో? — అని అతడు ఆలోచనలో పడిపోయుంటాడు. ఆ సైనికుడు రోడ్డుకేసి ఒకటి రెండు సార్లు చూశాడు, కాని రోడ్డుమీద తను తప్ప ఎవ్వరూ లేరు. అతడు మళ్ళీ మాకేసి నడక మొదలెట్టాడు, మళ్లీ నిలబడిపోయాడు, మరల వెనక్కి తిరిగి చూశాడు. మా ముందు కాళ్లకి జోళ్లులేకుండా నిలబడివున్న అమ్మాయి, తటాల్న గట్టిగా అరిచింది:

''అదిగో, మా అన్నయ్య! అషిరాలీ! అషిరాలీ!'' అంటూ ఒక్క కేక వేసి, తలకి చుట్టుకున్న రుమాలు లాగేసుకుని, అతడికేసి రివ్వున దూసుకుపోయింది.

వాణ్ణి ఆ పిల్ల ఎలా పోల్చుకుందో ఆ భగవంతుడికే తెలియాలి, దాని కేక మాత్రం తుపాకీ తూటాలా చప్పుడై, మతిపోయినవాళ్లల్లా నిలబడున్న మాలో కదలిక పుట్టించింది. ఆడా మగా చిన్నపిల్లలందరూ ఆ అమ్మాయివెంట పరుగెత్తారు.

''అవున్రా, వాడు అషిరాలీయే! వాడే!'' అంటూ గొంతుకలు లేచాయి, ఇహ దానితో పెద్దలూ పిన్నలూ అందరం మూకకి మూకా ఆ సైనికుడి దగ్గరకి చ్రదున పరుగెత్తాం.

ఏదో బ్రహ్మాండమైన శక్తి ఒకటి మమ్మల్నందరినీ దాని రెక్కలమీద ఎత్తుకుని ఎగరేసుకుపోయింది. ఆ సైనికుడి దగ్గరకు చేతులు చాచి అతణ్ణి కౌగలించుకుందుకని మేం వెళ్లినప్పుడు, ఆ చేతుల్లోనే మోసుకు పోయాం — మా జీవితాలూ, మేం పొందిన దుఃఖాలూ, చిత్రహింసలతో అనుభవించిన నిరీక్షణలూ, నిద్ర ఎరగని రాత్రులూ, నెరసిన తలలూ, ముసలితనం వచ్చిన మా పడుచులూ, దిక్కులేని మా వితంతువులూ అనాథులూ, మా కన్నీటిబొట్లూ మా మూల్గులూ, మా ధైర్యస్థైర్యాలూ అన్నిటినీ జయం సాధించుకొచ్చిన ఆ సైనికుడి దగ్గరకు మేం మోసుకు పోయాం. తనకు స్వాగతం చెప్పేందుకు ఎదురు సన్నాహం వస్తూన్నట్టు అతడు తటాల్న గ్రహించుకుని, మాకేసి పరుగున వచ్చాడు.

ఆ మూకతో కలిసి పరుగెత్తుతూన్నప్పుడు, మిలిటరీ రైలు ఒకటి ఉరుములు ఉరుముతూ నా పక్కనుంచి వెళ్లిపోయినట్టే నా కనిపించింది, గాలి రివ్వున ముఖాన కొట్టింది, చటిక్కున కేక వినబడింది: ''అ-మ్మా-మ్మా! అలిమా-న్!'' రైలు చక్రాలు ఖణేలుఖణేలుమని నా చెవుల్లో చప్పుడయాయి.

ఆ సైనికుడిని మొదట గుర్రపు రౌతులు కలుసుకుని, ఓవరుకోటునీ సామాన్లసంచీనీ అతడి చేతుల్లోనుంచి లంకించుకుని, ఇటునుండీ అటు నుండీ అతనిని రెండు చేతులూ పట్టుకుని మధ్యనుండి నడిపించుకుని తీసుకొచ్చారు.

ఓ విజయమా! నీ కోసమై ఎన్నాళ్లు కాసుక్కూచున్నాం! స్వాగతం నీకు ఓ విజయమా! స్వాగతం! మా కన్నీటిని మన్నించు! నా కోడలు అలిమన్ అషిరాలీ గుండెలమీద పడి తలకాయ మొత్తుకుంటూ, అతని బుజం పట్టుకుని, ''ఏడీ నా కాసీమ్? ఎక్కడున్నాడు?'' అని అతడిని ఊదరగొట్టుతూ అడిగినందుకు క్షమించు. మమ్మల్నందరినీ క్షమించు, ఓ విజయమా! నీ కోసమని ఎంతో త్యాగం చేశాం. ''కడమవాళ్లు ఏరీ? మావాడు ఎక్కడున్నాడు? ఏడీ మా అబ్బాయి? కడమవాళ్లందరూ ఎక్క

దున్నారు? వాళ్ళు ఇంటికెప్పుడొస్తారు?'' అని మేం మొ్రపెట్టుకున్నం దుకు మమ్మల్ని మన్నించు. ''వస్తారు తల్లీ, వస్తారు నాయనా, అందరూ వస్తారు, త్వరగానే వచ్చేస్తారు, రేపే వచ్చేస్తారు'' అని అషిరాలీ జబాబు చెప్పినందుకు అతన్నీ మన్నించు. మమ్మల్నందరినీ మన్నించు, విజయమా! అషిరాలీని ముద్దుపెట్టుకుని, కౌగిలించుకున్నప్పుడు, ఆ క్షణంలో జైనాక్, మసెల్‌బెక్, కాసీమ్, సువన్‌కూల్‌నీ తల్చుకుని వీళ్లెవ్వరూ తిరిగి రారుకదా, అనుకున్నాను. నన్ను క్షమించు, ఓ విజయమా!...

మాటా మంతీ లేకుండానే నిశ్శబ్దంగా నడిచాం. అప్పుడప్పుడు అలిమన్ ఉండుండి వెక్కివెక్కి ఏడ్చి, ఊపిరాడనట్టు కష్టంగా భారంగా దారుణంగా నిట్టూర్చేది. ఆమె ముఖం విచారంతో వాడిపోయింది, దించిన కళ్ళు నేలకేసే చూస్తున్నాయి, కిందకి వాలిపోయింది తల, ఏమిటో ఉద్రేకంగా ఆలోచించుతూంది. నేను పోల్చుకున్నాను: దుఃఖంతో కుమిలి పోతూన్న ఆలోచనలలో మునిగి కొట్టుకుపోతూందామె. అవును, అలిమన్ మహా క్షోభపడిపోతూంది, పాపం. ఎంత బాధపడిపోతూందో ఆమె ముఖం లోనూ, కుంగిపోయిన చూపుల్లోనూ, గట్టిగా కరచుకుంటూన్న పెదవి లోనూ కనబడింది నాకు. ఆమె ఏమిటి ఆలోచించుతూందో, ఆమె తనలో ఏమిటనుకుంటూందో నాకు తెలిసింది; నా మనసులో నేను ఆమెతో ఇలా అన్నాను: ''అవును, నా ముద్దు కోడలా, మనం వేరుపడిపోయే వేళ నిజం గానే దగ్గర పడుతూంది. ఇహ నువ్వు కాసిమ్‌ని నీ మనసులో శాశ్వతంగా భూస్థాపితం చేసేశావు. నువ్వు మాత్రం ఏం చెయ్యగలవు గనుక? చచ్చిన శవంతో శ్మశానం దాటి వెళ్లనూ లేము, పోయిన పెనిమిటికోసం శోకన్నాలు పెడుతూ శాశ్వతంగా నువ్వు కూచోనూ లేవు. ఇహ అంతా అయిపోయింది. నువ్వు వెళ్లిపోతావు. ఏమీ చెయ్యలేం, నువ్వెలాగా వెళ్లిపోతావు. నువ్వు మాత్రం ఏం జేస్తావులే? నేనూ నిన్నేమీ అనను. నీకు వెళ్లిపోవాలని వుండి నువ్వు వెళ్లిపోవడమూ లేదు, గభాల్న ఆ నిముషానికి ఏదో తోచి వెళ్లిపోవ డమూ లేదు. ఖర్మ అలాంటిది. అయ్యో, ఖర్మ, ఖర్మ.... నిన్ను వదలి

వుండడమంటే నాకెంత కష్టమో నీకు తెలుసునో, తెలీదో మరి. ఇద్ద రమూ తల్లీ కూతుళ్లలా బతికాం. నువ్వు వెళ్లిపోయేప్పుడు, నా కడుపున పుట్టిన కూతుర్ని దీవించినట్టే నిన్నూ మనసారా దీవిస్తాను. నువ్వు ఆనందంగా వుండాలనీ సుఖపడాలనీ భగవంతుణ్ణి ప్రార్థిస్తూంటాను. నువ్వింకా నాలుగు కాలాలు బతకాల్సినదానవు, ఇంకా చిన్న పిల్లవి, చక్కని చుక్కవు, ఎవడినో ఒకడిని చూసుకుని నువ్వు చేసుకుంటావులే. కాని ముఖ్యమైన దేమిటంటే, ఆ చేసుకున్న మనిషి మంచి వాడవాలి. ఆ మనిషి కూడా నీకు కాసీమ్‌లాంటివాడే కాకూడదా ఏమిటి? ఏం చెప్పగలం? నేను నీకేమీ సాయంచేయలేనుకదా. నాది ఒక్కటే కోర్కె: నువ్వు వెళ్లిపోయిన తర్వాత, నన్ను మాత్రం అప్పుడప్పుడు జ్ఞాపకం తెచ్చుకుంటూండు. నువ్వుతప్ప ఇప్పుడిహ నాకు మరెవ్వరూ లేరు. నేనొక్కర్తెనే ఇంట్లో ఒంటరిగా వుండాలి, ఈ లోకంలో ఒక్కర్తెనే వుండాలి. ఆ మాట తల్చుకుంటేనే భయంవేస్తూంది. పోనీ, ఈ ముసలి కాలంలో ఎవరేనా వున్నారా నాకు, చూసి సంబరపడదామా అంటే, ఎవ్వరూ లేరుకదా: నీ కడుపున ఓ కాయ కాసి, మనవడినో మనమరాలినో ఎత్తుకుందునా అంటే, అందుకూ లేకపోయె. ఏమోలే, అదీ ఒకందుకు నీ మంచికోసమే అనుకోవాలి. నా విషయమై నువ్వేమీ చూడకు. నా కోసమని, ఈ ముసలి తుక్కు కోస మని, నీ బతుకు పాడుచేసుకోకు, నువ్వింకా చిన్నదానివి. నా బతుకు నేను బతికాను. నీ బతుకింకా ముందే వుంది. నీ కెప్పుడు వెళ్లిపోవాలని వుంటే అప్పుడు నాతో చెప్పు. నీకు ఏ రోజు వెళ్లిపోవాలని బుద్ధిపుడుతుందో ఆ రోజే నువ్వు స్వతంత్రంగా వెళ్లిపోవచ్చు. ఏ చీకూ చింతా లేకుండా నువ్వు హాయిగా వెళ్లిపో. నేను నిన్నెన్నడూ మరచిపోను, నిన్నెప్పుడూ తల్చుకుంటూనే వుంటాను. నువ్వంటే ఎప్పుడూ ఆపేక్షపడతాను, నీ మేలు ఎన్నటికీ మరవను...''

ఇలా ఆలోచించుకుంటూ, నా ఆలోచనలను ఈ మాటల్లో పెడుతూ నడిచాను. నా మనస్సులో ఏమిటుందో అలిమన్ గ్రహించుకున్నట్టే వుంది.

మనుషులు సన్నిహితంగా ఒక్క ప్రాణంలా బతికినప్పుడు, ముఖం చూసీ చూడ్డంతోనే ఒక్క క్షణంలోనే ఒకరినొకరు అర్థంచేసుకుంటారు. ఐనా, నేను అనుకున్నానేగాని, అది మాటాడలేదు.

పాడుపడిన వీధివెంట వెళ్తున్నాం. ఆ కర్మకొద్దీ, అలిమన్ కాసీమ్‌ల ఇంటి స్థలంవంక చూశాను: ఐదేళ్ల కింద ఎలా వుండేదో అలానే పడి వుంది, ఆ చెక్కిన బూడిదెవన్నె రాళ్లకుప్ప – కొండలా అలానే వుంద క్కడ, కాని ఇటికలు మాత్రం ఏనాడో శిథిలమైపోయి మట్టి బెడ్డలకింద రాలిపోయాయి. యుద్ధం మొదట్లోనే సగం కట్టి వదిలేసిన ఆ వీధి ఇప్పుడు పూర్తిగా పాడుపడిపోయింది. ఒక్కొక్క వేసవితోనూ ఆ జాగాల్లో గడ్డీ గాదమూ మరింతగా బలిసిపోతూంది. కొన్ని గోడలు దిగబడిపోయి, కొన్ని కూలిపోయి, ఇళ్లలోపల అప్పడే దూలగొండి పొదలు పెరిగిపోయి, ఆవురావురంటూన్న ఖాళీ కిటికీ గూళ్లలోనుంచి తొంగి చూస్తున్నాయి. కొయ్య చీలలకు కట్టిన దూడలు శరత్తు బాగా ముదిరేవరకూ కూడా అక్కడే మేసేవి, కూకుడు గువ్వలు ఏడుస్తూ కూసేవి. ఆ తురాయి పక్షులకి నరవాసనలేని శ్మశానాలంటే ఇష్టం. గోరీలకిమల్లేనే వున్న ఆ శిథిలాలపైన అవి కూచుని, ప్రశాంతంగా వున్న వెచ్చదనంలో చలికాచు కుంటూ, ఎలుగురాసిన గొంతులతో ఏడుపు స్వరంతో ఒకదానినొకటి పిలుచుకునేవి.

బావురుమంటూన్న ఆ ఖాళీ జాగా చూసి, నేను విస్తుపోయాను: ''ఆరె భగవంతుడా! ఇక్కడ కొంపా గూడూ కట్టుకుని, పొయ్యి రాజేసు కుని పొంగించుకుని ఇంత తిని హాయిగా కాపురం వుందామనుకున్న వాళ్లందరూ ఏరీ, ఎక్కడున్నారు? పాపం, నా కాసీమ్‌కి కూడా తన తొలి ఇల్లు కట్టుకుని, దీపం పెట్టుకుని వుండే అదృష్టం లేకపోయిందే!'' అనుకున్నాను. నా మనసు శూన్యమైపోయి దుఃఖంతో అలముకుంది. అలిమన్ నా చేయి పట్టుకుని, విచారంగా చిరునవ్వు నవ్వి, అంది:

''అత్తయ్యా! ఎందుకలా కుంగిపోతున్నావు? జీవితమంటే అప్పడే

అపనమ్మకం పుట్టిపోయిందా? తప్పు, అత్తయ్యా, అలా వుండకూడదు. నీకెంత కష్టంగా వుందో నాకు అర్థంమైంది. కాని నువ్వే నిబ్బరమైన దానివి, నువ్వే....'' – అలా అని, కొంచెం తటపటాయించి, ఏదో అనాలని అనుకుని, మళ్ళీ బహుశ మనసు మార్చుకుని, తను తప్పు చేసినట్టు చిరునవ్వు నవ్వి: ''నేనంటే నీకెంతో ఆపేక్ష. ఇక్కడ, ఈ తిప్పమీద కూచుని, కాస్సేపు మాట్లాడుకుందాం, అత్తయ్యా!'' అంది.

''ఇదిగో, ఇహ ఇప్పుడు చెబుతుంది, తను వెళ్ళిపోతానని చెబుతుంది'' అనుకున్నా నేను. దానినీ నన్నూ చూసుకునే సరికి, జాలితో నిండిన వెచ్చని కెరటం ఒకటి నన్ను ముంచెత్తింది. వణకుతూన్న గొంతుకతో అన్నాను:

''సరే, మంచిది, కూచుందాం, కూచుని మాటాడుకుందాం.''

రోడ్డు అంచున వున్న తిప్పమీద చతికిలబడ్డాం. అత్తా కోడళ్ళం ఇద్దరమూ, మా నొసట ఏమి రాసి వుందో, మీదటికి మేం ఎలా బతకాలో నిశ్చయించుకుందుకని అక్కడ చతికిలబడ్డాం.

అలిమన్ ముఖం దించేసి, నిట్టూర్చి, చెప్పడం మొదలెట్టింది:

''ఇదిగో, ఇహ ఈ పాపిష్టి యుద్ధం అయిపోయింది కదా, అత్తయ్యా. మీదటికి మన బతుకేమిటో ఇప్పుడు అనుకుందాం.'' అలా అని, మాటాడ కుండా వూరకుంది, నేనూ మాటాడ్లేదు. అలిమన్ ముఖం ఎత్తి, సరాసరి నా కళ్ళల్లో కళ్ళుపెట్టి గంభీరంగా చూసింది. ''నువ్వేమీ విచారించకు, అత్తయ్యా'' అంది, ముఖంలో కళలేకుండానే చిరునవ్వు నవ్వుతూ. ''మనకి ఇహ ఏ అదృష్టమూ లేదనే అంటావా? రవంతైనా, పిసరంతైనా కూడా లేదనే అంటావా? ఏమో, నలుగురి మగాళ్ళల్లోనూ ఒకడైనా ఇంటికి రాకుండా వుంటాడని నేను అనుకోను సుమా, అలా ఒక్కనాటికి వుండదు. నువ్వేమీ అనకు, వుండు, అత్తయ్యా, నా మాటకి అడ్డంరాకు, నేను చెప్పేది విను. నేను నిజంగా చెబుతున్నాను, అత్తయ్యా. నిన్ను నేను ఓదార్చడమేమిటి? నన్ను నేను మోసం చేసుకోవడంలేదు. నా మాట నమ్మి,

అత్తయ్యా. నా మనసు మాత్రం చెబుతూంది: జైనాక్ తప్పకుండా ఇంటికి వచ్చి తీరుతాడని. యుద్ధంలో అవుపడడం లేదంటే, దాని అర్థం బతికున్నాడనే. అతడు నేలకొరగడం ఎవ్వరూ చూడ్లేదుకదా. ఏమో, శత్రువు చేతిలో పడితే పడుండొచ్చు, లేదా అంటే గెరిల్లాలతో చేరి ఏ అడవుల్లోనో దాగుని వుండొచ్చు, ఇహప్పుడు తటాల్న ఇంటికే వచ్చేయ్యొచ్చు. ఎక్కడో తీవ్రంగా గాయపడి వుండొచ్చేమో కూడా, అలాంటప్పుడు కబురు పంపించే స్థితిలో కూడా వుండకపోవచ్చుకదా. ఇలాంటిది ఏదైనా జరిగుండొచ్చు. నువ్వే చూదువుగాని — ఏ ఆకాశం మీదనుండో దిగొచ్చినట్టు వస్తాడు, చూస్తూండు. మనం ఓపికపట్టి వుందాం, అత్తయ్యా. ముందే మనం సమాధికర్మ చేసేయడమెందుకు? నువ్వు వినలేదా ఏమిటి, ఇలాంటివి ఎన్ని జరగలేదు? ఏ కబురూ లేకుండా అవుపడనివాళ్లమాట అటుండగా, చచ్చిపోయినట్టు నల్ల కాగితాలు వచ్చిన వాళ్ళే చెక్కుచెదరకుండా ఇంటికి ఎందరొచ్చారు కాదు? అంతెందుకు, మన పొరుగూరులోనూ, పసిమి లోయలో వున్న కజహ్‌లలోనే ఎక్కడో ఉత్తరక్రియలూ, శ్రాద్ధ సంతర్పణలూ అన్నీ అయిపోయాక, ఇహ అప్పుడు చచ్చిపోయినవాళ్లు బతికే వున్నారని తెలియడమూ, వాళ్లు ఇళ్లకి రావడమూ జరిగింది. నాకు గొప్ప నమ్మకం వుంది, నాకు కచ్చితంగా తెలుసు కూడానూ మన జైనాక్ బతికే వున్నాడనీ, త్వరలోనే ఇంటికి వస్తాడనీ. నలుగురు మనుషుల్లోనూ ఒక్కడేనా తిరిగి రాకపోవడమంటూ వుండదు. ఉండకూడదు ఎంత మాత్రమూనూ. వాళ్లకోసమని ఇంత కాలమూ ఎలాగూ కాసుకుని వుండనే వున్నాం. మరికొంత కాలం కూడా వుందాం, అత్తయ్యా. నా గురించి నువ్వేమీ బెంగపెట్టుకోకు, ఇన్నాళ్ళూ నేను నీ కోడలుగా వున్నాను కదా, ఇహ ఈవేళనుంచీ నీ కొడుకులందరి బదులూ నన్నే కొడుకుగా చూసుకో....''

అలిమన్ ఇహ మాట్లాడకుండా వూరకుంది, ఇద్దరమూ మరొక మాట లేకుండా చాలాసేపు అలా కూచున్నాం. అప్పుడే మే వెల మధ్య

రోజులు వచ్చేశాయి. దూరాతిదూరాన మబ్బుముద్దలు చేరుకుని కారు నలుపు పొగతో నిండినట్టున్నాయి. అక్కడ ఉరుము గర్జించుతూంది. అక్కడ నుంచి వచ్చిన చల్లని గాలులు తీయని వాన తావులు విరజిమ్ముతున్నాయి. దూరంనుంచి వస్తూంది సన్నని చినుకు. తుషారం లాంటి జల్లు పెద్ద వానై కడవల్లతో దిమ్మరించుతూంది. వాన చినుకులు ఎండలో తళతళ మెరశాయి, వస్తూవస్తూ వున్న వాన జాంబవంతుని అంగలతో భూమిమీద నడుస్తూంది: అప్పటికప్పుడు కొండల్లో మాయమైపోయేది, మరో గడియ కల్లా లోయలోకి దిగిపోయేది, మళ్ళీ కొండల్లోకి ఎక్కిపోయేది, తిరిగి స్టెప్మైదానంమీదకి వచ్చేసేది. అటువైపే చూశాను అలా రెప్పవాల్చ కుండా. వెచ్చని నా ముఖాన వానగాలి ఒక్క విసురుతో వీచింది. అలిమన్‌తో నేనేమీ మాటాడకుండా అలా వుండిపోయాను. నేను అనాలనుకున్న మాట లన్నీ అక్కడున్నాయి: దూరాన తళుక్కులు మెరుస్తూన్న వానజల్లుకు మల్లేనే ఉదారంగానూ కాంతిగానూ.

అవును, వానలు పడుతూనే వుంటాయి, పంట పండుతూనే వుంటుంది, జనం జీవించుతూనే వుంటారు — వాళ్లతోనే నేనూ జీవించుతూ వుంటాను. అలిమన్ నా మీద జాలిపడిందని నేనిలా అనుకోవడంలేదు, నేనొక్కర్తెనే అయిపోతానని తన కడుపులో వున్న మంచితనం కొద్దీ అది అలా అన్నందువల్లనూ కాదు. అందువల్ల కానే కాదు, మరొకందుకని నేను సంతోషపడ్డాను. యుద్ధం మనుషుల్ని క్రూరులుగానూ, నీచులుగానూ, దూరాశాపరులుగానూ, శూన్యులుగానూ చేసివేస్తుందని ఎవరన్నారు? ఎన్నటికీ కాదు, నలభైయేళ్ళుగా యుద్ధం తన మిలిటరీ బూట్లతో మనుషులమీద నుంచి తొక్కుకుని, చంపుతూ, దోచుకుంటూ, చిచ్చుపెట్టుతూ, నాశనం చేస్తూ వెళ్ళనీ, కాని ఏమైనా సరే, మనిషి మనస్సుని విరిచేయడానికీ, అవమానపరచడానికీ, లోబర చేసుకోడానికీ మాత్రం ఎన్నటికీ దాని తరంగాదు.

నా అలిమన్ కూడా మనిషే! ఒకనాటి చీకటి రాత్రి అంధకారంలో తన పారషూట్‌తో శత్రు స్థావరంలో దిగిపోయి, ఆ రాత్రే జాడలేకుండా

తప్పిపోయిన మన జైనాక్ తప్పకుండా బతికే వున్నాడనీ, తప్పకుండా తిరిగివస్తాడనీ తన నమ్మకాన్ని ఎవరికోసమని తనే మరింతగా దృఢపరచుకుంటూంది? ప్రపంచం మనం అనుకున్నంత అన్యాయంగా లేదని తను యెందుకు నమ్ముతోంది? ఈ నమ్మకాన్ని వమ్ముచేయడానికి నాకు ధైర్యం చాలిందికాదు, మంచినే కోరుతూ అది పెట్టుకున్న ఆశలు అడియాసలని చెప్పేందుకు నాకు నోరు రాలేదు, ఇహ నేను కూడా దాని మాటలే నమ్మాను. ఏమో, జైనాక్ నిజంగానే బతికే వుంటేనో? · అప్పుడేమిటి? ఏమీలేదూ — ఒక చక్కని రోజున వాడు తిరిగి ఇంటికి వచ్చేస్తే — అందులో మహాద్భుతం ఏమీ వుండదు. నేనూ నమ్మాను — అచ్చంగా పసిపాపలా. నేనూ అదే కోరుకున్నాను. అప్పుడే ఆ రోజు గురించి పగటికల కూడా కంటున్నాను. ఇంతలో అంతవరకూ వూరకున్న అలిమన్ మాట్లాడింది. పెరటితోట దుక్కి లేకుండా వుండిపోయిందన్న సంగతి అదే మొదట జ్ఞాపకంచేసింది.

''అత్తయ్యా, ఆ నాగలి అక్కడే వుంది సుమా. మనం ఇహ పోదాం, రా, లే! నేల మళ్ళీ ఆరిపోతుంది'' అని తొందరపెట్టింది.

తోటకేసి పరుగెత్తాం. నాగటు పూన్చిన ఎడ్లు నాగటిని ఈడ్చుకుని తోటలో పచ్చిక వున్న చోట చేరుకుని అక్కడ పచ్చిక మేస్తున్నాయి. వాటిని అలిమన్ మళ్ళీ తోలుకొచ్చింది, మళ్ళీ నాగటికొర్రును నేలలోకి తొక్కి దుక్కి మొదలెట్టాం. తల్చుకుంటే నిజంగా చిత్రమే అనిపిస్తుంది — మనిషికి ఎంత తక్కువ కావాలో కదా! ఒక్కొక్కప్పుడు ఒక్క మంచి మాట చాలు, చచ్చిపోయిన మనిషిని మృత్యులోకంనుంచి తీసుకొచ్చి ప్రాణం పోయడానికి. అలిమన్ విషయంలో అచ్చంగా ఇదే జరిగింది. లేక పోతే, నాకు అలా అనిపించిందా? ఏమో మరి, అది మాత్రం తటాల్న మునుపటి అలిమన్ కింద, యుద్ధానికి ముందురోజుల అలిమన్‌కింద మారి పోయింది. దానిలో వున్న ప్రతీదీ జీవంతో కళకళ్ళాడింది. దాని నోట నుండి వచ్చిన ప్రతీ మాటా, దాని ముఖాన మెరసిన ప్రతీ చిరునవ్వూ,

దాని ప్రతీ చలనమూ – అన్నీ మళ్ళీ వెనకట్లానే వున్నాయి. తన పాట్టి కోటును పొలం గట్టుమీద గిరవాటేసి, పరికిణీ పైకి దోపుకుని, జాకెట్టు చేతులు వెనక్కి మడుచుకుని, తలరుమాలు బాగా ఎగసందోసుకుని, మంచి నేర్పుతో ఎడ్లను పోనిచ్చింది.

''హేయ్, తెల్ల గొడ్డూ! నడవ్వే-నడు! హేయ్, బక్కగొడ్డూ, నువ్వే, నడవ్వే-నడు!'' అని వాటిని పొడుగాటి కొరడాతో చురుక్కున తగిలిస్తూ, వాటిని కేకవేస్తూ తోల్తూంది.

నేను కాస్త సంతోషంగా వుండాలనీ, పనిలో పడిపోయి రోజులు వెళ్ల బుచ్చుకోవాలనీ అలిమన్ ఆశించింది. అందుకోసమనే ఆనాడు, మరపురాని ఆనాడు, ఆమె అలా నడచుకుంది. నాగటి ఎడ్లని తోల్తూ, వెనక్కి తిరిగి, నవ్వుతూ, నాతో అంది:

''అత్తయ్యా, మేడితోకలు కాస్త తెలికగానే అదుము. లేకుంటే రాళ్లు పైకి వచ్చేస్తాయి. ఎందుకేమిటి ఊరకనే అలసిపోవడం మీరు!''

మరో రెండు మూడు దుక్కులు పట్టితే తోట దున్నడం పూర్తి అయిపోను, కాని ఇంతలో వాన మొదలైంది. జలజల చప్పుడుచేస్తూ, సరదాగా వుంది వాన. తొలుత వాన ఎడ్ల వీపుమీద అక్కడా అక్కడా చిలకరించడం మొదలెట్టి, తర్వాత మనసు మార్చుకుని, సన్నని చినుకుని నృత్యం చేస్తూన్న ధారలుగా దిగివచ్చి, ఆటాడి, చప్పట్లు చరచి, ఒక్క నిముషంలో గ్రామం అంతనీ తడిపిముద్దచేసేసింది. కోళ్లు కురకురమంటూ రెక్కలు చాపుకుని కోడిపిల్లల్ని చేరదీసుకుని పరుగెత్తాయి. పెరళ్లలో ఆరుతూన్న బట్టలను దండేలమీదనుంచి ఊడబెరికి ఆడంగులు కూడా ఇళ్లల్లోకి పరుగెత్తారు. చెంగుచెంగున పిల్లలు వీధిలోకి పరుగెత్తారు. కుక్కలూ పరిగెత్తాయి. పిల్లలు వీధిలో గంతులేస్తూ, వానలో హడావుడిగా పరుగులుతీస్తూ, పాట పాడారు:

> వానా వానా, ఉండుండూ, చెల్లప్పా,
> నీతో నన్నూ ఎత్తుకువెళ్ళూ, ఎల్లప్పా....

''తడిసిపోతున్నాం! సరుగెత్తుదామే ఇంట్లోకి!'' అన్నా అలిమన్‌తో.

కాని అది తలకాయ వూపింది:

''ఏం ఫరవాలేదత్తయ్యా! మరేమీ మొక్క మొలచిపోం!'' అంది. అని చిన్నపిల్లల్లా ఫక్కున నవ్వి, గిలిగింతలు పెడుతూన్న వానలోనే, మరింత గబగబా తోలింది ఎడ్లను.

దాని సంతోషం నాకు నచ్చింది. దాన్ని మెచ్చుకుంటూ, దానికేసి కళ్లు ఒప్పగించి, నాతో నేను చెప్పుకున్నా: ''వజ్రంలా మెరసిపోతున్నావే నా తల్లీ, నా వాన తల్లీ! ఎంత హాయిగా వుండి వుండువో కదా నువ్వు! అయ్యో, బతుకా, బతుకు!...'' ఇప్పుడు తెలిసిపోయింది, తను హాయిగా వున్నట్టు అవుపించడమంతా నా కోసమనీ, యుద్ధమూ దుఃఖమూ నేను మరచిపోవాలనీ, బతుకుమీద నాకు మళ్ళీ సరదా పుట్టాలనీ దాని కెంతో వుంది. ఆ పడుతూన్న వానకి తన చేతులు రెండూ చాచి, ముఖం మీద చినుకులు పడేటట్టు తలెత్తి, అంది:

''చూడు, అత్తయ్యా! ఎంత బాగుందో వాన! ఎంత శుభ్రంగా వున్నాయో చినుకులు! ఈ ఏడాది పంటలకి మరి బాధలేదు. ఎ హేయ్, వాన దేవుడా, రావోయ్! కుండపోతగా కురవ్వోయ్, వానదేవుడా! ఎహేయ్!'' అంటూ వానవేపు ఫెళ్లుఫెళ్లున కొరడా పేల్చి, ఎడ్ల జతని వీపుమీద కొరడాతో చరిచింది.

వానలో తడుస్తూ కిలకిల నవ్వింది, తడిసిపోయిన గౌనులో రివటలా సన్నని వొళ్లూ దృఢమైన వక్షోజాలూ గుండ్రని పిరుదులూ, ఆ మెరసి పోతూన్న కళ్లు, ఎర్రని చెక్కిళ్లు — చూడ్డానికి తను ఎంత ముచ్చటగా వుందో తనకే తెలియడంలేదు, పాపం! ఓ పాపిష్ఠి యుద్ధమా, ముచ్చి మూడు శాపాలు పెట్టుతున్నా నిన్ను!

వాన వెలిసి, ఇంకెక్కడో ఆడుకుందుకు పారిపోయేసరికి, అలిమన్ నోట ఇక మాట రాలేదు. దూరంగా వెళ్లిపోతూన్న వానకేసి విచారంగా చూస్తూ, దాని చప్పుడు ఏటి అవతల సన్నగిల్లుతూండడం వింటూ వాన స్తోత్రం

శాశ్వతమా ఏమిటి, అది వస్తుంది, దబ్బున పోతుంది, అని బహుశ ఆలోచించుకుందేమో మరి, అలా నిలబడిపోయింది. విచారంగా నిట్టూర్చింది. కాసీమ్‌ని తల్చుకుందో, మరి ఏమిటి తల్చుకుందో గాని, నా వంక చూసి, మళ్ళీ చిన్న నవ్వునవ్వింది.

''మరి, అడను భాగుంది, నాన పడిందికదా, ఇహ మొక్కజొన్న నాటుదాం!'' అంది. అంటూ ఇంట్లోకి పరుగెత్తింది.

చిన్న బాల్చీలో నానబెట్టిన మొక్కజొన్న విత్తుల్ని బాల్చీ పాళంగా పట్టుకొచ్చింది అలిమన్. ఉబ్బిన గింజలు పెద్దవి పిడికిట నిండా తీసింది బాల్చీలోనుండి.

''అత్తయ్యా, పొత్తులు పాలుపోసుకునే లోపునే జైనాక్ ఇంటికి వచ్చేయాలి!'' అంటూ ఆ తొలి పిడికిటి విత్తుల్ని పొలంలో చల్లింది.

నేను ఎన్నటికీ మరచిపోలేను ఆ రోజు. వానలో తడిసి తెల్లబడిన సూర్యుడు, మబ్బుచాటునుండి, కొత్తగా పుట్టిన బిడ్డలా తొంగి చూస్తున్నాడు. చెమ్మగా నల్లగా వున్న మడిలో అలిమన్ వుత్త కాళ్ళతో నడుస్తూ, చిరునవ్వు నవ్వుతూ అడుగడుగునా గింజలు చల్లుతూ వెళ్లింది. అది చల్లింది ఒక్క మొక్కజొన్న విత్తులే కాదు, నాటితోపాటు ఆశ, శుభం, నిరీక్షణ విత్తులను కూడా చల్లింది.

''ఇదిగో చూడు, అత్తయ్యా!'' అంది గింజలు చల్లుతూ. ''నా మాటలు వూరకనే పోవు. జైనాక్ కోసం లేత పొత్తుల్ని వేడివేడి పొయ్యి నుసిమీద కాల్చి అతడికి ఇవ్వకపోతే అప్పుడను నన్ను! నీకు జ్ఞాపకం వుందిగా, ఎప్పుడూ మేమిద్దరమూ పొత్తులకోసం ఎలా పోట్లాడుకునే వాళ్ళమో. ఓనాడు జైనాక్, నిప్పులమీదనుంచి వేడివేడి పొత్తిని లాగేసి, జుబ్బాకింద దాచేసుకుని పరుగున పారిపోయాడు నా దగ్గరనుంచి. వేడి వేడి పొత్తి పొట్టకి తగిలి చురుకలు పెట్టేస్తూందేమో, గంతులేస్తూ, అదే దొమ్మరాట — తననేదో కాటు కరుస్తూన్నట్టు! ఇహ వేడి భరించలేక, బాల్చీతో బాల్చెడు చన్నీళ్ళు వొంటిమీద దిమ్మరించేసుకున్నాడు. నేనేమో,

పాపం, తనకెలాగో సాయంచేయడంపోయి, విరగబడి అదే నవ్వు నవ్వుతూ, 'నీకంతే పని! నీకంతే పని!' అని ఆ ఒక్క ముక్కే పదేపదే అంటూ అలా నిలబడిపోయా. జ్ఞాపకం వుందా, అత్తయ్యా?'' అంది, ఆనాటి నవ్వుతాలు సంగతి తల్చుకుని నవ్వుతూనూ.

ఇందుకు కూడా దానికి నా ధన్యవాదాలు....

## 14

''అవును, తొల్గొనాయ్, జైనాక్‌కోసం మీరు చాలా కాలమే చూశారు.''

''చాలా కాలమే చూశాం, తల్లీ, భూదేవీ! మొక్కజొన్న పొత్తులు వేసింది, ఒక్క సారి కాదు, రెండు సార్లు కాదు, మూడు సార్లు కాదు — ఐతే ఏం, జైనాక్ మాత్రం రాలేదు. వాడి గురించి ఏ కబురూ లేదు. నీ దగ్గరకి ఎన్ని సార్లు కంట తడిపెట్టుకుని వచ్చి, నా దుఃఖాన్ని నీతో పాలుపంచుకున్నానో నీకూ జ్ఞాపకమే వుంటుంది....''

''అవును, ఎన్నో సార్లు వచ్చావు నువ్వు నా దగ్గరకి, తొల్గొనాయ్. వచ్చి, ఏడ్చావు: నా కోడలిమాట ఏమిటి, పడుచు పిల్ల, బతుకంతా అలా పాడుచేసుకుంటూంది, ఏమిటి చేయడం, అని అడిగావు నన్ను. నేను నీకేమీ సాయం చేయలేకపోయాను, తొల్గొనాయ్. నాటికీ నేటికీ ఎన్నో ఏళ్లు గడ చాయి, ఐనా ఇప్పటికీ నేను ఏమీ చెప్పలేకుండానే వున్నాను.''

## 15

జీవితం దాని మటుకది సాగింది, సమష్టిక్షేత్రమూ కాస్త మెరుగు కాసాగింది, బతుకులూ బాగుపడ్డాయి, యుద్ధ స్మృతులూ వెలవెలపోవడం మొదలెట్టాయి, దాని జాడలు మనుషుల మనస్సునుండి చెరిగిపోతున్నాయి.

నేనూ అలిమానూ సమష్టిక్షేత్రంలో పనిచేస్తూనే వున్నాం. యుద్ధ శ్రేణినుంచి సైనికులు రావడంతోనే మేస్త్రీ పని యువకులకి ఒప్ప జెప్పేశాను.

''మూడేళ్లు మేస్త్రీ పని చేస్తున్నాను, ఆ బాధలేవో పడ్డాను, ఇహమీరిప్పుడు వచ్చారు కదా, ఆ బాధలేవో మీరే పడండి'' అన్నా కుర్రా ళ్లతో. ''నన్నిక వదలిపెట్టేయండి, నాకూ ఏళ్ళు పైబడ్డాయి, ముసలి దాన్ని అయిపోయా. ఐనా, మీకు సాయంచేస్తూంటా లెండి.''

ఆనాటి కుర్రాళ్లందరూ ఈనాటికికూడా నన్ను ''మేస్త్రీగారు'' అనే పిలుస్తారు, నా మీద వాళ్లకింకా గౌరవం వుందన్నమాటే మరి....

జీవితం మళ్ళీ మామూలు దారిలో పడినా, నాకూ అలిమనుకీ మన స్తిమితం లేకపోయింది. అలా అని ఎవ్వరూ పోల్చుకోకపోయినా, లోలోపల మాత్రం నిరంతరమూ మహా బాధపడిపోయాం, నిరంతరమూ ఆ ఒక్క సంగతి గురించే ఆలోచిస్తూండేవాళ్లం. చూడ్డానికి మొదట, ఏం పెద్ద కష్టముంది గనుక, ఇద్దరం ఓ నిముషం కూర్చుని మనసు విప్పి, మనసులో వున్న నాలుగు మాటలూ: ఇదిగో, సంగతులు ఇలా వున్నాయి, ఎవరి దారిని వాళ్లం పోవడమే మంచిది, ఎవరు బతుకు వాళ్లమే బతుకుదాం — అను కుంటే తీరి పోతుందికదా అని అనిపిస్తుంది. నిజంగా ఇలా మాటాడు కునే మాటుంటే ఇదెంతో సులువైనదే. అలిమన్ కాకుండా మరెవరైనా నా కోడలై వుంటే, నా దగ్గర అంత చేరికలేక నేనంటే అంత ఆపేక్ష పడకుండా వుండిన కోడలే అయివుంటే, మరొక్క క్షణమైనా ఆలోచించ కుండా: ఇదిగో చూడు, నీకూ ఏళ్లొస్తున్నాయి, ఇక ఆలస్యం కాకుండానే ఎవడ్నో చూసి పెళ్లిచేసుకుని, నీ దారంట నువ్వు వెళ్లిపో, అని కుండ బద్దలు కొట్టినట్టు ముఖంమీద చెప్పేసి వుండేదాన్ని. కాని, దానితో, అలిమన్‌తో ఈ మాటలనడానికి నాకు నోరొచ్చింది కాదు. ఏమంటే, ఆ మాటల్ని ఎంత ఆచి తూచి, ఎంత ఎంచి మృదువుగా చెప్పినప్పటికీ, వాటిలో వున్నది — మొరటైనదీ కటువైనదీ, ఒకటే భావం. దానికి వెళ్లిపోడానికి ఇష్టం

లేనప్పుడు దాన్ని తోలేయడానికి నాకు హక్కులేదు. ఓమాటు కయిండీ నుండి దాని బంధువులు ఎక్కడకో మా గ్రామంమీదుగా వెళ్తూ, మా యింటికొచ్చారు. మనసు తృప్తికని నేను చెప్పలేక చెప్పలేక దాని పుట్టింటి వారుకదా అని వాళ్లతో చెప్పాను, అలిమన్ స్వతంత్రురాలనీ, ఎప్పుడుపడితే అప్పుడు అది నా దగ్గరనుండి వెళ్లిపోవచ్చనీ, దానిని ఆశీర్వదించి పంపించేందుకు నేను సిద్ధమే అనీ. కాని నా మాటలకి అలిమన్ ఎలా అడ్డుపడిందంటే, నా గురించీ దాని గురించీ కూడా ఇహ నేను చిడిముడిపడిపోయి, ఆ పరాయివాళ్ల ముఖం చూడలేకపోయాను. ససేమిరా ఆ వూసే ఎత్తడానికి వీల్లేదనేసింది, ఇది నా వ్యవహారం, నాకూ ఓ బుర్ర అంటూ వుంది, వెళ్తే వెళ్తాను, ఎప్పుడు వెళ్తానో అప్పుడు వెళ్తాను, వెళ్లకపోతే వెళ్లనే వెళ్లను, అది నా యిష్టమూ నా చిత్తమూనూ. నా వ్యవహారంలో ఎవ్వరూ తల దూర్చక్కర్లేదు అని కసిరేసింది. నేనే విచారపడ్డాను తర్వాత, తొందరపడిపోయానే అని. దాన్ని చూడలేక ముఖం చాటుచేసుకున్నాను. తెలివైన పిల్ల, నా ముద్దు తల్లి, అది అంతా అర్థం చేసుకుంది, అక్కడికి ఏమీ జరగనట్టుగానే జరిగిపోయిన దానిగురించి పల్లెత్తుమాటైనా అనలేదు. అలాగే బతుకులు సాగించాం ఇద్దరమూనూ. నామీద అదీ, దానిమీద నేనూ, ఒకరిమీద ఒకరం జాలిపడుతూ, జైనాక్ మళ్ళీ ఇంటికి వస్తాడనే ఆశపెట్టుకుంటూనూ. ఆ తర్వాత ఏముంది, ఆ ఆస కూడా పేరాస అనే తేలిపోయేసరికి, రోజులు గడచిపోయాయి ఇహ అప్పటికే చెయ్యి జారిపోయింది.

అదంతా ఎలా జరిగిందో నాకే తెలియదు. మా గ్రామం గొడ్లమందలు వెళ్ళే రోడ్డుమీద వుంది. అనాదినుండీ పసులవాళ్లు ఈ రోడ్డువెంటే పశువులు తోలుకెళ్ళేవారు — వసంతకారులో కొండల్లోకీ, శరత్తులో కొండల్లోనుంచి స్టెప్‌మైదానంమీదకీ. పసులవాళ్లు మా గ్రామంలో నాల్గైదు పూటలు మజిలీ చేయడం కూడా కద్దు. వాళ్ళూ బడలిక తీర్చుకునేవారు, మందలూ సేదతీర్చుకునేవి.

పందొమ్మిదివందల నలభై య్యారు శరత్తులో పొరుగు గ్రామం యువకుడు పసులకాపరి ఒకడు తన మందను ఎండు లోయలోనుండి పచ్చికబీళ్ళకి తోలుకుపోతూ మా గ్రామంలో ఆగాడు. అతడు ఇంకా వేసుకున్న ఆ బూడిదెవన్నె యూనిఫారమూ, అతడు ఇంకా స్వారి చేస్తున్న ఆ ముచ్చటైన గుర్రమూ, బుజాన వేలాడుతూన్న ఆ రైఫిలూ, జీనుకి కట్టిన ఆ గొర్రెబొచ్చు కోటూ — ఆ వాటం చూస్తే మాజీ సైనికుడని తెలిసిపోతూంది. తరుచు అతడు గుర్రాన్ని దౌడుతీయిస్తూ గ్రామంలోనుంచి వెళ్తూండేవాడు. సరే, ఎవడోలే, ఎవరో ఏవో పనులమీద ఈ దారంట వస్తూంటారు వెళ్తూంటారు, లెఖ్ఖేమిటి, అని నేనేమంత పట్టించుకోలేదు. వాడెవడో మనిషి పోలికేనా నాకు తెలీదు.

ఆ శరత్తులో గ్రామంలో చాలా పెళ్ళిళ్లు జరిగాయి. ఎవరో ఒకతడు తనకొడుకు పెళ్లి సందర్భంలో, గుర్రపు స్వారిచేస్తూ 'మేక వేట' ఏర్పాటు చేశాడు. ఈ పసులకాపరి మంచి నేర్పరి రౌతు ననిపించుకున్నాడు. అలి మనూ నేనూ పెళ్లికి వెళ్దామని సిద్ధమౌతున్నాం. అలిమన్ బట్టలు వేసు కుంటూంది, ఇంతట్లో వీధిలోనుంచి ఝూమని గుర్రం పరుగెత్తుతూన్నట్టు చప్పుడై, గభాల్న మా గేటుగుమ్మం ఎదుట దుబ్బుమని పెద్ద చప్పు డైంది. అదేమిటో చూదామని గుమ్మంలోకి పరుగెత్తాను. ఆ గుర్రాన్ని స్వారిచేస్తూన్నది ఈ గొడ్లకాపరే. గుర్రం రెండు కాళ్ళూ పైకెత్తేసి నృత్యంచేస్తూ అందంగా దాట్లు వేస్తూంది, కమిచీని పళ్లతో కరచి పట్టుకుని, జుబ్బా చేతులు వెనక్కి మడుచుకుని, జీనుపై కూచున్న రౌతు మంచి అందంగా మహా షోకుగా కనబడ్డాడు. మేక కళేబరం సరిగ్గా మా గేటుముందర పడి వుంది. వేటలో గెల్చిన వాడు ఆ కళేబరాన్ని తన కిష్టమొచ్చిన గుమ్మంలోకి గిరవాటు వేసేయ్యొచ్చు. అదేమిటో మరి, అదంతా చూసి నేను తబ్బిబ్బుపడిపోయి, ఏమనడానికీ నాకు తోచింది కాదు.

''ఏమిటి ఆలోచిస్తున్నావు, నాయనా?'' అన్నాను ఆ రౌతుతో. ఏమీ అనుకోకుండానే ఆ మాటలు నా నోటనుండి జారిపోయాయి.

''ఎవరున్నారు ఇంట్లో?'' అని అడిగాడు ఆ రౌతు.

''ఎవరు కావాలి నీకు?'' అన్నా.

ఏదో పొరపాటు అయిందన్నట్టుగా అతడేదో గొణుక్కుని, నేలమీద పడున్న మేక కళేబరాన్ని చటిక్కున పట్టుకుని, గుర్రాన్ని గిర్రున తిప్పి, దౌడుమీద వెళ్లిపోయాడు. ఇంతట్లోకి అతడిని వెంబడించుతూ కడమ రౌతులు అతడి వెంటపడ్డారు. ఇదీ జరిగినదంతా. ఇది జరిగిన తర్వాత అతగాణ్ణి మరి నేను ముఖాముఖీ కలుసుకోనే లేదు. అప్పుడు మాత్రం నాకు మనస్సు బాధించినట్టయింది. ఏమంటే, ఎవరి ఇంటిముందు మేక కళేబరం పడివుంటుందో, ఆ యింటివాళ్లకి అది చెందడం రివాజు. ఇంతకీ పొరపాటున దానిని అతడు అక్కడ పడేశాడా? అలా అవుతే, మేక కళేబరం వీధిలో పడివుండకుండా, సరిగ్గా మా గుమ్మంకిందే ఎందుకు పడివుండాలి? ఏమిటి దీని అర్థం?

అలిమన్ ఇంట్లోనుంచి వచ్చిన తర్వాత అంతా తేటతెల్లమైపోయింది. ఆమె పట్టు దుస్తులు తొడుక్కుని, పువ్వుల శాలువ కప్పుకుంది. నా వంక చప్పున చూసి, చటుక్కున సిగ్గుతో తల దించేసుకుంది.

''వెళ్దాం అత్తయ్యా'' అంది మెల్లగా.

ఆ గొడ్లకాపరి ఇక్కడికెందుకు వచ్చాడో, ఇప్పుడు ఏ మాటా అవసరం లేకుండానే స్పష్టంగా తెలిసిపోయింది. అలిమన్ నీళ్లు తెస్తానని చెప్పి, పెరట్లో కాల్వ నిండుగా వున్నప్పటికీ, కొన్ని రోజులై సాయంత్రం ఏటికి వెళ్తూండడమూ, తిరిగి రావడం ఆలస్యమవుతూండడమూ నాకు జ్ఞాపకంవచ్చింది. మనసులో చాలా బాధపడ్డాను. దాన్ని చూసి నాకు అసూయి పుట్టిందని కాదు — నాకు అసూయి పుట్టిగా పుట్టివుండొచ్చు — కాని, అసలు మరొకటుంది. అలిమన్ ఎల్లకాలమూ విధవరాలుగా వుండిపోకూడదనీ, ఎవరినైనా త్వరగానే చూసుకుని పెళ్లిచేసుకోవాలనీ భగవం

తుడికి నేనే మొక్కుకున్నాను, దానికీ ఈ అదృష్టం పట్టాలని నేనే మన సారా కోరాను కూడా, కాని తీరా ఇప్పుడు నాకు గభాల్న భయం పట్టు కుంది. నా కోడలు కాకుండా నా కన్న కూతురికి పెళ్ళిచేసేయబోతున్నానే, అత్తవారింటికి పంపించేయబోతున్నానే అని ఎంత క్షోభ పడిపోవాలో అంత క్షోభా పడిపోయాను. ఒకవేళ అది పొరపాటే చేస్తోందో, దారంట పోయే ఏ దాసయ్యతోనో అది కొత్త కాపురం ఎలా చేయగల్గుతుందో, అత్తింటి వాళ్ళు ఎలాంటివాళ్లవుతారో, పెనిమిటి ఎలాంటివాడో ఏమిటో అని ఒకటే దిగులుపడిపోయాను. మేం చూడ్డానికి వెళ్లిన పెళ్లివారింట్లో ఆ పెళ్లి అవుతూన్నంత సేపూ, ఇహ అక్కడనుంచి ఇంటికి వచ్చే దోవలోనూ నా తలకాయలో ఇవే ఆలోచనలు.

''అలిమన్, నీకు అతడు బాగా తెలుసునా? మనిషి ఎటువంటివాడు? ఓ, నా చిట్టితల్లీ, అలిమన్, తొందరపడకు సుమా, పొరపాటు చేయకుండా చూసుకో, అమ్మా!'' అని దాన్ని బతిమాలుకున్నా మనసులో. పడుచు వాళ్లిద్దరి మధ్య నేను అడ్డురాకూడదని ఎంతో కోరుకున్నా. నా ఎదుట అలిమన్ సిగ్గుపడకుండా వుండేందుకు నేను ఏమి చెయ్యాలో, తనకు ఏది చేయడం అవసరమని తోస్తుందో ఆ ప్రకారం తాను చేయడానికి ఏ అడ్డూ లేదనీ జాగ్రత్తగా ఎలా తెలియజెప్పాలి? ఆమెకు నా ఆందోళన అవుపడ కుండా వుండేందుకు శాయశక్తులా తంటాలుపడ్డాను. మామూలుగానే పిచ్చా పాటీ కబుర్లు చెప్పేందుకు ప్రయత్నించేదాన్ని, నామీద అనుమానపడ కుండా వుండేందుకనీ, దానిని ఆక్షేపిస్తున్నానని దేవుడు మేలు చేసి, అది అనుకోకుండా వుండేందుకనీ, వేళాకోళాలు ఆడి నవ్వేదాన్ని కూడా. ఇంత జాగ్రత్త పడినప్పటికీ నా మనసులో వున్న ఆందోళనను అది పోల్చుకున్నట్టే కనబడింది.

ఆ సాయంకాలం నీళ్లు తేవడానికని అలిమన్ బాల్చీ తీసుకుని వెళ్ల గానే, నెత్తిమీదనుంచి కొండ దించుకున్నట్టు మనసు కుదుటపడి, నిట్టూ ర్చాను. పోనీ, ఇదీ బాగానే వుంది, అతగాణ్ణే కల్సుకుంటుంది, ఇదీ మంచిదే,

అని అనుకున్నా నేను. కాని అది త్వరగానే తిరిగి వచ్చేసింది. ఏటికి వెళ్ల కుండా, కాల్వకే వెళ్లి నీళ్లు తెచ్చింది.

''అత్తయ్యా, నీళ్లు కాస్తాను, నువ్వు తల రుద్దుకో, నేను సాయం చేస్తా'' అంది, బాల్చీని ఎక్కడ పెట్టాలో అక్కడ పెట్టి.

''ఇప్పుడేం తొందరొచ్చె, అమ్మాయీ'' అన్నా, ''రేపు అంటూ ఒక రోజు వుందిగా. ఐనా ఈ రోజు నువ్వెక్కడికేనా వెళ్ళాల్సివుంటే....''

కాని నా మాటకది అడ్డంపడి:

''రేపు పనికి వెళ్తా, అందుచేత వేళ వుండదు. నీకు సాయంచేసి, తల దువ్వివెడతా ఈవేళ'' అంది.

బాల్చీతో నీళ్లు కాచి, తల రుద్దుకోవడం చేతకాని పసిపిల్లనైనట్టుగా నా దగ్గర హడావుడిపడింది. పులిసిన పాలతో మొదట నా తల రుద్దింది, తర్వాత సబ్బుతో కడిగింది, తర్వాత మళ్ళీ మరోసారి సబ్బుపట్టించి కడిగింది. ఇహ అంతసేపూ అడుగడుగునా గడబిడపడిపోయి, వేణ్ణీళ్లు తొరలించనూ, చెంబుతో తలమీద పోయనూ నానా హడావుడీ పడిపోయింది. మామూలు రోజుల్లో అయివుంటే, నాకు ఓపికపోయి, చికాకేసుకొచ్చి, నన్ను అల్లరి పెట్టక నీ పనేదో నువ్వు చూసుకో అని చెప్పివుండేదాన్నే. కాని ఆ సాయంకాలం ఏమీ అనలేకపోయాను దాన్ని. దానిపట్ల నేనేదో తప్పు చేసినట్టూ, తను అనుకున్న సంకేతస్థలానికి అది వెళ్లలేకపోవడానికి నేనే కారణమైనట్టూ నాకు అనిపించింది. ''అయ్యో, ఇదో బాధ వచ్చి పడిందే. అది వెళ్లినా తీరిపోనే, ఎందుకు వెళ్లిందికాదో మరి?'' అని నేను నామీదా విసుక్కున్నాను, దానిమీదా విసుక్కున్నాను. అది మాత్రం ఎంతో సరదాగానే నా జుట్టు చిక్కుతీసి, దువ్వి, కాస్త విచారంగా అంది:

''అత్తయ్యా, మునుపు నీ జుట్టు ఇంకా వొత్తుగా వుండేది కదూ, అవును మరి, నువ్వూ ఒకప్పుడు పడుచుదానివే!''

నా జుట్టును తన వేళ్లతో మెల్లగా నిమిరి, ముద్దుగా నా ముఖం తడిమింది. నేను మాత్రం తలెత్తలేదు — నా కంట నీళ్లు నిండాయి.

''ఇంకేముంది, ఇహ నాకు వీడ్కోలు చెప్పేస్తుంది'' అనుకున్నా విచార పడుతూ. తర్వాత అది నాకు జడవేసి, తన సందూకాపెట్టెలోనుంచి, ఏనాటినుంచో తానెంతో గారాబంగా దాచుకున్న సెంటుబుడ్డి తీసుకొచ్చింది. ఆ సెంటుబుడ్డి కాసీమ్ కొన్నాడు దానికోసమని. దానినది ఎంతో పదిలంగా జాగ్రత్త పెట్టుకుంటూ వచ్చింది. నాకొద్దు అంటూ నేను లేచాను:

''బాగు బాగు, ఏమొచ్చింది నీకు, అలిమన్! ఆరె భగవంతుడా! నాకెందుకిది? ముసలిదాన్ని నాకు సిగ్గుండొద్దుటే? నలుగురూ నవ్విపోతారు కూడానూ!''

కాని అది వినిపించుకోకుండా, నవ్వుతూ, కిచకిచలాడుతూ, ఆ బుడ్డిలో మిగిలిన సెంటు అంతా నా ముఖానికీ మెడకీ, తలకీ రాసే సింది. రాసేసి, నా దగ్గర నిలబడి, నాలుగు వైపులనుండీ నన్ను పరీ క్షించి, నన్ను కౌగిలించుకుంది:

''చూడు మరి, నా కళ్లకి నువ్వు ఎంత అందంగా ఎంత పడుచుగా కనబడుతున్నావో!'' అంది తన ఆలోచనలకి తనే ముచ్చటపడుతూ.

నాకూ సంతోషంవేసింది. టీ తాగిన తర్వాత, అది అంది:

''ఇహ పడుకునే వేళైంది, అత్తయ్యా. ఉండు, నీ పక్క సర్దుతా.''

ఆ రాత్రి మా ఇద్దరికీ కన్ను మూతపడలేదు. దాని మనసులో మెదలు తూన్న ఆలోచనలతో అది కొట్టుకుపోతూ, తన మంచంమీద ఆ మూల నక్కిపోయి, ఇట్నించి అటూ అట్నుంచి ఇటూ వూరకే వొత్తిగిలుతూంది. ఇహ నా మనస్సంతా దానిమీదనే వుంది. చేత అడవి పూబెండ పూలగుత్తి పట్టుకుని గోధుమ చేలో వున్న కంబైనుదగ్గరకి అది పరుగెత్తి వెళ్ల డమూ, ఆ పూలగుత్తిని కంబైను మెట్లమీద వుంచేసి, మళ్ళీ పెంకెగా ఎలా పరుగెత్తి వచ్చిందో, అంతా నా కళ్ల ఎదుట మళ్ళీ ప్రత్యక్షమైంది. అది కాసీమ్‌ని పట్టుకుని గుర్రంమీద ఎక్కి కూచోనివ్వకుండా నాణ్ణి గుంజడమూ, వాడి చేతుల్ని సరిగ్గా పసిపిల్లలు పట్టుకునేటట్టే ఎలా

పట్టుకుందో నా కళ్ల ఎదుట మళ్ళీ అవుపడింది. మేం రైల్వేస్టేషనుకి వెళ్లడం జ్ఞాపకంవచ్చింది. బండిలో మేము గబగబా వెళ్తున్నట్టే, నా పక్కనే కూచున్న అలిమన్ బుగ్గలు చలికి ఎర్రగా వెలిగిపోతున్నట్టే, దానిమీద అంతా మంచుపొడి పడి, దాన్ని కప్పేసినట్టే కళ్ళకు కట్టినట్టు అనిపించింది అచ్చంగానూ. దాని శాలువకీ, గాలికి ఎగురుతూన్న దాని చెంప పాయలకీ దాని కోటుకాలరుకీ మంచు అంటుకుని, దాని అందాన్ని మరింత ఇనుమడింపజేయడమూ నా కంటి ఎదుట అవుపడింది. అది చేతులు చాచి ''అత్తయ్యా, మన మిద్దరం అనాథలమైపోయాం, అత్తయ్యా! దౌర్భాగ్యులం, విధవలం!'' అంటూ నా దగ్గరకు పరుగెత్తి రావడమూ తర్వాత నా కళ్ల ఎదుట నిల్చింది. తలకి నలుపు రుమాలు చుట్టుకుని, ఎర్రని ట్యూలిప్ మడిలోంచి అది దూసుకుపోడమూ నాకు మళ్ళీ కనబడింది. మమ్మల్నిద్దరినీ బంధించి వేసిన సర్వాన్నీ నేను మళ్ళీ జ్ఞాపకంతెచ్చుకుని, లోయవెంట తన మందల్ని తోలుకుపోతూన్న గొడ్లకాపరితో కలిసి అది వెళ్లిపోతూన్నట్టు తటాలున ఊహించుకున్నాను. అది నాతో అన్నట్టుగా నాకు స్పష్టంగా వినబడింది కూడా: ''అత్తయ్యా, నన్ను క్షమించు, నేను వెళ్తున్నా, నిన్ను మాత్రం తల్చుకుంటూ౦డు, సెలవియ్యి, అత్తయ్యా!'' నిటారుగా వున్న ఏటిగట్టు వెంబడి, దానివెంట పరుగెత్తుతూ, దానికి వీడ్కోలు చెయ్యి వూపుతూ అన్నాను: ''శుభం నీకు, వెళ్లమ్మా! నా చిట్టి తల్లీ! నా బతుకు దీపం ఆరిపోయింది. వెళ్లమ్మా, అలిమన్! నీకు శుభం కల్గాలి, వెళ్ళిరామ్మా, అలిమన్!''... తర్వాత ఆ గొడ్లకాపరిని కేకేశా ''ఓయ్ అబ్బాయ్! దాన్ని జాగ్రత్తగా చూసుకో, నా కోడల్ని సుఖపెట్టు, లేకుంటే నా ఉసురు నీకు తగుల్తుంది సుమా! నానా శాపనార్థాలూ పెట్టేస్తాను సుమా నిన్ను!'' అన్నా. కన్నీటితో తలగడ అంతా తడిసిపోయింది. తలమీద బూర్నీసు కప్పేసుకుని, అలిమన్‌కి ఎక్కడ వినబడిపోతుందో అని మెల్లగా ఏడ్చాను.

మర్నాడు అలిమన్ పనినుండి వచ్చేసి, ఎక్కడికీ వెళ్లకుండా ఇంట్లోనే

వుండిపోయింది. సాయంకాలమంతా వీధిగడపేనా తొక్కలేదు. ఆతర్వాత ఆ గొడ్లకాపరి మంద తోలుకుపోయి మరి ఇటుపక్క రాలేదు. అలిమన్ పాపం బాధపడి దిగులు పడినట్టు అవుపడింది.

''నా గురించి ఏమీ అనుకోకుండా, వాడిమీద నీకు మోజు కుదిరి వుంటే, వెంటనే వాడితో నువ్వు వెళ్లిపోయుండాల్సింది'' అని నేను మనసులో చివాట్లు పెట్టాను దాన్ని, తర్వాత మళ్ళీ జాలిపుట్టి: ''అయ్యో, ఎంత దురదృష్టవంతురాలవే! ఇంత బాధ అనుభవించడానికి, ఏం తప్పు చేశావని నీకు ఈ జన్మ వచ్చిందే, నా తల్లీ!'' అని ఏడ్చా. ఇలాగే వెళ్ళాయి రోజులు, ఆనాటికానాడు అలా అలా అంతా మరపున పడిపోయింది.

మరచపేడు వసంతకాలం తొలిరోజుల్లో ఆ గొడ్లకాపరి మళ్ళీ మా గ్రామంలో అవుపడ్డాడు. పచ్చికబీడులో అతగాడి గొర్రెల మంద మేస్తూంటే, అతడి ముఖం పోలికపట్టా. ఇహ మళ్ళీ మొదలైంది – సాయంకాలం అలిమన్ ఇంటినుంచి వెళ్లడమూ, రాత్రి ఆలస్యంగా ఇంటికి రావడమూనూ. నేనేమీ అనలేదు. దాని కర్మ అదే స్వయంగా నిశ్చయించుకోవాలి కదా మరి.

ఓనాడు రాత్రి బాగా పొద్దుపోయింది, అలిమన్ ఇంకా రాలేదని, దాని కోసం మేలుకొంచున్నాను నేను. గ్రామం అంతా నిద్రపోతూంది. దీపం తగ్గించేసి, ఇహ నేనూ మంచంమీదకెళ్లి పడుకున్నా, కాని నిద్ర పట్టలేదు. కడుపులో దిగులుగా వుంది, మనసులో భారమనిపించింది. అలిమన్‌కోసం కనిపెట్టుకుని, వీధిలో ఏ పిసరు అలికిడి అయినా అలా చెవులు రిక్కించి వినేదాన్ని. ముంగిట చందమామ అవుపడుతున్నాడు, అప్పటప్పట మబ్బుతో దోబూచులాడుతున్నాడు, వసంతకారు ప్రశాంతంగా వుంది. చలినుంచి కాదు కాని, ఒంటరితనపు దిగులువల్ల నా వొళ్ళు గజగజ వణికి పోయింది. గొర్రెబొచ్చు కోటు పైమీద పడేసుకుని, కునుకుపాట్లు పడ్డాను. తర్వాత అదేమిటో భయంవేసి తెలివొచ్చేసింది. లేచి చూసేసృటికి, అలిమన్ గుమ్మంలో నిలుచునుంది. దాని గౌను గుండీలన్నీ ఊడబెరికేసి వున్నాయి, గుండెలు నగ్నంగా అవుపడుతున్నాయి, జుట్టు చింపిరిగా వుంది, కళ్లలో

కళలేదు. అది తాగి వుండగా నేను చూడడం ఇదే తొలిసారి. గడప దాటింది, తూలిపోతూ జోగిపోతూనే వుంది, కాని పడిపోకుండా పొయ్యిగూడు పట్టుకుని, తల పంకించింది. నా వొళ్లు గగురు పొడిచింది.

''ఏమిటలా చూస్తున్నావ్?'' అంది తల పైకెత్తి. ''ఎందుకలా చూస్తావ్ నా వంక? అహా, నేను తాగాను. అవును, వోద్కా తాగాను. అంతకంటె నా కింకేమిటుంది? నేను కాకపోతే ఇంకెవరు తాగేది? ఏం చెప్పు మరి? మాటాడవేం?''

నా వొళ్లంతా తిమ్మిర్లు కమ్మేసింది, నోట మాట పెగల్లేదు. కోడలికి పట్టిన గతి చూసి నాకు హడలేసిపోయింది. పొయ్యిగూడు పట్టుకుని అలానే నిలబడిపోయింది అలిమన్. తల దించేసుకుని, తటాల్న బొంగురు గొంతుతో గొణిగింది:

''అత్తయ్యా, నీకేమీ తెలీదు. మరి నేనా — నేను, నేను — ఈవేళ.... నీకు జ్ఞాపకం వుంది కదూ, కాసీమ్‌కి మనం వీడ్కోలు ఇచ్చినప్పుడు, మనం ఏటికి వెళ్లాం. సరిగ్గా అక్కడ....'' అని, మరి ఆ మాట పూర్తిచేయడం మానేసి, కెవ్వున కేక వేసింది, రెండు చేతులతోనూ తల పట్టుకుని, కింద పడిపోయి, బోరున ఏడ్చేసింది.

ఇహ అప్పటికి నాకు స్మారకం వచ్చింది. చప్పున దాని దగ్గరకెళ్లి, దాన్ని పట్టుకుని, లేవదీసి, గుండెలకి హత్తుకున్నాను:

''ఏమిటి జరిగింది, అలిమన్? ఎందుకలా ఏడుస్తున్నావు? చెప్పు, మరేం ఫర్వాలేదు, నాతో చెప్పు, ఏమిటి నీ బాధ? నిన్నెవరేం చేశారు? లేకపోతే — నేను ఏదేనా చేశానా? నేనే ఏదేనా చేసి వుంటే, నీ కడుపులో వున్నదేదో పైకి కక్కేయ్....'' అన్నా.

''అదేమీ కాదు, అదేమీ కాదు, అత్తయ్యా! అమ్మా!'' అంటూ గుక్క తిప్పుకోకుండా అదే ఏడ్పు ఏడ్చేసింది. ''అయ్యయ్యో, నీ కెంత కష్టం తీసుకొచ్చానో, నువ్వెంత దురదృష్టవంతురాలవే, నువ్వెంత ఒంటరి దానివి కదా, అయ్యో, నా తల్లీ! నీకు ఏ సంగతీ తెలియదే.... తెలిసి

వుంటే మాత్రం ఏంచేయగల్గి వుందువు? అయ్యో, అయ్యో, అత్తయ్యా! నా తల్లీ, నా తల్లీ!'

నామీద పడి, కన్నీటితో తడిసిన ముఖంతో నన్ను కౌగలించుకుని, ఎంతో సేపు అలా ఏడ్చింది. తర్వాత కొంతసేపటికి కాస్త కుదుటపడి, ఇహ అప్పుడు నిద్రపోయింది. కాని నిద్రలో కూడా అలా ఏడుస్తూనే వుంది, విచారంతో నిట్టూర్చుతూనే వుంది. తెల్లవారే వరకూ దాని మంచందగ్గరే కూచున్నాను నేను ఆలోచిస్తూ: మీదటికి ఏమవుతుంది? ఏమి చేయడం? దానితో మంచీ చెడ్డా నాల్గుమాటలూ అనేయడానికే నిశ్చయించుకున్నాను. పొద్దున్న లేచింది, కాని నాతో అది ఏమీ మాట్లాడింది కాదు. దాని స్థితి అంత అధ్వానంగా వున్నప్పుడు, ఇహ ఇది కూడానా అనిపించింది నాకు. రాత్రి జరిగిందేదో జరిగిపోయింది, దాని గురించి మళ్ళీ రేపకూడదు అని దాని కళ్ళు నన్ను నిశ్శబ్దంగా బతిమాలుకున్నాయి. పనిలోకి వెళ్ళడానికని మేం మా గేటులోంచి వెళ్తూన్నప్పుడు, అది నాతో మెల్లగా అంది:

''అత్తయ్యా, నన్ను క్షమించు.''

దాన్ని మరి కలతపెట్టడం నాకిష్టం లేకపోయింది.

మూడు నెలలు గడచిపోయాయి. సైన్యంనుంచి పరారి అయిన జెన్‌షెన్‌కూల్ విషయమై ఆ వేసవిలో దర్యాప్తు జరిగింది. యుద్ధం అయిపోయినాక ఇహ అతగాడు గ్రామంలోకి బాహాటంగా వచ్చేసేందుకు మరి దమ్ములేకపోయాయి, కాని రాత్రిళ్లు మాత్రం దొంగచాటుగా వచ్చి ఇంట్లో వుండేవాడని తెలిసింది. కజాఖ్‌స్థాన్‌లో ఎక్కడో దాగుంటూ, చీకటి బజారు వ్యాపారం సాగిస్తూ, దొంగతనంచేసి ఎత్తుకుపోయిన పశువులను కొంటూ అమ్ముతూ కాలక్షేపం చేస్తూండగా, పట్టుబడిపోయాడు. ఇహ దానితో అతగాడి వెనుకటి కథ అంతా బయటపడేసరికి, మా గ్రామం తీసుకొచ్చారు, సాక్షులచేత గుర్తుపట్టించడానికని. గ్రామ సోవియట్‌నుంచి నాకు కూడా కబురొచ్చింది:

''సాక్షిగా నిన్ను రమ్మనమంటున్నారు'' అని.

నేను వెళ్లాను. అలిమన్ వీధిలో ఎదురైంది. పనినుండి ఇంటికి వచ్చేస్తూంది. అందరితోనూ కలవకుండా తన మటుకు తను ఒక్కర్తే వచ్చేస్తూంది. అలసిపోయి, ముఖం వేలబడిపోయుంది. ఆ వేసవికాలంలో దాని ముఖం ఎండిపోయి పచ్చబడిపోయింది. దాన్ని చూసేసరికి నాకు మహా జాలివేసి, తను ఇంట్లో ఒంటరిగా వుండడమెందుకని దానితో

''రావే, చిట్టీ, నాతో రా, ఇద్దరం కలిసి వెళ్దాం ఆఫీసుకి. కలిసి మళ్ళీ ఇంటికొచ్చేద్దాం.''

''వొద్దు, అత్తయ్యా. అక్కడకి నేనెందుకు? నేను ఇంటికి పోతాను, తల నొప్పిగా వుంది'' అని జబాబు చెప్పింది.

''ఐతే, ఇంటికి వెళ్లు'' అన్నా. ''వెళ్లి పడుకో నెమ్మదిగా. నే వచ్చి ఆవుపాలు పితుకుతా.''

గ్రామ సోవియట్ ఎదుట మోటారు వాన్ ఒకటి నిలబడుంది. సాక్షులుగా రప్పించిన జనంతోనూ, పనులు చేసుకుని ఇళ్లకు వెళ్లిపోతూ దారిలో అక్కడ కూడిన మనుషులతోనూ మొగసాల తొడితొక్కిడిగా వుంది. జెక్ షెన్‌కూల్‌ని చాలా కాలమై చూడ్లేదు నేను, చూసి రమారమి ఏడేళ్ల వుతుందేమో. ఆ పాడు బతుకు ఆ మనిషికి బాగా ఒంటపట్టినట్టే వుంది. మనిషి నిక్షేపంలా వున్నాడు, దుండుగా వొళ్లుచేశాడు. కిటికీ దగ్గర బెంచిమీద కూచున్నాడు. ముఖం దుమదుమలాడుతూ, మండిపడుతోంది. ఎవరో అడిగిన ప్రశ్నకి కస్సుమని జబాబుచెప్పాడు:

''నన్ను దొంగ అంటున్నావా? మరి, నేను దొంగతనం చేస్తూండగా నీ చేతుల్తో నన్ను పట్టుకున్నావా, నీ కళ్లతో నన్ను చూశావా? లేదు! అంచేత అనవసరంగా నోరు పారేసుకుని నింద వెయ్యకు. వెయ్యి చెప్పినా, లక్ష చెప్పినా అన్నీ వుత్తుత్త కబుర్లే. సాక్ష్యం వుండాలి, సాక్ష్యం వుంటే తీసుకురండి!''

ఈ మాటలు నా చెవిబడ్డాయేమో, వీధిలో వున్నదాన్నలా, కిటికీ తలుపు బార్లా తెరచి, వీధిలోనుంచే కేకపెట్టా:

''అబద్ధాలాడుతున్నావ్, తుచ్ఛుడా! సాక్ష్యం కావాలంటున్నావు కదూ — ఇదిగో, నేనూ సాక్ష్యం!''

''అమ్మా! మీరిలా లోపలికి రాండి'' అన్నాడు దర్యాప్తు చేస్తూన్న ఉద్యోగి, బల్లదగ్గర కూచున్నవాడు లేచి నిలబడి.

నేను లోపలికెళ్లి, వెంటనే అన్నా:

''అవును, నువ్వు కన్నంలో వుండగా నిన్ను మేం పట్టుకోలేదు. నీ వెంటపడి నిన్ను వేటాడ్డానికి మాకు ఏనాడూ వ్యవధిలేకపోయింది. ఆ రోజుల్లో వుత్త చేతుల్తో దున్నాం పొలాల్ని, పండించిన గింజ అంతా యుద్ధశ్రేణికి పంపించేశాం. కింద పడిపోయిన కంకులు ఏరి పోగుచేసి మరీ తిండిపెట్టాం పిల్లలికి. మరి నువ్వా? నువ్వేమో మా గుర్రాల్ని తోలుకుపోయావు. నా గతిని అశక్తం చేశావు. పసిపిల్లలకి బువ్వైనా పెట్టకుండా ఒక్కొక్క గింజా ఒక్కొక్క గింజా ఏరి పోగుచేసుకున్న మా ఆఖరి విత్తనాల్ని మా దగ్గరనుండి నువ్వప్పుడు కాజేశావు. అంటే దాని అర్థం, నువ్వు మాకు శత్రువయ్యావు. మరి నిన్ను నేను వెంబడించి 'ఆగు, నువ్వు ఎవరో నాకు తెలుసు! నువ్వు జెన్‌షెన్‌కూల్‌వి, ఆగు!' అని కేకేశా. నువ్వు వెనక్కి తిరిగి నామీద తుపాకి కాల్చావ్. ఇదీ, నువ్వు కావాలన్న సాక్ష్యం!''

అలా అనేసి, నేను వూరకున్నా. దర్యాప్తు చేస్తూన్న ఉద్యోగి అన్నాడు:

''అమ్మా, మీకు ధన్యవాదాలు, మీరిక వెళ్లిపోవచ్చు, అమ్మా.''

గ్రామ సోవియట్ ఆఫీసులోనుంచి పైకి వచ్చానో లేనోలేదో, జెన్‌షెన్‌కూల్ పెళ్ళాం గభాలున గుమ్మంలోకి ఒక్క దాటున వచ్చింది. ఏదో దయ్యం పట్టిన దానిలా శివాలెత్తుతూ నా మీద విరుచుకుపడి:

''ఓసీ, నువ్వటే ఒంటి పిల్లి రాకాసా! రేచుకుక్కలా సత్తెం కోసమటే నువ్వు వూరూ వాడా వెదుకుతున్నావు? సత్తెమే నీకు శాస్తి చేస్తుందే.

నీకు అంతే కావాలే! అయినది చాల్లేదు నీకు, ఇహ ఏడుస్తావులేవే. ఆ కడుపు ఎక్కడ చేసుకుందే నీ కోడలు? చెప్పవేమే? నీ మొహం ముందే ఆ ముండ రంకుపోయిందే, నువ్వేమో సత్తెంకోసం రేచుకుక్కలా వూాయూ వాడా దేవు ళ్ళాడుతున్నావే. ఇప్పుడు ఇద్దరూ కలిసి వెదకండే రేచుకుక్కల్లా వూరూ వాడానూ. సిగ్గులేని మొహాలా!'' అని గొంతుక చించుకుని బొబ్బరించింది.

నలుగురూ వచ్చి, నా మీద పడుతూన్న ఆ మనిషిని రెక్కపట్టుకుని ఓ మూలకి లాగేసి, నోరు మూసేశారు. కాని వాళ్లతో నేనన్నా:

''ఆ మనిషిని వదిలేయండి, ఏమీ చేయకండి!'' అలా అనేసి, నేను ఇంటికెళ్లిపోయాను.

మరి, రోడ్డుమీద నిప్పులా కాల్తూన్న ధూళీ దుమ్మూ వల్లనో, మరి సిగ్గుతో కాలు మాడిపోతూండడం వల్లనో, మొదట మాత్రం ఇహ నిలబడకుండా ఒక్క పరుగు పరుగెత్తా. తర్వాత మెల్లగా అడుగులో అడుగు వేసుకొంటూ, పరిపరి విధాల పోతూన్న ఆలోచనలను కూడదీసు కుంటూ నడిచాను. అలాంటి ఆలోచనే ఎన్నడూ నా మనసులోకి రాలేదు, ఐనా నేను కాస్త పోల్చుకోవలిసే వుండాల్సింది. ఈ మధ్య కొన్ని వారాలై అలిమన్‌లో అదేదో కొంత చిత్రమైన మార్పే వచ్చింది, వెను కట్లా మాట్లాడ్డమూ మానేసింది, నలుగురితో కలిసిమెలిసి తిరగడమూ లేదు, కొసకి తన నేస్తాల సావాసం కూడా వదలుకుంది. ఆ గొడ్ల కాపరితో తిరగడం సఫలీకృతం కాకపోవడంనుంచే ఇలా వుంది కాబోలు అను కున్నా. ఆ వసంతకారులో అతగాడు కొండల్లోకి మందల్ని తోలుకుపోయాడు, ఇహ దాంతో అతగాడి జాడానీడా మాయమైపోయింది. వాళ్లిద్దరూ ఏదో తగవులాడుకున్నారు కాబోలు, అందువల్లనే అది అలా బాధపడుతూంది అనుకున్నాను. కాని అదంతా మరొకలా మారిపోయిందిప్పుడు. అబ్బ, ఏమి దురదృష్టం పట్టింది! ఐనా ఎవరు అనుకోగలరు ఇలా అవుతుందని? ఏం చేయడమో ఎంత బుర్రకొట్టుకున్నా ఏమీ పాలుపోయింది కాదు నాకు. మరుచటినాడు పొద్దుపోయాక, నన్ను అయ్‌షా తన ఇంటికి రమ్మనమని

పిలిచింది. కాస్సేపు ఆ కబురూ ఈ కబురూ చెప్పుకున్నాక, ఏదో ప్రసంగ వశాత్తూ అంది:

''అన్నట్టు, చెప్పమరచాను, జెన్‌షెన్‌కూల్ పెళ్ళాం నిన్న రాత్రి వూరునుంచి వెళ్ళిపోయిందిసుమా, ఎక్కడికెళ్ళిపోయిందో మరి.''

నేనేమీ అనలేదు. ఆమె ఎక్కడికెళ్ళితే నాకేం పట్టింది? గంగలో దిగనీ, నాకేం పోయింది, ఎవరి ఇష్టం వాళ్ళది, అనుకున్నా. తర్వాత మరి రెండేళ్ళకి తెలిసింది నాకు, వూళ్ళోవాళ్ళు ఆ రాత్రి జెన్‌షెన్‌కూల్ పెళ్ళాం ఇంటికి వచ్చి, ఇంట్లో వున్న సామాన్లన్నీ ఓ బండిమీద ఎక్కించి: ''నీ చిత్తమొచ్చిన చోటకి నువ్వు దయచేయి అమ్మా, మా గ్రామంలో మాత్రం నిన్ను వుండనిచ్చేది లేదు''—అంటూ రాత్రికి రాత్రే ఆమెను వుళ్ళోనుంచి లేవగొట్టేశారట. ఇది జరిగిననాటినుండి మా దురదృష్టం గురించి పల్లెత్తుమాటైనా మరెవ్వరూ అనలేదు. ఏమో మరి, అలిమన్‌తో లోకులు ఎవరేనా ఏమేనా అంటే అనివుండొచ్చు, పరామర్శించి వుంటే పరామర్శించి వుండొచ్చు కొందరు, దానిమీద జాలిపడితే కొందరు జాలిపడి వుండొచ్చు, నాకు మాత్రం అలాంటిదేదీ అవుపడలేదు, ఇందుకు లోకులకి నేనెంతేనా కృతజ్ఞురాలిని. ఇదంతా జరిగి ఎన్నో యేళ్ళు గడచాయి, ఐనా నన్ను అందరూ వెనుకటిలానే గౌరవిస్తున్నారు.

అలిమన్ కడుపుతో వుందని నాకు తెలిసిన తర్వాత కూడా మా ఇద్దరి మధ్యనూ ఏ మార్పూ రాకుండా, వెనకట్లానే వున్నాం. పనీ పాటూ చేసుకుంటూ, కలిసి ఇల్లు చక్కబెట్టుకునేవాళ్ళం, మంచీ చెడ్డా అనుకునే వాళ్ళం, ఒకరికొకరం సలహా చెప్పుకునేవాళ్ళం, అంతా మునుపటిలాగానే రోజులు వెళ్ళిపోయాయి. తన పురిటి గురించి కాని, పుట్టబోయే బిడ్డ గురించి కాని అలిమన్ ఎన్నడూ మాటాడలేదు. ఏమి మాటాడ్డానికీ ఏమని చెప్పడానికీ మనసు నిశ్చయించుకోలేకపోయిందో, సమయం వచ్చినప్పుడే చెబుదాం, ఇప్పుడెందుకు లెమ్మని వూరుకుందో మరి. దాని అభిమానాన్ని కించపరచడం ఎందుకని ఆ వూసు నేనూ ఎత్తలేదు. అన్నిటికంటే ముఖ్య

మైన సంగతి — నా మనస్సులో దానిమీద నేను ఏ మాత్రం నిష్ఠురమూ వేయలేదు. అందుకు నాకు ఏ హక్కూ లేదుకూడానూ, ఎంచేతంటే దాని బతుకంతా నా కళ్లముందే వెళ్లింది, అంతా నేను చూశాను, అంతా అర్థం చేసుకున్నాను, అంచేత తప్పు నాది కూడానూ. అందుకనే వెంటనే నాలో నేననుకున్నా: అలిమన్ చేసింది గనుక పాపమే అవుతే, ఆ పాపం నాది కూడానూ, దానికి పురుడొచ్చి, దాని కడుపున బిడ్డ పుడితే, ఆ బిడ్డ నా బిడ్డ కూడానూ, ఇహ అందువల్ల వచ్చే అవమానమూ, భారమూ, బాధా నేను స్వయంగా నా మీద వేసుకోవాలి. ఓ రోజు, త్వరగా వచ్చినా ఆలస్యంగా వచ్చినా, వచ్చితీరుతుందనీ, ఆనాడు ఇష్టం వున్నా లేకపోయినా ఈ సంగతి గురించి మాటాడుకు తీరుతామనీ, ఇన్నాళ్ళూ ఈ సంగతి గురించి మాటాడుకోకుండా వున్నందుకు ఆనాడు ఒకరినొకరం క్షమించు కుంటామని నాకూ తెలుసు, దానికీ తెలుసు. ఐనప్పటికీ ఏరోజు కారోజు, ఈవాళనుండి రేపటికీ, రేపటినుండి ఎల్లుండికీ ఆ సంభాషణ వాయిదా వేసుకుంటూనే వచ్చాం. అనుకోకుండా ఓ రోజున ఆ మాట జారాను.

వేసవి ఆఖరి రోజుల్లో, అప్పటికి అలిమన్ ఐదు మాసాల గర్భిణో, ఆరు మాసాల గర్భిణో అనగా ఓనాడు వేకువనే లేచి ఆవుని మందకు తోలుకువెళ్తున్నా. పసులకాపరి కుర్రాడు ఆనాడు మంచి హుషారుగా వున్నాడు, గంటలా గణగణ వాగాడు. మంద మా గేటుగుమ్మం దగ్గర కొచ్చింది. పసులకాపరి కుర్రాడు ఆవుల్ని తోలుకెళ్తూ, నన్ను చూసి, నిండు నవ్వు నవ్వి:

''తొల్గొనాయ్ పిన్నీ, నేనో మంచి కబురు చెబుతా, నాకేమేనా తాయం పెట్టు! జొరొబెక్ తాత కోడలు నీళ్ళాడింది!'' అన్నాడు.

''నిజంగానే? ఎప్పుడొచ్చింది పురుడు?''

''తెల్లవారు జామున.''

''మగపిల్లాడా, ఆడపిల్లా?''

''ఆడపిల్ల, తొల్గొనాయ్ పిన్నీ. భరద్వాజం అని పేరుపెడతారట. ఎందుకంటేనట భరద్వాజపక్షిలా వేకువ జామునే పుట్టిందని!''

''అవును, మహా బాగా వుంది. దీర్ఘాయుష్మంతురాలు కావాలి! మంచి కబురు చెప్పావు, ధన్యవాదాలు!''

పాపం ఈ కుర్రాడు, తల్లీతండ్రీలేని ఈ అనాథుడు, ఎవరో మరో శిశువు జన్మించిందని ఎంత సంబరపడుతున్నాడో కదా అని నా మనసు కరగిపోయింది. నాకూ ఎంతో సంతోషమైంది, ఇంట్లోకి వెళ్ళా. ఇన్నాళ్ళా అహో రాత్రాలూ నేను దేని గురించైతే ఆలోచించుతున్నానో ఆ సంగతి గురించి మరచిపోయాను. అది ఎలా సాధ్యమైందో మరి? ఇంకా గుమ్మంలో వుండగానే కేకేశా:

''అలిమన్! ఈ కబురు విన్నావా? జొరొబెక్ కోడలికి పురుడొచ్చి, కూతురు పుట్టిందట, విన్నావా? పాపం, దానికి పురుడు కష్టంగా వచ్చింది; భగవంతుడి దయవల్ల, తల్లీ పిల్లా....'' మాట కడవెళ్ళా ముగించనే లేదు నేను, సలుపుతూన్న పంటికింద రాయ పడినట్టు, చటుక్కున మాట కట్టుబడిపోయింది.

అలిమన్ ఏమీ అనకుండా, తల వంచేసుకుని పెదవి గట్టిగా కొరుకుతూ అలా స్తంభించిపోయి నిలబడిపోయింది. ఆ క్షణంలో అది ఏమనుకుందో? తనకి పురుడొచ్చి బిడ్డ పుడితే, ఆ కబురు ఇంత సంతోషంగా ఇంటింటికీ ఎవ్వరూ చెప్పరుకదా అనే ఆలోచన దాని మనసులో మెదలిందో ఏమో. నా బండతనం తల్చుకుని నాకు సిగ్గేసిపోయి, భరించ శక్యంకానంతటి వేడిపొగలు వొంట్లోనుంచి పుట్టుకొచ్చేశాయి. దాని వంక చూడ్డానికి నాకు ముఖం చెల్లక, పొయ్యిగూటి దగ్గర కెళ్ళిపోయి, అక్కడ కూచుని, పొయ్యిలో పిడక ముక్కలు వెయ్యడం మొదలెట్టా, పొయ్యి రాజుకుని మండుతూన్నప్పటికీ. కాస్సేపటికి నేను వెనక్కి తిరిగి చూసే ప్పటికల్లా, అలిమన్ ఇంకా అలానే కళ్ళు వాల్చేసి గోడదగ్గర నిలబడే వుంది. దాన్ని చూసి, నాకు జాలివేసి, గుండె పట్టేసినట్టు అయిపోయింది. ఎలాగో బలవంతాన లేచి, దానిదగ్గరకెళ్ళా.

''ఏమి? వంట్లో బాగులేదా?'' అని అడిగాను.

''ఏంలేదు, అత్తయ్యా'' అంది.

''పని ఆయాసమనిపిస్తే, ఇంట్లోనే వుండిపోయి, పడుకో అమ్మా!'' అన్నా.

''అబ్బే, అక్కర్లేదు. అంత ఆయాసమేమీ లేదు, అత్తయ్యా. పొగాకు వేలగట్టడంలో ఆయాసమేమిటుంది గనుక'' అని అంటూ పని లోకి వెళ్లిపోయింది.

ఇకప్పుడు నిశ్చయించుకున్నా, ఇహ నానుపు కూడదని. ఇందులో చిన్న తనం పడాల్సింది ఏదీ లేదనీ, కొత్తగా పుట్టిన పిల్లలందరూ ఒక్కలాగే వుంటారనీ, దాని కడుపున పుట్టిన బిడ్డ నా కడుపున బిడ్డ అనే నేనను కుంటాననీ దానితో చెప్పడం అవసరమని అనుకున్నా. నా బిడ్డల్ని ఎలా సాకానో ఈ బిడ్డని కూడా అలానే సాకుతాననీ చెప్పాలనుకున్నా. ఈ సంగతి అది అర్థం చేసుకుంటుందనే అనుకున్నా. తను ముఖం వేలేసుకోకూడదు, అభిమానంతో బతుకు వెళ్లబుచ్చాలి, నిర్భయంగా మనుషులను ముఖా ముఖీ చూడాలి — మాతృత్వానికి తనకు సంపూర్ణమైన హక్కుందని తను తెలుసుకోవాలి.

ఈ ఆలోచనలతో నేను దానివెంట పరుగెత్తి వెళ్లి, దాన్ని కేకేశాను:

''అలిమన్, ఓ నిముషం ఆగు. నీతో మాట్లాడాలి. ఒక్క క్షణం నిలబడు!''

నా కేక తనకి వినబడనట్టు అది నటించి, వెనక్కి తిరిగి చూడ కుండా వెళ్లిపోయింది.

ఆ రోజంతా మహా బాధ అనుభవించుతూ ఆలోచించా: ''అబ్బే, రేప ట్నుంచి ఇహ ఇలా జరక్కూడదు. సాయంకాలం తప్పకుండా దానితో మాట్లాడితీరుతా. అలా అవుతే నాకూ దానికీ కూడా మనస్సు తేలిగ్గా వుంటుంది.'' కాని నేను అనుకున్నట్టుగా చేయలేకపోయాను. ఎంచేతంటే సాయంకాలం నేను పనినుంచి ఇంటికి వచ్చేసరికి అలిమన్ ఇంట్లోలేదు. దాని కోసం కనిపెట్టుకున్నానే గాని, నాకేమిటో మనస్సు మనస్సులా లేదు,

ఏమిటో దిగులుగానే వుంది. ఇంట్లో లేదే, మరి ఎక్కడున్నట్టు? ఇంత వరకూ ఇంటికి రాకపోవడానికి కారణమేమిటి? దానికోసం వెదకుదామని ఇంటినుంచి బయల్దేరే పరికల్లా, బెక్‌తాష్ అవుపడ్డాడు. వాడు ఓ పెద్ద గడ్డి మోపు పట్టుకుని మాటా మంతీ లేకుండా గేటులోనుంచి దొడ్డిలోకి వెళ్ళాడు. అలాగే మాటా మంతీ లేకుండానే గడ్డి మోపుతో పశువులసాల లోకి వెళ్ళి, తొట్టిలో గడ్డి గిరవాటేసి, ఇహ అప్పుడు నెమ్మదిగా అన్నాడు:

''తొల్గొనాయ్ పిన్నీ, అలిమన్ చెప్పమంది, నువ్వు తనకోసం వెతకొద్దని. కయిండీలో కన్నవారింటికి తను వెళ్ళిపోతున్నానని చెప్పింది.''

నా కాళ్ళు గజగజ వణకిపోయాయి, గడపలో కూలబడ్డాను.

''ఎప్పుడెళ్ళిందది?''

''మధ్యాహ్నం భోజనాలయాక. రెండు గంటల క్రితం. దారంట ఏదో లారీ వెళ్తూంటే, దానిలో ఎక్కి వెళ్ళిపోయింది.''

గుండె చితికిపోయి, అలా కూచుండిపోయాను. మనసు ఎంతగా కుంగిపోయి ఎంతగా అంధకారమైపోయిందంటే, ఇహ చావుగడియలు దగ్గర పడ్డాయనే అనిపించింది. బెక్‌తాష్ నన్ను సంబాళించబోయి:

''ఏం గాభరాపడకండి, తొల్గొనాయ్ పిన్నీ. డ్రైవరు ఆమెను తనపక్క సీటులో కూచోపెట్టుకున్నాడు. లోపల వెచ్చెలా వుంటుంది, అక్కడ బాగానే వుంటుంది'' అన్నాడు.

''ఓ బెక్‌తాష్, బెక్‌తాష్, అంతటిలో సరిపోతే బాగానే వుణ్ణురా సంగతి'' అనుకున్నాను నేను. ఐనా వాడు ఏ కల్లా కపటమూ లేకుండా నన్ను ఓదార్చడానికి ప్రయత్నించినందుకు వాడికి నేనెంతో కృతజ్ఞురాల్ని. అప్పటికప్పుడే వాడు మంచి బలమైన కుర్రాడుగా తయారయాడు. సమష్టి క్షేత్రంలో బండి డ్రైవరుగా పనిచేస్తున్నాడు. పొడుగ్గా, వెడల్పు బుజాలూ వాడూ ఎంత త్వరగా ఎదిగాడో కదా అని వాడివేపు చూసి విస్తు పోయాను. వాడి నడక తీరు, గొంతుక వయసువచ్చిన వాడివే. వాడి ముఖం కూడా నెమ్మదిగానూ స్నేహితంగానూ వుంది. వాడింకా పిల్లగా

డుగా వున్నప్పుడే వాడంటే నాకెంతో ఆపేక్ష, ఇటువంటి గడ్డు గడియలో వాడు నా దగ్గరకి వచ్చాడని నా కెంతో సంతోషమైంది. బెక్‌తాష్ కాళ్ళు కెళ్లి, నీళ్లు తీసుకొచ్చి, సమొవార్ సిద్ధంచేసి, ముంగిట నీళ్లు చల్లి ఊడ వడం మొదలెట్టాడు.

''మీరు తమాయించుకోండి, తొల్గొనాయ్ పిన్నీ'' అన్నాడు వాడు. ''ఆపిల్‌చెట్టుకింద కంబళీ పరుస్తా. అమ్మ ఇప్పుడే వస్తుంది. మీ ఇంట్లో టీ తాగి ఎంత కాలమో అయిందంది. అమ్మ ఇప్పుడే వచ్చేస్తుంది.''

అలిమన్ వెళ్లిపోయిన తర్వాత దినం ఒక యుగంగా గడచింది కాలం. నేను ఒక్కర్తెనే ఒంటరిగా ఈ ప్రపంచంలో బతకాల్సి వుంటుందని ఎప్పుడైనా అనుకున్నానా? అచ్చంగా ఒంటరిగా వుండడమంటే ఏమిటో నాకు తెలియనే తెలియదు. మూడునాల్గు రోజులు ఒక్కర్తెనే గడుపుకొచ్చాను గాని, ఇహ మరి నా శక్యం గాదనిపించిపోయింది. ఇల్లు ఇల్లనిపించలేదు, బతుకు బతుకనిపించలేదు. ఇది భరించడంకంటె ఇలాంటప్పుడు ప్రపంచం మీద అక్కడా అక్కడా గాలిగుడ్డుగా తిరుగుదామనే అనిపించింది. కాని అలిమన్ గురించీ, అది అక్కడ ఎలావుందో ఆ సంగతి గురించీ తల్చుకు నేప్పటికల్లా—ఇహ మరీ బాధ అనిపించిపోయేది. కన్నవారి ఇంట్లో దాన్ని ఆదరిస్తే అదీ మంచిదేకదా, కాని అందుకు బదులు: అప్పుడేమో మా మాటలు వినకపోతివి—నా వూసు మీకెందుకు, నా గతేదో నే చూసుకుంటా, నా వ్యవహారంలో మీరు వేలు పెట్టకండి, అంటివి, మరి ఇప్పుడేమో నలుగురూ మొహంమీద వుమ్మేసరికి, ఒంటికాలుమీద పరుగెత్తుకుని మా దగ్గరకొచ్చి మా అండచేరితివి, ఇప్పుడేమో మేం అక్కరకొచ్చాం నీకు, కదూ, అంటూ వాళ్లు దెప్పి పొడుస్తే, పాపం, అప్పుడేమిటి? ఇలా వాళ్లు అనగలరా? అన లేక పోవడమేమి? అంటారు. అలా అన్నప్పుడు అది అక్కడ ఎలా వుండగల్గుతుంది? అభిమానంగల పిల్ల కదా, ఈ అవమానాన్ని అది భరించ గల్గుతుందా? భగవంతుడు రక్షించి, అది ఏ నుయ్యో గొయ్యో చూసు కోకుండా వుండాలి. ఓ అలిమన్, అలిమన్, నువ్వు నా దగ్గరే వుండి

పోయుంటే బాగుండిపోను, ఆ అవమానాన్ని నా నెత్తిని వేసుకుని నేను భరించివుందునే. నిన్నెవ్వరూ పల్లెత్తు మాటేనా అననిచ్చేదాన్నికానే. ఇలా అన్నీ ఆలోచించుకున్నాను, అంతా ఊహ చేసుకున్నాను. తర్వాత అనుకు న్నాను: ''ఇలా అనుకుని కార్యంలేదు. వెళ్లి అదేదో స్వయంగా తేల్చుకొస్తా. అదేదో కళ్ళారా చూసే వస్తా. దానికి నచ్చ చెప్పేందుకు ప్రయత్నిస్తా, ఏమో, అది వింటుందేమో; విని నాతో ఇంటికి వచ్చేస్తుందేమో కూడా. అది వచ్చేస్తే, ఎంత హాయిగా వుంటుందో కదా. ఒహ వేళ దానికి మరి ఇంటికి రావడానికి ఇష్టంలేకపోతే, పోనీ, అలాగే కానీ, మనమేం చేస్తాం గనుక? సరే అంటూ, అని, దాన్ని ఆశీర్వదించి, నేను ఒక్కర్తెనే ఇంటికొచ్చేస్తా.'' అలా నిశ్చయించుకున్నాను. మరునాడు ప్రయాణానికి సిద్ధమయాను. ఇంటినీ, ఆవునీ అయ్‌షాకి ఒప్పజెప్పాను. ఆ దారంటే వెళ్తున్న ఒక లారీని బెక్‌తాష్ ఆపాడు, దానిలో ఎక్కి, వెనుకతట్టు కూచుని, కయిండీకి బయల్దేరాను.

గ్రామం దాటి మట్టిరోడ్డుమీదనుంచి వెళ్తూండే సరికల్లా, చేలు దుబ్బుల్లోనుంచి, కాలిబాటవెంట ఆడమనిషి నడుస్తూండడం చూశాను. వెంటనే పోలికపట్టేశాను — అలిమన్ అని! నా తల్లి, నా ముద్దు బిడ్డ, నా చిట్టి తల్లి, నా దగ్గరికే, ఇంటికే మళ్ళీ వచ్చేస్తూంది! లోపల కూచున్న డ్రైవరుని గట్టిగా కేకేసి పిల్చా: ''ఆపు! ఆపు! బండి నిలబెట్టు!'' లారీ జోరుగా వెళ్తూందేమో, చప్పున ఆగలేదు, కాస్త దూరం వెళ్లి మరీ ఆగింది. ఆగగానే, నా సామాన్ల సంచి పట్టుకుని ట్రక్కులోనుంచి జారి కిందకి దిగాను. లారీ వెనుక రేగిన దుమ్ము దట్టమైన పొగమంచులా వెంటనే అంతటా ముసురుకొంది. కలగంటూన్నట్టూ, ఆ కలలో నా అలిమన్‌ని చూసినట్టూ అనిపించింది నాకు. ఆ ధూళిమేఘం లారీ వెంట వెళ్లిపోయాక, అలిమన్ మళ్ళీ అవుపడింది.

''అలిమా-న్!'' అని ఒక్క కేకపెట్టాను, నా శక్తి అంతటితో.

దానిదగ్గరకి ఎలా వెళ్ళానో నాకు గుర్తులేదు, నాకు గుర్తున్నదల్లా, ఒకరినొకరం కౌగలించుకున్నామనీ, ముద్దుపెట్టుకున్నామనీ, ఇద్దరమూ వలవల

ఏడ్చామనీ — అంత మాత్రమే. ఒకరినొకరం వదలిపెట్టి వుండడం ఎంతగా దుర్భరమైపోయిందంటే, మళ్ళీ కలుసుకునేసరికి, ఇన్నాళ్ళూ మనసుల్లో వుంచుకున్నదంతా చెప్పకుందుకు మాటలొచ్చాయికావు, నాకూ దానికీ కూడా. అలిమన్ ముఖాన్ని నెమ్మదిగా ఆపేక్షతో నిమురుతూ:

"నా తల్లీ, మళ్ళీ వచ్చేశావు కదూ? వచ్చేశావు నా దగ్గరకి, మళ్ళీ వచ్చేశావు, నీ తల్లి దగ్గరకి మళ్ళీ వచ్చేశావు, వచ్చేశావు!" అని పదేపదే అన్నాను, అంతకు తప్ప మరేమీ అనలేకపోయాను.

అలిమన్ అంది:

"అవును, వచ్చేశా! అత్తయ్యా, నీ దగ్గరికే మళ్ళీ వచ్చేశా!"

అలా నిలబడి ఒకరినొకరం కౌగలించుకుంటూండేసరికి, దాని కడుపులో వున్న బిడ్డ తటాల్న కదిలి, కాళ్లతో రెండుసార్లు తల్లి పొట్టను దుబ్బూ దుబ్బూ తట్టింది. ఆ అలికిడి మాకిద్దరికీ వినబడింది. అలిమన్ తన రెండు చేతులతోనూ సుకుమారంగా కడుపు నిమురుకుంది. ఆ క్షణంలో దాని కళ్ల చూపులు నా జీవితాన్నంతనీ ఒక్క పాళంగా మార్చి వేశాయి. అలాంటి ఘోరమైన ఆలోచనలు నాలో అసలు ఎలా మెదిలాయో కదా అనిపించిపోయింది! ఓ పవిత్ర మాతృత్వమా! ఇట్టి ఆనందపు ఒక్క బిందువు కోసం విచారసాగరం అంతా ఈదుకురావచ్చు. నా ముఖానికి దాని చెక్కిలి హత్తుకుని, ఇహ ఏ అడ్డూ లేకుండా భోళ్లున ఏడ్చేశా:

"నా పంచప్రాణాలూ నువ్వేనే, నా తల్లీ, నా హృదయమా, నా ముద్దు బిడ్డా! నీ కోసమని ఎంత భయపడిపోయానే, నా తల్లీ!"

నన్ను ఓదార్చుతూ అంది:

"అత్తయ్యా, ఏడవకు, నన్ను క్షమించు, తెలివిమాలినదాన్ని నేను, నిన్ను వదలి ఎన్నటికీ వెళ్లను. వెళ్ళాలని ప్రయత్నమేమో చేశా — కాని కార్యంలేకపోయింది: భరించలేకపోయా. అంతసేపూ నా మనస్సు నీ దగ్గరకే ఈడ్చుకుపోయింది నన్ను."

మనసు విప్పి ఒకరితో ఒకరం మాట్లాడుకునేందుకు ఇదే సరైన తరుణమని నిశ్చయించుకుని, దానితో అన్నాను:

''నువ్వు ఎందుకు వెళ్లిపోయావు? నా మీద కోపం వచ్చిందా నీకు?''

ఏమి జబాబుచెప్పాలో అని ఆలోచించుతూన్నట్టుగా, అది మొదట ఏమీ మాటాడ్లేదు. తర్వాత నిట్టూర్చి అంది:

''అత్తయ్యా, అది మాత్రం నన్నడక్కు. అదెందుకు నీకు? నన్నేమీ అడక్కు నువ్వు, నేనూ ఏమీ చెప్పను. నన్ను బాధపెట్టకు, అత్తయ్యా, ఈ బాధే చాలు.''

ఈ మాటు కూడా అది మళ్ళీ దాటవేసింది మాట్లాడకుండా. వెనుక అన్ని సార్లూ కూడా ఇలాగే అయింది. ఇలా చేయడంవల్ల తన చేజేతులా తనే తన బాధను మరింత అధ్వానం చేసుకుంటున్నానని తనకెందుకు తోచిందికాదో మరి!

ఆ యేడు శరత్తు ముసురుపెట్టి చాలా కాలం ఈడ్చింది. చినుకు పడని రోజు ఒక్కటేనా లేదు. మబ్బు పట్టి తెరిపిలేకుండా వాన కురిసిన ఆ రోజుల్లో చాలామటుకు మేం ఇంట్లోనే వుండిపోయాం. ఇహ ఆ శరత్తులాగానే అలిమన్ కూడా బడలికతో నిస్త్రాణ చెందిపోయింది. అంతకంతకు మరింత వ్యసనపడిపోయింది, అంతకంతకు మాటా నవ్వూ మానేసింది. ఎంతసేపూ ఏదో ఆలోచనలో మునిగిపోయుండేది. నెలలు నిండి పురిటి రోజులు దగ్గర పడ్డాయనుకున్నాను నేను. దానిలో కదలిక పుట్టించుదామనీ, దాన్ని నవ్వించుదామనీ ఎన్ని హాస్యాలు ఆడినా, ఎంత బుజ్జగించినా ఏమీ కార్యంలేకపోయింది. పసిపిల్ల కాదుకదా, నవ్వించి బాధ మరపించడానికి. నేనే కాదు, పరాయివాళ్లు కూడా ప్రయత్నించారు, ఏదో ఒకటి సాయంచేసి దాని మనోవ్యధ తగ్గించడానికి, కాని ఏం చేయగలం? ఓ నాడు బెక్‌తాష్ గడ్డిమోపు తెచ్చి, ఆవులసాల్లో పడేస్తూ, తల్లి మళ్ళీ మంచంపట్టిందని చెప్పాడు. అయ్‌షాని చూడ్డానికని వాళ్లింటికి వెళ్ళాను. పాపం జ్వరమూ దగ్గూ. ఆమెను కాస్త కోప్పడ్డా:

''జబ్బుచేసిందంటే చెయ్యదా మరి? నీదే తప్పు. జాగ్రత్తగా వుండా లని తెలిసి కూడా, ఈ ముసురులోనూ రొజ్జులోనూ, చుట్టాలను చూడా లనీ పక్కాలనీ పలకరించాలనీ అక్కడికీ ఇక్కడికీ పరుగులెడితే మరేమిట వుతుంది?''

తప్పు ఒప్పుకుంటూన్నట్టుగా ఆమె చిరునవ్వు నవ్వింది. ఏం వ్యతి రేకం చెప్పడానికీ ఆమెకి కష్టం అయింది. ఎందుచేతంటే. ఆమె మరి నలుగురు ఆడంగులతో కలిసి, బెక్తాష్ బండిలో పొరుగు గ్రామం వెళ్ళిందట, అక్కడ తెలిసినవాళ్ళెవరింట్లోనో పెళ్ళి అవుతూంటే ఆ పెళ్ళి చూద్దామని. అయ్‌షాని చూసి ఇహ ఇంటికి వెళ్ళిపోదామని లేచేసరికి, తన దగ్గరకి రమ్మనమని ఆమె నన్ను పిలిచి, అంది:

''ఒక్క నిముషం కూచో, తొల్గొనాయ్, నీకు కోపంరాదంటే ఓ సంగతి చెబుతా, చెప్పమన్నావా?''

''సరే, చెప్పు'' అని, గుమ్మంలో వున్నదాన్ని వెనక్కి తిరిగి, ఆమె దగ్గర కెళ్ళా.

''ఏటి దిగువ గ్రామానికి వెళ్ళానంటే, పెళ్ళిచూడ్డానికి వెళ్ళలేదు, ఆ గ్రామంలో నాకు చుట్టాలూ పక్కాలూ లేరని నీకు తెలుసు. నీతో చెప్పకుండా, అవునని నీచేత అనిపించుకోకుండా ఓ పని చేద్దామని అను కున్నాం. అందుకు మమ్మల్ని క్షమించు, తొల్గొనాయ్, పోనీ ఏదో మంచికే కదా అనుకుని చేశాం. ఆ గొడ్లకాపరిని వెతికి పట్టుకున్నాం. వాణ్ణి నలు గురం అనాల్సిన నాల్గు మాటలూ అన్నాం. అలిమన్‌కి నేడో రేపో పురుదు రావడానికి సిద్ధంగా వుంది, నువ్వు నాటికీ నేటికీ మొహమేనా చూపిం చావు కావు, ఏమిటి నీ వేషమూ నువ్వూనూ? ఇదేమీ బాగులేదు సుమా! — అన్నాం. ఎన్ని చీవాట్లు పెట్టినా లాభంలేకపోయింది. మొదటి సంగతి, వాడికి పెళ్ళి అయింది, పెళ్ళాం వుంది. రెండో సంగతి, అంతరంగమూ అంతఃకరణా లేని మనిషి. మామాట వింటే నా కేమీ సంబంధం లేద నేశాడు, పోస్ పొమ్మన్నాడు: మీరు చెబుతూన్నదేమిటో నాకు తెలియదు,

నేను వినను, ఆ వూసే నాతో చెప్పొద్దు, పొమ్మన్నాడు. ఈ వ్యవహారమంతా విని వాడి పెళ్ళాం అక్కడికొచ్చింది. ఎటువంటి పేచీకోరు మనిషి అనుకున్నావ్, ఆయ్ బాబోయ్, ఇహ కేకలుపెట్టింది, బొబ్బరించింది, మామీద అరిచింది. వుత్త సిగ్గు శరాలులేని మనిషి. మమ్మల్ని నానా తిట్లూ తిట్టి అక్కడమంచి గెంటేసింది. దారిలో, ఓ మూల చలి వణికించేస్తూంటే, దాన్ని మించిన వర్షం మొత్తేసింది, తడిసి ముద్దైపోయాం. దానితో ఇదిగో, మంచంపట్టేశాను. సర్లే దీనికేంగాని, మరిగంటే, ఇప్పుడు అలిమన్ మాట ఏమిటీ అని?'' అలా అంటూ అయ్‌షా నోరు నొక్కుకుని వలవల ఏడ్చేసింది.

''అయ్‌షా, ఏడవకు. నేను బతికున్నంత కాలమూ దానికి ఏ తలవం పులూ రానివ్వను!'' అన్నాను. అని నేను ఇంటికొచ్చేశా. అంతకంటె ఇహేమి అనగలను?

దీని తర్వాత రోజులు మహా గడ్డుగా వున్నాయి, అలిమన్‌కి నెలలు నిండాయి, నేడో రేపో నీళ్ళాడేటట్టుంది, ఇక ఆ రోజుల్లో దానిని ఒక్క క్షణమేనా నా కంటి ఎదుటనుండి వెళ్లనివ్వలేదు. గడపదాటి అది వెళ్లిందంటే, నేనూ వెళ్ళేదాన్ని దానివెంట. ఒక్క అడుగైనా ఒక్కర్తెనీ వేయనీయలేదు. తీరానొప్పులు మొదలయే వేళకి నేనెక్కడ దానిదగ్గర లేకపోతానో అని భయపడ్డాను. అంతేకనే గాని, లేకపోతే దాన్ని నేనెన్నడేనా, మరేవిధంగానేనా చికాకు పెట్టానా?

ఇంతకీ, ఓనాడు చూదును కదా, వెచ్చని బట్టలు తొడిగేసుకుని, తలమీద శాలువ కప్పేసుకుంది.

''ఎక్కడికే తల్లీ?'' అని అడిగా.

''ఏటికి వెళ్తున్నా'' అంది.

''మంచిదానవే! నేనైనా సరే ఇంత చెమ్మగా వున్న రోజున ఇల్లు కదిలి వెళ్లను కదా. ఇహ నువ్వా? నయం ఇంకా! ఇంట్లోకి పోయి, పడుకోమ్మా'' అన్నా.

''ఉహూ, వెళ్తా!'' అంది.

''ఐతే, నేనూ వస్తా నీ వెంట. నిన్నొక్కర్తెనే వెళ్లనివ్వను'' అన్నా.

అలా అనగానే, ఇహ అది నా వేపు ఎలా చూసిందంటే – ఇన్నాళ్లు దాని మనసులో అది అనుభవించుతూన్న బాధ అంతా సర్వమూ ఒక్క పాళంగా కావేషంకింద పెల్లుబికి, దాన్ని నామీద అమాంతమూ కక్కేసింది.

''నా వెంటపడి నన్నెందికిలా చంపుకు తింటున్నావ్? నా దగ్గర నుంచి ఏమిటి కావాలి నీకు? పీడలా పట్టుకున్నావేమిటి నన్ను? నన్ను వదిలిపెట్టి పో! ఎక్కడేనా చచ్చిపడిపోతా ననుకుంటున్నావా ఏమిటి?'' అంటూ దభీమని తలుపు మూసేసి వెళ్లిపోయింది.

నా గుండె తలుపు మూసేసి, నా గుండెలోనుంచే ఏకంగా తను వెళ్లిపోతూన్నట్టనిపించింది నాకు. నా మనస్సు ఎంతో కుమిలిపోయింది. ఐనా నేను లెక్కచేయక, తలుపు తీసుకుని, అలిమన్ ఎటు వెళ్లిందో చూదామని, మళ్ళీ వీధిలోకి వెళ్ళాను. అది ఎక్కడా కనబడ్లేదు, పళ్లపు చేలవైపు వెళ్లిందేమో అనుకున్నాను.

సన్నని తుంపర పట్టింది, చినుకు కనబడడమేలేదు, చల్లని ఆవిరి పొగలా పడుతూంది. గాలి రివ్వున కొట్టుతూ, బూడిదెవన్నె మబ్బును తునాతును కలకింద పీకిపారేస్తూంది. పళ్లతోట దిక్కుమాలినదానిలా కానవచ్చింది. చలికి పట్టిపోయిన చెట్లు, నల్లబడిపోయి నీళ్లు కారుతూన్న కొమ్మలతో నగ్నంగా వున్నాయి. జనం అంతా ఇళ్లల్లో కూచున్నారు. ఎటు చూసినా నిర్మానుష్యంగా వుంది. దూరాన్నున్న కొండల వరుస ఆ తుషారంలోనుంచి కనబడీ కనబడనట్టు మసకమసకగా అవుపడుతూంది.

కాస్సేపు ఆగి, తర్వాత దానివెంట వెళ్ళాను: దాని నోటికొచ్చినట్టూ అది తిడితే, తిట్టనీ, తీరా నొప్పులు వచ్చే వేళకి అర్థాత్తుగా ఏ రోడ్డు మీదనో పడిపోయేకంటె నయమే కదా. తోట వెనకాల పుంతవెంట వెళ్తూ అలిమన్ కేసి చుశాను. అది ఇంటి ముఖం పట్టింది. మెల్లగా నడుస్తూంది, అడుగు తీసి అడుగు పెట్టడమే కష్టమైపోతూంది దానికి, మెడ శుభ్రంగా

కిందకి వాలిపోయింది. నేను ఇంటికి దబ్బున వెళ్లిపోయి, టీ కోసమని కెటిలు పొయ్యిమీద పెట్టి, మీగడా కోడిగుడ్లూ గబగబా కలిపి అట్లు సిద్ధంచేశా. తర్వాత కంబళిమీద శుభ్రమైన టేబిలుగుడ్డ పరచి, ఇంట్లో వున్న చలికారు ఆపిల్ పళ్లల్లోకల్లా ముచ్చటగా కనబడినవాటిని ఎంచి తీసుకొచ్చి అక్కడ పెట్టాను. అలిమన్ ఇంట్లోకొచ్చి, టేబిలుగుడ్డ పరచి వుండడం చూసి, ఏమీ మాట్లాడకుండా నా వంక చూసి విచారంగా నవ్వింది.

''చలేస్తూంది కామోసు నీకు, చిట్టి తల్లీ? ఇలా కూచో, కూచుని కాసింత టీ పుచ్చుకుని, అట్టుముక్క నోట్లో వేసుకో'' అన్నా దానితో.

''వొద్దు, నాకేమీ తినాలని లేదు, అత్తయ్యా. ఆపిల్ ఒకటి ఇలా ఇయ్యి. ఓ ముక్క కొరికి చూస్తా'' అంది.

''ఏమేనా బాధగా వుందేమో లే, వుంటే నాతో చెప్పు, అలిమన్'' అన్నా, ఏమంటుందో చూదామని.

ఐనా ఇందాకట్లాగే అంది:

''నన్నేమీ అడక్కు, అత్తయ్యా. నాకేమిటో అదోలా వుంది. నామీద నాకే అసహ్యం పుడుతూంది. నిన్ను అలా నానా మాటలూ అనేశాను. నన్నొక్కర్తెనే వుండనిస్తేనే నయం'' అంటూ నన్ను వెళ్లిపొమన్నట్టుగా చెయ్యివూపింది.

రాత్రి పడింది. పడుకుందుకని బట్టలు మార్చుకుంటూ మథన పడ్డాను, ఇహ ఇప్పుడు అలిమన్‌తో ఏమన్నా తప్పుపట్టుకుంటుంది అనుకుంటూ అలా బాధపడుతూనే నాకు నిద్రపట్టిపోయింది. రాత్రి తరుచు లేచి, అలిమన్ ఎలావుందో చూడడం అలవాటు నాకు. అటువంటిది ఈ మాటు, కొండ విరిగి మీద పడినా లేవలేనంత నిద్రపట్టిపోయింది. నాకు ఏ మాత్రం అనుమానం తట్టినా రెప్ప వాల్చేదాన్నా? పది రాత్రుళ్లు వరుసగా జాగరం చేసి వుండేదాన్నే, గోడకేనా జారబడకుండా....

ఎప్పుడు లేచానో ఎందుకు లేచానో నాకు జ్ఞాపకంలేదు, గభాల్న మాత్రం మెలకువ వచ్చింది. లేచి చూదును కదా, అలిమన్ లేదక్కడ. ఇంకా సగం సగం నిద్రలోనే వున్నానేమో, నేను సరిగా గ్రహించుకో లేకపోయాను. లేచి వాకిట్లోకి వెళ్లివుంటుందేమో అనుకున్నాను మొదట. ఓ నిముషం వూరుకున్నాను. ఏ అలికిడీ లేదు, ఏ చప్పుడూ వినబడ్లేదు. తర్వాత దాని మంచం దగ్గర కెళ్ళి, పక్కబట్టలు తడిమే సరికి గుడ్డ లన్నీ చల్లగా వున్నాయి. నా గుండె చల్లబడిపోయింది: అది లేచి వెళ్లిపోయి ఏ కాలమో అయిందన్న మాట! ఏవో నా చేతికి దొరికిన గుడ్డలు వొంటి మీద పడేసుకుని, గుమ్మంలోకి పరుగెత్తాను. వీధిపెరట్లో నాల్గుమూలలా వెతికాను, పెరటి తోటలోకి పరుగెత్తి అక్కడ వెతికాను, వీధిలోకి పరు గున వెళ్ళి, ''అలిమన్! అలిమన్!'' అని గట్టిగా పిలిచాను. దాని దగ్గర నుంచి ఏ జవాబూ లేదు. ఇంటి గుమ్మాల్లో పడుకున్న కుక్కలు మాత్రం మొరగడం మొదలెట్టాయి. నా గుండెలో కారుచీకటి అలము కుంది. అది ఇల్లు వదిలేసి వెళ్లిపోయిందన్న మాట! ఈ నడిరేయి చీక టిలో ఎక్కడికి వెళ్లిపోయిందో, ఏమిటో? ఇప్పుడేమిటి చేయడం? పరు గెత్తి వెళ్లితే నాకు దొరుకుతుందా? మళ్ళీ ఇంట్లోకి పరుగెత్తి, లాం తరు వెలిగించి దాన్ని చేతితో పట్టుకుని, వెతకడానికి బయల్దేరాను. గుమ్మం దాటానో లేనేలేదో, షెడ్డువైపునుండి ఏదో మూలుగు వినబడినట్టయింది. గభాల్న వీధిపెరట్లోనుంచి పరుగెత్తి, షెడ్డు తలుపు బారుగా తెరచి చూసేసరికి ఉలికిపడ్డాను, చేతిలో లాంతరు కిందకి జారి పడిపోయిందనే అనుకున్నా — నా కళ్లని నేనే నమ్మలేక పోయా: గడ్డిమీద వెల్లకిలా పడివుంది అలిమన్. నొప్పులు పడుతూంది. జ్వరంతో గాభరా పడిపోతూ వూరకే ఇటూ అటూ దొర్లుతూంది.

''అయ్యో, ఇదేమిటే ఇది? నాతో ఎందుకు చెప్పావు కావే?'' అని నేను గుండె బాదుకుని, దాని దగ్గర చతికిలబడ్డా.

దానికి సాయంచెయ్యాలని తాపత్రయపడి, దాన్ని లేవనెత్తేందుకు ప్రయ

త్నించేసరికి, నెత్తురుతో తడిసి ముద్దైపోయిన దాని గౌను కొంగు నా చేతికి తగిలింది. దాని వొళ్లు నిప్పులా కాల్తూంది. ఎంతో కష్టంతో, ఎలుగురాసిన గొంతుతో అది నిట్టూర్చింది:

''ప్రాణంపోతూంది, చచ్చిపోతున్నా.''

అప్పటికప్పుడే చాలాసేపయే అది అలా నిస్త్రాణ పడిపోతూన్న ట్టుంది.

''అయ్యో, భగవంతుడా, నువ్వే దిక్కు, భగవంతుడా! నువ్వే దిక్కు!'' అంటూ నేను భగవంతుడికి వెయ్యిమొక్కులు మొక్కాను, దానంతటదే గనుక పురుడు రాకపోతే, ఇహ డాక్టరు తప్ప మరెవ్వరూ దాన్ని రక్షించ లేరని తెలిసిపోయింది నాకు.

దాన్ని అక్కడలా వదిలిపెట్టి, అయ్‌షా ఇంటికి పరుగెత్తి వెళ్లి, ఇహ నాకున్న శక్తికొద్దీ దబాదబా కిటికీ తలుపు బాదాను:

''ఏమర్రో, లేవండి, దబ్బున లేవండి! బెక్‌తాష్, బండి సిద్ధంచేయి, నాయనా! అలిమన్‌కి ఏమీ బాగులేదు! దబ్బున లే, నాయనా, దానికేమీ బాగులేదు, బాబోయ్!''

వాళ్లని లేపి, నేను మళ్ళీ అలిమన్ దగ్గరకి పరుగెత్తి, దానికిన్ని మంచి నీళ్లిచ్చా. గిన్నె అంచు పెదవులకి తగిలేసరికి దాని పళ్లు పటపట కొరుక్కున్నాయి, చలిజ్వరం వచ్చి వొళ్లు కుదిపేసినట్టు మనిషి గజగజ వణకిపోతూంది. ఎంతో కష్టంమీద రెండు గుటకలు మంచినీళ్లు మింగేసరికి, మళ్ళీ వొళ్లు కొంకర్లుపోవడం ఆరంభించి, మూలుగు మొద లైంది. అయ్‌షా తను మంచం పట్టివున్నా, రొజుకుంటూ రొప్పుకుంటూ అలాగే లేచి, అడుగుతీసి అడుగు పెట్టలేకపోయినా, అలాగే పాపం సరిగ్గా వేళకి అక్కడికొచ్చింది. అలిమన్ స్థితిని చూసేసరికి ఆమె ముఖం వెల వెలబోయింది, భోరున ఏడ్చేసింది.

''అలిమన్, నా తల్లీ, ఎలావుందే నీకు, అయ్యో, అలిమన్, చిట్టి తల్లీ! నీకేం భయంలేదే. ఆస్పత్రికి తీసుకువెళ్తామే నిన్ను!''

అదృష్టంకొద్దీ బెక్‌తాష్ ఆ రోజు పొద్దుపోయి ఇంటికొచ్చాడు, అందుచేత గుర్రాల్ని ఇంకా సాలకి తీసుకుపోలేదు. అవి ఇంకా ఇంటిదగ్గర పాకలోనే వున్నాయి. అతడు చప్పున బండి సిద్ధంచేసి, షెడ్డుగుమ్మంలోకి తీసుకొచ్చాడు. బండిలో ఇంత కసవు పడేసి, పరుపు పరచి, తలగడలు పెట్టి, ముగ్గురం ఎలాగో ఒకలాగు అలిమన్‌ని షెడ్డులోనుంచి తీసుకొచ్చి, బండిలో పడుకో బెట్టాం. ఇహ తొందర తొందరగా బండిని ఆస్పత్రికి పోనిచ్చాం.

అబ్బ, ఆ శరత్తూ, ఆ గతుకుల రోడ్డూ, మరి ఆ పాపిష్ఠి అంధకారపు రాత్రీ, అయ్ బాబోయ్.... ఆ రోజుల్లో ఆసుపత్రి నది అవతలి ప్రాంతంలో వుండేది, ఏరు దాటాలంటే, ఏటికి దిగువగా ఎంతో దూరం చుట్టుతిరిగి వెళ్తేనేగాని వంతెన వచ్చేది కాదు.

గ్రామం పొలిమేర దాటేసరికల్లా అలిమన్‌కి మళ్ళీ నొప్పులు మొదలెట్టాయి, గట్టిగా బొబ్బరించి, వొంటిమీద కప్పిన గుడ్డలు తోసేసుకునేది. దాని తల నా వొళ్ళో పెట్టుకుని, వొంటిమీదనుండి తోసేసుకుంటూన్న దుప్పటి మళ్ళీ కప్పుతూ, దాని ముఖానికి దగ్గరగా లాంతరు ఎత్తిపట్టుకుని, దాని కళ్లల్లో కళ్ళుపెట్టి చూసి, దాన్ని సంబాళించాను. ఎంతసేపూ ఇదే పని నాకు. బెక్‌తాష్ కూడా దాన్ని సముదాయించేవాడు:

"కాస్సేపు ఓపికపట్టాలి, అలిమన్. ఇహనేముంది, మరోగడియలో వచ్చేశామన్నమాటే. చూడు, ఇదిగో రానే వచ్చేశాం. మరో క్షణంలో వంతెనే."

కాని ఇంకా ఎక్కడి వంతెన, ఎంత దూరం వెళ్ళాలో వంతెన చేరుకోవాలంటే! గుర్రాల్ని పరుగెత్తించే మాటుంటే ఈపాటికి వంతెన చేరుకొనుందుం. కాని వాటిని పరుగెత్తించేందుకు వీల్లేదాయె, అలిమన్‌కి మరీ కుదుపై పోతుంది. వాన కుండపోతగా పడుతూంది. అన్నీ ఒకదానికొకటి కలిశాయి. కన్ను పొడుచుకున్నా కనబడని చీకటి, ఎముకలు కొరికేస్తున్న చలి, దానికి తోడు హోరున వాన, రోడ్డు అంతా బరద, గతుకులూ.

అలిమన్‌కి కొంకర్లు వచ్చేశాయి, బరువుగా మూల్గింది, బిగ్గరగా బొబ్బరిం చింది. గభాల్న మళ్ళీ నెమ్మదించి, బొంగురు గొంతుతో ఎగవూపిరి తీయడం మొదలెట్టింది.

''అలిమన్! అలిమన్! ఎలా వుంది నీకు?'' అని అడిగాను దిగాలు బడి, దాన్ని హత్తుకున్నాను, లాంతరు ఎత్తిపట్టుకుని దానివంక చూశాను.

చింత నిప్పుల్లా వున్న కళ్లలో అది సరాసరి నా కళ్లలోకి చూసింది:

''బండి ఆపండి! ప్రాణం పోతూంది! బండి ఆపండి!'' అంది. ఆ నాల్గు మాటలూ దాని నోటంట రావడమే ఎంతో కష్టమైంది. పెద వులు నల్లబడిపోయాయి, ఎండిపోయున్నాయి, ఎగవూపిరి మళ్ళీ మొదలైంది.

బండి నిలబెట్టాం.

''నా తల ఎత్తి పట్టుకోండి'' అంది. ''ఊపిరి అందడంలేదు'' అంటూ ఏడ్చేసింది. ఆపళంగా ఏడుపు మింగేసి అంది: ''అత్తయ్యా, అమ్మా.... భగ్గున మండిపోతూంది వొంట్లో, శక్తిలేదు, ప్రాణం పోతూంది.... అత్తయ్యా, అమ్మా, నువ్వు చేసినదానికంతకీ నీ రుణం తీర్చుకోలేను, అత్తయ్యా. నన్ను క్షమించు.... కాసీమ్ బతికి వుంటే.... అయ్యో, కాసీమ్, నా ప్రాణం పోతూంది.... నన్ను క్షమించు....''

నేను బతిమాలుకున్నా దాన్ని:

''అబ్బే, నా తల్లి కాదూ, మా అమ్మ కాదూ, ప్రాణం పోవడం లేదు, ఏమీ లేదు. ఒక్క నిముషం ఓర్చుకోవాలి, ఒక్క నిముషం, నా తల్లి. ఇంకేం వుంది, వంతెన వచ్చేసింది. ఇదిగో నా మాట విను! అబ్బే, ప్రాణం పోవడమేమిటి? బోలెడు ఆయుష్షుంది నీకు!''

మళ్ళీ కొంకర్లు ఆరంభించాయి, మనిషి చుట్టుకుపోతూంది. పళ్లు బిగిసిపోయాయి. స్మారకం పోతూంది, ఇక వొంట్లో మిగిలి వున్న రవంత సత్తువతోనూ గిజగిజ కొట్టుకుంటూంది.

''బెక్‌తాష్!'' అని వాణ్ణి ఆజ్ఞాపించాను. ''దాన్ని బుజంకింద చేతులు పెట్టి, పైకి లేవనెత్తు! దబ్బున! నీ పుణ్యముండేను, సిగ్గుపడకు, నాయనా!''

బెక్‌తాష్ దాన్ని లేవనెత్తాడు. ప్రసవమవుతూన్న బిడ్డను నేనేమో పైకితీస్తున్నాను. బెక్‌తాష్ బావురంటూ ఏడుపు మొదలెట్టాడు, ఆ మిలిటరీ రైలు గర్జన, చక్రాల దడదడ చప్పుడు నా చెవుల్లో మళ్ళీ గింగురుమని ధ్వనించాయి, ''అ-మ్మా-మ్మా! అలిమా-న్!'' అని వినబడిన కేకను గాలి మోసుకుపోతూంది. సరిగ్గా ఈ క్షణంలోనే కొత్తగా పుట్టిన బిడ్డ కెవ్వున కేకపెట్టింది. ఓ జీవితమా, నీకింత కనికరం లేదెందుకో ఎందుకు నీవింత గుడ్డిదానవోకదా! బిడ్డ పుట్టింది, కాని అలిమన్ ప్రాణం పోతూంది. నగ్నంగా, చెమ్మగా వున్న ఆ పిసరు శరీరాన్ని నా పరికిణీ కొంగులో చుట్టేసి, కన్నెత్తి చూసే సరికి — ఇంకేం వుంది, బెక్‌తాష్ చేతుల్లో వున్న బాలెంతరాలు, తల్లి అలిమన్ హొంట్లోనుంచి అప్పుడే ప్రాణం ఎగిరిపోయింది. మెడ ఓ పక్కకి వొరిగిపోయింది, కట్టెపుల్లల్లా చేతులు వేలాడిపోయాయి.

''అలిమన్!'' అని, ఇంకెవరి గొంతుకతోనో నేను ఒక్క కేకపెట్టి, దాని చెయ్యి పట్టుకు చూశాను. నాడి దొరకలేదు.

ఒక్క లిప్తమాత్రపు కాలంలో నా కంటి ఎదుట తలపడ్డాయి — చావు బతుకులు రెండూనూ!

మేము ఇంటికి వెళ్ళేసరికి పొద్దు పొడుస్తూంది. ఆ వేకువ వెలుగులో పెద్దపెద్ద మంచుచెక్కలు గాలిలో అల్లాడుతూ, మెల్లన నేల రాల్తున్నాయి. అంతా నిశ్శబ్దంగా వుంది, ఏ అలజడీ లేదు, యావత్తు ప్రపంచాన్నీ నిశ్శబ్దం ఆవహించింది. ఈ తెల్లని నిశ్శబ్దంలో, సద్దులేకుండా వెళ్ళాయి, తెల్లని జూలూ, తెల్లని తోకలూ గల అలసిపోయున్న గుర్రాలు. బెక్‌తాష్ బండిలో కూచుని, నిశ్శబ్దంగా వెక్కివెక్కి ఏడుస్తున్నాడు. వాడు తోలడమే లేదు, గుర్రాలు వాటంతట అవే వెళ్తున్నాయి. బెక్‌తాష్ దారి కడవెళ్ళా అలా ఏడుస్తూనే వున్నాడు. ఆ పసిగుడ్డుని నా జూబ్బా కింద గుండెలకి హత్తుకుని, బండిపక్కనే నడచాను నేను. తెల్లని మంచు నా కంటికి నల్లగా అవుపడింది.

యుద్ధం తన గురించి తనే నాకు జ్ఞాపకంచేయడం అదే కడపటి సారి. ఆ ఉదయం నేను నడచిన ఆ తోవ, నా బతుకు అంతట్లోనూ కష్టమైన తోవ. బతుకు ఇలా వెళ్ళబుచ్చేకంటె చావే నయమని తోపించింది నాకు.... కాని నా చేతుల్లో వున్న బిడ్డ వొళ్ళు వెచ్చగిరింది, సెవసగా నవనవలాడుతూన్న ఆ పట్టెడు మాంసపుముద్ద గిజగిజలాడి, ఇక గుక్క తిప్పకోకుండా ఏడ్చింది. ఆ బిడ్డని నా చేతుల్తో మోస్తూ, ఇలా అన్నాను: ''ఎంత దురదృష్టం పట్టింది నీకు! నీ నోటివెంట వచ్చిన తొలి కేక తోనే నీ తల్లికి వీడ్కోలు చెప్పావు, అయ్యో!'' ఎక్కడనుంచో వచ్చినట్టు, తటాలున ఓ ఆలోచన నా మనసులో మెదలింది: ''జీవితం అంతా నశించలేదు, ఓ చిన్నతునుక మిగిలింది.'' ఆ క్షణంలో అనుకున్నాను: ''అయ్యో, తల్లి పాలంటే ఏమిటో ఎరగవే, ఎలా బతుకుతావు నువ్వు? అట్టే రోజులు బతకవే నువ్వు!'' ఆ బిడ్డ బతకాలని విధాతకి వెయ్యి దండాలు పెట్టాను: ''ఈ ఒక్క నలుసునేనా బతికించు! ఈ శిశువును చంపేయకు. ప్రాణం నిలుస్తుందేమో, నిలబడనీయి, తండ్రీ! ఎలాగో ఈ శిశువు బతికి బట్టకట్టేటట్టు చూడు, తండ్రీ!'' అలా ప్రాధేయపడుతూ నడిచాను, ఓ నిముషం నిస్పృహ చెందిపోయేదాన్ని, మళ్ళీ ఆశ పుట్టుకొచ్చేది, మరు నిముషం మళ్ళీ నిరాశ పడిపోయేదాన్ని. అలాగే నడుచుకుంటూ గ్రామం చేరుకునేసరికల్లా భళ్ళున తెల్లవారింది.

మంచు దట్టంగా నిశ్శబ్దంగా ఇంకా అలా పడుతూనే వుంది. చుట్టుపక్కలంతా తెల్లని నిశ్శబ్దం నిండి వుంది. ఈ నిశ్శబ్దం నడిమధ్యను ఏ చలనమూ లేకుండా సద్దు మణిగి, సగం కట్టి వదిలేసి పాడుపడిపోయి నిర్మానుష్యంగా వున్న ఆ వీధి మరింత భయంకరంగా అవుపడింది. ఏడేళ్ళ క్రితం పనులు మొదలెట్టిన ఆ జాగాలో, ఇప్పుడా పనులు ఐపూ జాడా లేకుండా మట్టిలో కలిసిపోవడం చూస్తే ఏడుపొచ్చింది. మృత్యువాతపడిన

ఆ వీధి శిథిలాల మధ్య బోసినోళ్లు తెరచుకున్న కాళీ జాగాల్లో మంచు దిబ్బలు లేచిపోతున్నాయి, తిసిల్ పొదలూ, కలుపు మొక్కల తుప్పలూ దిక్కుమాలినట్టు పెరిగిపోతున్నాయి. వెనుక ఒకప్పుడు కాసీమ్, అలిమాన్లు కట్టుకుందామనుకున్న ఇంటి దొడ్లో వాళ్లిద్దరూ పడిన కష్టానికీ, కన్న పగటికలలకీ స్మృతిచిహ్నంగా రాళ్ల పేర్పూ, ఇటికబెడ్డల దిబ్బలూ నిల్చివున్నాయి.

శాశ్వతంగా ప్రశాంతంగా నిద్రిస్తూన్న అలిమన్ ముఖం పాలిపోయుంది, కళ్లు మూతలుపడి వున్నాయి. తల ఇటుంచి అటూ అటుంచి ఇటూ ఆడు తూంది; ముఖంపై పడిన మంచు కరగకుండా అలానే వుంది.

గ్రామం చేరుకుని మొదటి ఇంటి దగ్గరకు మేం వచ్చేసరికి బెక్‌తాష్ బండి మీదనుంచి గంతువేసి దిగిపోయి, తన జీవితంలో తొలి సారిగా ఒక వ్యక్తి మరణాన్ని గురించిన వార్తను, వయసువచ్చిన మొగవాడి ఏడుపు గొంతుతో బిగ్గరగా, నలుగురికీ తెలియజేశాడు. వూళ్ళోవాళ్లందరూ ఇళ్లల్లో నుంచి పరుగెత్తి వచ్చి కంటనీరు పెట్టుకుని మా చుట్టూ చేరారు. ఇంకా ఎక్కడో తన వీధిలో వున్న అయ్‌షా గట్టిగా ఏడుస్తూ, పరుగున వచ్చి నా చేతిలో వున్న పసికందును అందుకుని తన ఇంటికి తీసుకెళ్లి పోయింది.

మరునాడు అలిమన్‌ని సమాధి చేసేశాం. ఆచారం ప్రకారం ఆడ వాళ్లు శ్మశానానికి వెళ్లకూడదు, ఐనా నేను వెళ్ళాను, నన్నెవ్వరూ ఏమీ అనలేదు: ఆచారాన్ని పాటించాలని నన్ను నిర్బంధించేందుకు మా ఇంట్లో మగాళ్ళే లేకపోయిరి. నా చేతులతో నేనే స్వయంగా ఖననంచేశాను, దాని శవాన్ని సమాధి గోతిలో నేనే వుంచాను, దాని శవంపైన తొలి పిడికెడు మట్టీ నేనే చల్లాను. ఆనాడు మంచు కూడా గుబురుగా పీచుపీచులా పడు తూంది. ఓ గడియకల్లా ఎర్రని మట్టి దిబ్బ తెల్లని కొండ అయి పోయింది.

అలిమన్ సమాధిమీద వసంతంలో పూలమొక్కలు నాటాను. ప్రతీ వసంతంలోనూ పూలమొక్కలు నాటుతూంటాను. పువ్వులంటే దానికెంతో ఇష్టం,

ఏముంది, జీవితం మళ్ళీ యథాప్రకారం మొదలైంది. తొలిరోజుల్లో జన్‌బొలోత్‌కి జొరాబెక్ తాత కోడలు పాలిచ్చేది. తర్వాత వాడికి మేకపాలు పట్టాను. ఇహ వాడి పాట్లేవో వాడూ పడ్డాడు, నా పాట్లేవో నేనూ పడ్డాను, దాని గురించి ఇప్పుడు చెప్పుకోవడ మెందుకులే. ఒక్క మాటలో చెప్పాలంటే, వాడికి ఆయుష్షుంది, వాడు బతికాడు. వాడి నొసట అలా రాసి వుంది, ఆ రాత పుణ్యమే మరి. ఇప్పుడు వాడికి పన్నెండేళ్ళు. చిన్నప్పుడు వాడికి మందు ఇచ్చిన డాక్టరు—ఇప్పుడాయన ఈ చుట్టుపట్ట గొప్ప వైద్యుడు, పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్నాడు—కనబడినప్పుడల్లా అంటూంటాడు:

"ఏం, అవ్వగారూ! మనవడెలా వున్నాడు? బావున్నాడా?"

"భగవంతుడి దయవల్ల, ఎదిగి పెద్దాడవుతున్నాడు, ఒడ్డూ పొడుగూ అసలైన జిగిత్‌గా తయారవుతున్నాడు" అంటాను నేను.

ఆయన నాకేసి చూసి, నవ్వుతూ అంటాడు:

"భేష్! మీ దగ్గిర పెరుగుతున్నాడు, బుద్ధిమంతుడవుతాడు."

ఆయన మమ్మల్ని, జన్‌బొలోత్‌నీ నన్నూ, చాలా కాలంనుంచీ ఎరుగును. జన్‌బొలోత్‌ని ఆయన మొదట చూసినప్పుడు, వాడు యేణ్ణర్థం పిల్లడు. ఈసురోమంటూ కునిష్టిగా వుండేవాడు. ఓమాటు వాడికి పడిసెంపట్టి, చాలా జబ్బుచేసింది. పెదాలు నల్లనడిపోయాయి, ఊపిరాడిందికాదు, కన్ను తెరవలేదు. బూర్నీసులో చుట్టేసి, దబ్బున ఆసుపత్రికి తీసుకుపోయాను. ఆవేళలాగానే, అప్పుడు కూడా రెండు ఝాముల రాత్రి, శీతాకాలం, అలాగే యేట్లోనుంచి నడిచి అవతలి వొడ్డు చేరుకున్నాను. డాక్టరు ఇంకా కుర్రాడే, పరీక్ష ఇచ్చి అప్పుడే కొత్తగా ఉద్యోగంలో చేరినట్టుంది. నేను గజగజ వణికిపోతూ, నా కట్టుగుడ్డలన్నీ తడి ముద్దై వున్నాయేమో, నన్ను చూసి భయపడిపోయి, చేతులు వూపుకుంటూ:

"మీకేం మతిపోయిందా ఏమిటి? మిమ్మల్ని ఎవడు ఏరు దాట నిచ్చాడు? పిల్లవాడి తల్లీతండ్రీ ఏరీ?" అని అడిగాడు,

"అబ్బాయ్! వాడి తల్లినీ నేనే, తండ్రినీ నేనే. వీణ్ణి ఎలాగేనా బతికించు. వీడు గుటుక్కుమన్నాడంటే, నేనూ గుటుక్కుమంటాను" అన్నాను.

రాత్రి తెల్లవార్లూ పిల్లడితోనే కూర్చున్నాడు డాక్టరు, రెండేసి గంటలకీ ఇంజెక్షను ఇచ్చాడు. నాకు పొడిగుడ్డలిచ్చాడు కట్టుకుందుకు, మందు కూడా ఇచ్చాడు. ఐనా పొద్దు అయేప్పటికిల్లా నాకు జ్వరం వచ్చేసింది, దగ్గుపట్టుకుంది, దగ్గేసరికి నెత్తురు పడింది. వొంటిమీద తెలివి లేదు, అపస్మార్కంగా అలా పడుకున్నాను. నాకొక్కటే జ్ఞాపకం వుంది — నా మంచం దగ్గరకి డాక్టరు రావడమూ, నా నుదుట చేయివేయడమూ:

"మీరు మాత్రం గట్టిగా నిలబడాలమ్మా! ప్రాణం వదలకూడదు సుమండీ, మనవడు అప్పుడే నవ్వుతున్నాడు, బాగైపోయాడు" అనడమూ.

"ఐతే నేనూ బాగైపోతాను" అన్నాను మెల్లగా.

బహుశ మనవడికి నిమ్మళించిందన్న కారణంచేతనే అయివుంటుంది, నాకు మాత్రం దబ్బునే నిమ్మళించిపోయింది.

గత యేడాది వసంతంలో ఓ సరదా అయిన సంగతి జరిగింది. బడికి సెలవలిచ్చేశారు. సెలవల్లో ఓనాడు వాడు వీధిలో ఆడుకుని, తర్వాత ఇంట్లో కొచ్చి, ఇటూ అటూ చూడగా — కాసీమ్ సైకిలు వాడి కంటబడింది. అది అవుపడే సరికల్లా దాన్ని ముంగిట దొడ్లోకి లాక్కొచ్చాడు. ఏ ఇరవై య్యేళ్లనుండో ఆ సైకిలు షెడ్డు చూరునుండి అలా వేలాడుతూనే వుంది. ఇహ ఏముంది, దాన్ని లాక్కొచ్చి, ధాన్ని మరమ్మతు చేయడం మొదలెట్టాడు. సరే కానీ అని చెప్పి, నేనేమీ అనలేదు. ఏదో పాపం, కుర్రాడు కదా, అదొక వెర్రిగా నాల్గు రోజులు సరదా పడతాడు, ఆతర్వాత వాడే దాన్ని ఓ మూల పడేస్తాడు అనుకున్నాను. దాన్ని మరమ్మతు చేయడానికి దాన్లో ఏమేనా వుంటే కదా: ఇనప సామానంతా ఏ నాడో తుప్పట్టిపోయింది, టైర్లన్నీ ఎక్కడికక్కడికి చీకి చివికి పెట్టిపోయాయి. వాడి నేస్తులందరూ వచ్చి చూసి, వాడి ముఖం మీదే నవ్వేశారు: తాతల్నాటి తుక్కు తేరురా ఇది, పెంటకుప్పమీద పారేయ్యరా — అన్నారు వాళ్లు. కాని వాడు వద

ల్లేదే, అలా ఆపసోపాలు పడుతూ, తనంతట తనే ఏదో ఇది చేశాడు, అది చేశాడు. బెక్‌తాష్ వుండబట్టి గాని, లేకుంటే బహుశా ఏమీ కార్యం వుండేది కాదేమో. ఏమైతేనేం, బెక్‌తాష్ కూడా దాన్లో చెయ్యిపెట్టాడు. వాడు కూడా, బిడ్డల తండ్రే అయినా, చిన్నపిల్లాడికి మల్లేనే, అదేదో మహా ముఖ్యమైన కార్యంలాగు, ముఖం సాగదీసుకుని, ఆ పనిలో పడి పోయాడు. జన్‌బొలోత్ అంటే బెక్‌తాష్‌కి మహా ఆపేక్ష — బడిలో ఏదేనా తకరారు వచ్చినా చేసినా, బెక్‌తాష్ వెళ్లి ఉపాధ్యాయులతో మాట్లాడి అదేదో సర్దుబాటుచేసి వచ్చేవాడు. అయ్‌షా బతికి వున్న రోజుల్లోనే బెక్‌తాష్ పెళ్లిచేసుకున్నాడు. అలిమన్ పోయిన మూడేళ్లకో ఏమో, అయ్‌షా కూడా పోయింది. ఆమె పోయింది అని నేను మహా దుఃఖించాను. మేం ఇద్దరం ఎంతో స్నేహంగా వుండేవాళ్లం, ఎన్నో కష్టాలు కలిసి అనుభవించాం. బెక్‌తాష్ పెద్దాడయాడు, మంచి బుద్ధిమంతుడు, తెలివైనవాడు. వొళ్లు దాచుకోకుండా పనిచేస్తాడు. ముగ్గురు పిల్లలు. భార్య, గుల్‌సున్, మంచి మనిషి, నాకు మంచి పొరుగు. బెక్‌తాష్ ఇప్పుడే చాలాకాలమై కంబైన్ ఆపరేటరుగా పనిచేస్తున్నాడు.

ఓనాడు జన్‌బొలోత్ తన సైకిలు అంతా తుడిచేసి, కందెన పోసి, తను కూడా వొంటినిండా ఇంత కందెన పోసుకుని, తయారయాడు.

''నాయనమ్మా, చూడు. నాన్న సైకిలు ఎలా వుందో!'' అన్నాడు.

వాడి మాట నా చెవినిపడేసరికి నా కాళ్ళూ చేతులూ తిమ్మిర్లు పోయాయి, మనసు తన్మయమైపోయింది, మళ్ళీ గొప్ప విచారంపట్టుకుంది. వాడు మాత్రం ఇహ అదే పొంగిపోతున్నాడు.

''సైకిలు తొక్కగలనే నేను. చూడు!'' అన్నాడు.

సైకిలు ఎక్కి సీటుమీద కూచున్నాడో లేని, వాడి కాళ్లు పెడల్సుకి అందవు, అందుకని ఓ సారి ఇటు వొరగనూ, ఓ సారి అటు వొరగనూ, అలా అటునుంచి ఇటూ ఇటునుంచి అటూ వూగిపోతూ జోగిపోతూ అలానే తొక్కుతూ వెళ్లిపోయాడు — ఏ నిముషన్నే పడిపోతాడో అనిపించింది,

''దిగిపోరా, ఒరేయ్, దిగిపోరా!'' అని లబోదిబో బొబ్బరించాను.

అది విని వాడు మరీ జోరుగా తొక్కుతూ పోయాడు. గేటుగుమ్మం దాటేశాడు. వీధిలోకే వెళ్లిపోయాడు ఏకంగాన్నూ, ఇహ వాడివెంట పరుగెత్తా నేను. ఝూమని రోడ్డుమీద వెళ్తూన్నవాడల్లా – అమాంతం సైకిలుతో సహా దుబ్బున కింద పడ్డాడు. వాడికి పెద్ద దెబ్బ తగిలింది. నేను ఒక్క పరుగున వాడిదగ్గరకెళ్లి, రోడ్డు మీదనుండి లేవదీసి, ఇహ గట్టిగా చివాట్లేశా:

''చావాలని వుందేమిట్రా నీకు? అదే కాబోలు నీ ఆలోచన! ఇహ నాకదొక్కటే తరువాయి వుండిపోయింది!''

''ఇహ నేను పడిపోను, నాయనమ్మా! ఇదెలా వుంటుందో చూదామనే చేశాను. ఇంత వరకు ఎప్పుడూ నేను సైకిలుమీదనుంచి పడలేదు'' అన్నాడు.

నేను ఫక్కున నవ్వాను. చూసేసరికి బెక్‌తాష్ అక్కడ గేటు గుమ్మం దగ్గర నిలబడి చూస్తున్నాడు. బెక్‌తాష్ ఏమీ అనలేదు, నేనూ ఏమీ అనలేదు, ఏమీ అనకుండానే ఒకరినొకరం అర్థంచేసుకున్నాం.

మరో నాల్గు రోజులకి పంటకోత మొదలైంది. ఓనాడు సాయంకాలం బెక్‌తాష్ నా దగ్గరకొచ్చి:

''మీ జన్‌బొలోత్‌ని కంబైన్ హెల్పర్‌గా తీసుకోవాలనుంది నాకు'' అన్నాడు.

''ఆ పనికి వాడు పనికొస్తాడని నీకు తోస్తే, అలాగే కానీ'' అన్నా.

సరే అంటే సరే అన్నాను గాని, రెండు రోజులయ్యాక, ఎలా పని చేస్తూన్నాడో ఏమిటో చూసివత్తామని పొలానికెళ్ళా. వాడింకా కుర్రాడేనాయె: వాడికి కష్టంగా వుందో ఏమిటో.

మా జన్‌బొలోత్ కంబైనుమీద గడ్డికోతకోసం హెల్పరుగా పని చేస్తున్నాడు. నన్ను చూసి, గొంతుక ఎగిరిపోయేటట్టు అరిచాడు:

''నాయనమ్మా! ఇలా చూడు, ఇక్కడున్నా!''

బెక్‌తాష్ కంబైన్ని నడుపుతూ, నాకేసి వంగి నమస్కారంచేస్తూ చేయివూపాడు.

కోతలు చూస్తూ, పొద్దు గూకేవరకూ నేను కాల్వపక్కని చెట్టు నీడను కూచున్నా. నూర్పుకళ్ళానికి గింజలు తోలుకెళ్తూ, అక్కడనుండి పొలంలోకి గింజలకోసం వస్తూన్న లారీలు రోడ్డుమీద ధూళిమేఘాల్ని లేవగొట్టుతున్నాయి.

మునిమాపు వెలుగులో కంబైన్ డ్రైవర్లు విశ్రాంతి తీసుకుందుకు వచ్చారు. జన్‌బొలోత్ అలసిపోయున్నాడు, కాని మంచి గర్వంగా మురిసి పోతూ, బెక్‌తాష్‌లానే నడవడానికి ప్రయత్నిస్తూ, అతడిలానే మాటాడకుండా బుగ్గలు పూరించి పెదవులతో బుర్ అని చప్పుడు చేస్తూ, నడుం వరకూ కాల్వలో దిగి వొళ్ళుకడుక్కున్నాడు. నా చేతిలో వున్న మూట చూసి, సంతోషంతో కేకేశాడు:

''నాయనమ్మా, ఆపిల్స్ తీసుకొచ్చావా?''

''తీసుకొచ్చా'' అన్నా.

దబ్బున నా దగ్గరకి పరుగెత్తుకొచ్చి, నన్ను కౌగిలించుకుని ముద్దు పెట్టుకున్నాడు.

బెక్‌తాష్ కిలకిల నవ్వాడు:

''ఏమిట్రా, నాయనమ్మ దగ్గర డాబులు కొడుతున్నావ్? ఇంకా బొడ్డూడని పసికందువురా నువ్వు? సరేలే, నాయనమ్మ దగ్గర ముద్దులు కుడువు — లేకపోతే తర్వాత తీరిక ఉండదు.''

చేనులోవున్న వాన్ దగ్గర పచ్చికమీద కూచుని రాత్రిభోజనం చేశాం. తాజాగా కాల్చిన రొట్టె వేడివేడిగా వుంది. వేడివేడి రొట్టెని జన్‌బొలోత్ చిదిపి:

''ఇదిగో, నాయనమ్మా!'' అన్నాడు.

రొట్టెకు ఆశీస్సులు చెప్పి, ఓ ముక్క నోట్లో వేసుకునేసరికి, సుపరిచితమైన ఆ రొట్టె వాసన, కంబైన్ ఆపరేటర్ల చేతుల వాసన,

నా నోటికి తిగిలింది. కిరసనూనె, ఇనుము, గడ్డి, ముదిరిన గింజ — అన్ని వాసనలూ కలిసి పరిమళించుతూంది. అవును, అచ్చంగా ఆ రోజుల్లో లాగానే! కన్నీళ్లతో పాటు ఆ రొట్టెను మింగుతూ రొట్టె అజరామరం, ఓ కాసీమ్, కన్నతండ్రీ, వింటున్నావా నా మాటలు! జీవితం కూడా అజరామరం, శ్రమ కూడా అజరామరం!'' అని అనుకున్నా.

కంబైను మనుషులు నన్ను ఇంటికి వెళ్లనిచ్చారు కాదు. నేను వాళ్ల అతిథిననీ, రాత్రి కూడా చేనులోనే వుండాలనీ అన్నారు వాళ్లు, గడ్డి పరచి, గడ్డిమీదనే నాకు పడక ఏర్పాటుచేశారు. ఆ రాత్రి ఆకాశంవైపు చూసేసరికి, పాలపుంత పొడుగునా పసిడివన్నె గడ్డిపరకలు పరచివున్నట్టే, గింజలూ పొల్లూ చల్లేసివున్నట్టే అవుపడింది నాకు. నక్షత్రాలు వెలుగు తూన్న ఆ ఆకాశ శిఖరాల్లో, గడ్డికోతగాని బాటకడ్డంగా ఎక్కడో ఏ దూరంనుండో వస్తూన్న గీతంలా, మిలిటరీ రైలు ఒకటి వెళ్లిపోతూంది, దాని చక్రాల శబ్దం లీలగా దూరంలో లీనమైపోతూంది. ఆ రోజు ఒక కొత్త సేద్యగాడు ప్రపంచంమీద కాలుపెట్టాడు కదా అని అనుకుంటూ నిద్దరోయాను. వాడు దీర్ఘాయుష్మంతుడై వుండాలి, ఆకాశాన ఎన్ని నక్ష త్రాలైతే వున్నాయో అన్ని గింజలు వుండాలి వాడికి.

పొద్దు పొడిచేవేళకి నేను లేచిపోయి, కంబైన్ ఆపరేటర్ల పనికి ఆటకం కల్గకుండా వుండేందుకని గ్రామంలోకి వెళ్లిపోయాను.

పర్వతాలపైన వెలిగిపోతూ అలాంటి దివ్యమైన సూర్యోదయాన్ని ఆ రోజు చూసినట్టుగా నేను చూసి ఎంతకాలమో అయింది. అనాడు భర ద్వాజ పక్షి అంత మధురంగా గానంచేసినట్టు నాకిదివరకు ఎన్నడూ అని పించలేదు. అంతకంతకు నిర్మలమవుతూన్న ఆకాశంలో ఆ భరద్వాజం మరింత మరింత ఎత్తున ఎగిరిపోయి, ఒకే చోట బూడిదెవన్నె బంతిలా అయి అక్షరాల మానవ హృదయం చందాన, కొట్టుకుంది. స్టెప్‌మైదానం అంతటా ప్రతిధ్వనించేటట్టు అనంత గీతం ఆలపించింది. ''అదుగో చూడు! మన భరద్వాజమే పాడుతూంది!'' అన్నాడు ఓ సారి సువన్‌కూల్.

ఎంత చిత్రమో, మాకొక సొంత భరద్వాజం కూడా వుండేది అప్పుడు. ఓ నా భరద్వాజమా, నువ్వు కూడా అజరామరమైనదానివే!

## 17

"ఓ, పరమపావనమైన చేనా, భూదేవీ, పంట పండించినాక నువ్వు సేదతీర్చుకుంటున్నావు. ఇక్కడ ఏ గొంతుకలూ వినబడవు, ధూళిమేఘాలను రేపుతూ మట్టిరోడ్డువెంట ఏ లారీలూ వెళ్లవు. కంబైన్లు ఏవీ కానరావు. దుబ్బుల్లో మేసేందుకు మందలు తోలే కాలం ఇంకా రాలేదు. నీ ఫలాల న్నిటినీ ప్రజకి ప్రసాదించావు. ఇహ నువ్వు పురుడుపోసుకున్న తర్వాత బాలెంతరాలికిమల్లే విశ్రమించుతున్నావు. శరత్కాలపు దుక్కులు మొదలయే వరకు నువ్వు అలసట తీర్చుకుంటావు. ఇప్పుడు మనమిద్దరమే — నువ్వూ నేనే — వున్నామిక్కడ, మరెవ్వరూ లేరు. నా బతుకంతా ఎలా వెళ్లిందో నీకు తెలుసు. ఈ రోజు స్మృతి దినం, సువన్‌కూల్‌నీ, కాసీమ్‌నీ, మసెల్ బెక్‌నీ, జైనాక్‌నీ, అలిమన్‌నీ స్మరించుకుని వాళ్ల స్మృతికి నివాళులర్పిం చుతాను. నేను బతికి వున్నన్నాళ్ళూ వాళ్లని తల్చుకుంటూనే వుంటాను. తరుణం వస్తుంది, ఆ తరుణం రాగానే జన్‌బొలోత్‌తో సర్వమూ చెబు తాను. భగవంతుడు గనుక వాడికి బుద్ధీ హృదయమూ ఇచ్చి వుంటే, వాడు అంతా అర్థంచేసుకుంటాడు. కాని, కడమవాళ్ల సంగతీ లోకులందరి సంగతీ ఏమిటి? వాళ్లందరితో కూడా నేను చెప్పాలి. వాళ్లందరి హృద యాల్లోకీ నేను దారిచేసుకుని వెళ్లగలనా?

ఓ సూర్యుడా, నువ్వు వెలుగు ఇస్తున్నావు, భూమిచుట్టూ ప్రద క్షిణ చేస్తున్నావు, అందరితోనూ చెప్పు నువ్వు!

ఓ వర్షమేఘమా, ఈ భూప్రపంచంపైన మెరపు జల్లు కురి పించు, ప్రతి చినుకునీ వాళ్లతో చెప్పమను!

ఓ తల్లీ, భూదేవీ! మమ్మల్నందరినీ నీ వక్షస్థలంమీద హత్తుకుని పెంచుతున్నావు, ప్రపంచం నలుమూలలా వున్న ప్రజలనూ నువ్వు బువ్వ పెట్టి పోషిస్తున్నావు. కన్నతల్లీ, భూదేవీ, నువ్వు చెప్పు, ప్రజలతో చెప్పు నువ్వు!''

''అలాకాదు, తొల్గొనాయ్. నువ్వే చెప్పాలి, నీది, మనిషి జన్మ. అన్నిటి కంటె ఉత్కృష్టమూ అన్నిటికంటె బుద్ధిమంతమూ అయిన మనిషి జన్మ నీది. నువ్వు — మనిషివి! నువ్వే చెప్పు!''

18

''వెళ్తున్నావా ఏమిటి తొల్గొనాయ్?''

''అవును, వెళ్తున్నా. నా కింకా ఆయుస్సు వుంటే మళ్ళీ వస్తా. సెలవు. వెళ్లొస్తా, ఓ చేనా, ఓ తల్లీ, భూదేవీ, సెలవు!''

## పాఠకులకు మనవి

ఈ పుస్తకాన్ని గురించి గానీ, దీని అనువాదాన్ని గురించి గానీ మీ అభిప్రాయాలను "రాదుగ" ప్రచురణాలయానికి తెలుపండి.

మీ అభిప్రాయాలను దయచేసి ఈకింది చిరునామాకు పంపండి:


Raduga Publishers

17, Zubovsky Boulevard,

Moscow. USSR

మా ప్రచురణలు దొరికే చోట్లు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
చంద్రం బిల్డింగ్స్
విజయవాడ — 520004

విశాలాంధ్ర బుక్ హౌస్
ఏలూరు రోడ్డు
విజయవాడ — 520002

విశాలాంధ్ర బుక్ హౌస్
సుల్తాన్ బజారు
హైదరాబాదు — 500001

విశాలాంధ్ర బుక్ హౌస్
కాలేజి రోడ్డు
అనంతపురం — 515004

విశాలాంధ్ర బుక్ హౌస్
11—1—37 గాంధీ రోడ్డు
తిరుపతి — 517501

విశాలాంధ్ర బుక్ హౌస్
సూపర్ బజారు ఎదుట
మెయిన్ రోడ్డు
విశాఖపట్నం — 530002

విశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు
హనుమకొండ
వరంగల్ — 506011

పిశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు
అరండల్ పేట
గుంటూరు — 522002